



ముఖచిత్రం :

ముగ్గు సింగారం-సిగ్గు బంగారం

చిత్రకారుడు :

వడ్డాది పాపయ్య

---


యువ సాలు చందా రు. 12-00

దీపావళి ప్రత్యేకసంచికతో రు. 17-0

యువ, సైఫాబాద్, హైదరాబాద్-

SEE

19584

SUNIL DUTT SAIRA BANU

MEHMOOD

OM PRAKASH

AND

KISHORE KUMAR



Mahmood PRODUCTIONS'

# Padosan

in eastmancolor



**ZAMARRUD ★ KRISHNA**
HYDERABAD



**KALPANA & MINERVA**
SECUNDERABAD

***also at: MAJOR CENTRES***

— **Rajshri Pictures Pvt. Ltd. Release**




డిసెంబరు సంచికలో మీరు ప్రచురించిన "మంత్రప్రభావం" నవల చాలా బాగుంది. ఇందుకు మీకూ, రచించిన అనురూపాదేవిగారికి నా అభినందనలు - మరియుఆట్టలోపలి రెండుజాతులు 'రెండు తేశాలు' చిత్రాలు చాలా బాగున్నవి.

ఎస్. పి. వెంకటేశ్వర్లు
పండితాల

డిసెంబరు సంచిక "యువ" చాలా బాగుంది. ముఖ్యముగా తాళ్ళూరు నాగేశ్వరరావుగారి "వలపు వెన్నెల కథ నన్నెంతో ఆకర్షించింది. సంఘంలో వున్న యదార్థమును నిజంగా జరుగుచున్నది రచించారు. కథ చిన్నదైనా చదువుతున్నంత సేపు హాయిగా వున్నది.

యద్దనపూడి సులోచనారాణిగారి "మీనా" సీరియల్ ఇంట్రస్టింగావున్నది. కథను సుఖాంతము చేస్తారని ఆశించుచున్నాను. ప్రతినెలకంటె డిసెంబర్ సంచికలో కథలు నన్నెంతో ఆనందపరిచాయి.

సి. నాగేశ్వరి
సికింద్రాబాదు

Hilarious Social Comedy

from

GEMINI

# TEEN BAHURANIYA

తీన్ బహూరాణియాఁ



जेमिनी चित्र

तीन बहूरानियाँ

ईस्टमन कलर

संवाद: किशोर साहू • गीत: आनंद बक्षी • संगीत: कल्याणजी – आनंदजी

निर्माता-निर्देशक: एस.एस. वासन और एस.एस. बालन

---

| | | |
|---|---|---|
| **ROYAL** | **Next Change** | **?** |
| **HYDERABAD** | **At** | **SECUNDERABAD** |

---

***Released Through***

**MS. SHINDE SARPOTDAR & CO.**

5, Rashtrapathi Road, SECUNDERABAD

డిసెంబరు నెల యువ సంచికలో ఆదిమధ్యం రమణమ్మగారి 'కుడిఎడమల' కథ చదివాను.

ముందునుంచీ ప్రేమంచేను, పెళ్ళం చేనూ కూడా నమ్మకంలేక భయపడే సంధ్య కొన్నాళ్ళు స్నేహంగా ఉండి కొంతవరకు తనను అర్థంచేసుకున్న మధుసూదన్‌ని కాక, కొత్త వ్యక్తి రఘుని పెళ్ళాడడానికి ఎలా ఒప్పుకుందా అనిపించింది.

అయితే ఒక అబ్బాయిని మనస్ఫూర్తిగా ప్రేమించి పెళ్ళిచేసుకునే ధైర్యము లేక. పెద్దలమీద నమ్మకం ఉంచి వారు చూపించిన అబ్బాయిని పెళ్ళిచేసుకొన లేక మానసికంగా నలిగిపోయే నేటిమధ్య యుగపు కన్యలకు ప్రతీక సంధ్యపాత్ర।

శాంతమూర్తి
హైదరాబాద్

డిసెంబరు మాసపు "యువ" చాలా బాగుంది. ముఖ్యంగా లాటరీ" లను గూర్చిన మీ సంపాదకీయం చాలా సమంజసంగా ఉంది. శ్రీ తాళ్ళూరి నాగేశ్వరరావు వ్రాసిన "వలపు వెన్నెల" ఎంతో బావుంది. కార్టూన్లు పత్రికకు ఆయువుపట్టుగా పేర్కొనవచ్చు.

"కుడియెడమల మధ్య" రచన చాలా చక్కగా వుంది. రచయిత్రి ఆదిమధ్యం రమణమ్మగారికి నా అభినందనలు.

చిలకప్రియ
హైద్రాబాదు

తప్పక చూడండి

పుణ్యదంపతులు శ్రీరామచంద్రమూర్తికి
సీతాదేవికి వియోగమేల కలిగెను?
ఈ కథా సారాంశములో శ్రీమతి కళ్యాణం
ముఖ్యాంశము అదే......

పద్మనాభం సమర్పించు
రేఖా & మురళీ ప్రొడక్షన్స్




రామకథ

స్క్రీన్ ప్లే దర్శకత్వం: పద్మనాభం
నిర్మాత బి. పురుషోత్తం

# యువ

## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 19 | జనవరి, 1969 | సంచిక 1


**1968** సంవత్సరం అయిపోయింది. కొత్త సంవత్సరం ఆరంభమైంది. వ్యావహారిక గణనలో ఒక సంవత్సరంకాలం చాలా పరిగణనీయమైనదే. ఒక ఏడాదిలో మనుష్యుడి జీవితంలో జరిగిన సంఘటనలను, దేశంలో పరిస్థితుల మార్పులను సమీక్ష చేసుకోవడమూ, జరిగిన దానిని ఆధారంగా జరుగవలసిన దానిని సరిదిద్దుకోవడమూ మామూలుగా, వ్యక్తులకూ, సంస్థలకూ మాత్రమే కాక, ప్రభుత్వాలకు కూడా కర్తవ్యము.

జరిగిపోయిన సంవత్సరాన్ని సమీక్షచేస్తే, మనం మనదేశం అభివృద్ధిమార్గంలో నడచేటట్టు చెయ్యలేదనే విషయం స్పష్టమవుతోంది. దేశంలో శాంతిభద్రతలు గాని, ఆర్థిక పటిష్ఠతగాని ఏమాత్రం తృప్తికరంగాలేవని అంగీకరించక తప్పదు

దేశం బాగుపడాలంటే ప్రజల ఆర్థికవ్యవస్థ బాగుపడాలి. ప్రజల ఆర్థికవ్యవస్థ బాగుపడాలంటే, సమష్టిగా ప్రజలందరూ కృషిచెయ్యాలి. ప్రజలలో ఏ ఒక వర్గమూ, ఇతర వర్గాలకు నష్టం వాటిల్లేటట్టు ప్రవర్తించకూడదు. ప్రతి వ్యక్తీ, ప్రతివర్గమూ తమతమ బాధ్యతలను ఏమాత్రం ఏమరకుండా, ఏమాత్రం నిర్లక్ష్యం లేకుండా నిర్వర్తించాలి. ఈ ధర్మం ఎవరికీ తెలియనిది కాదు; అందరికీ తెలిసినదే.

పెరగడమూ, జీతాలు పెరిగాయనే కారణంచేత ధరలు పెరగడమూ మన దేశంలో ఒక దురవస్థగా పరిణమించింది. ఈ దురవస్థ తొలగాలంటే ధరలను అదుపులో పెట్టకతప్పదు. దానికి ప్రభుత్వం గట్టిచర్య తీసుకోవడం తప్ప వేరే మార్గంలేదు.

1968 సెప్టెంబరు నెలలో మనదేశంలోని కేంద్రప్రభుత్వ ఉద్యోగులు కొంత మంది, జీతాలూ, అలవెన్సులూ ఎక్కువగా కావాలని కోరుతూ సమ్మెచేశారు. ప్రజాబాహుళ్యం దృష్టిలో ఈ సమ్మె ఎంతమాత్రమూ సబబుగాలేదు. కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులజీతాలు, రాష్ట్రప్రభుత్వ ఉద్యోగుల జీతాలకంటె ఎక్కువ. నెలజీతాలు, అలవెన్సులుకాక, ప్రభుత్వోద్యోగులకు, ఇతర ఉద్యోగులకు లేని సౌకర్యాలు ఎన్నోవున్నవి. పైగా, వీరికంటె తక్కువ జీతాలు తీసుకుంటున్న వారెందరో చేసేపనితో పోల్చిచూస్తే, వీరుచేసేపని తక్కువ. తమతోపాటు జీవిస్తున్న అసంఖ్యాకులైన ప్రజల పరిస్థితులను గమనించకుండా, తమకు మాత్రం ఎక్కువగా జీతాలూ, భత్యాలూ ఇమ్మని కేంద్రప్రభుత్వ ఉద్యోగులు సమ్మెకు దిగడం, సామాన్యప్రజలు హర్షించలేకపోయారు. ప్రభుత్వ ఉద్యోగాలలో వున్నవారుగాని, ప్రైవేటు పరిశ్రమలలో ఉద్యోగాలలో వున్నవారుగాని, ధరలను అదుపులో పెట్టడంలో ప్రభుత్వానికి తోడ్పడి, సామాన్య ప్రజల కష్టాలను తొలగించడానికి కృషిచెయ్యాలి. రూపాయల లెక్కలో ఆదాయాన్ని పెంచుకోవడంగాక, వచ్చే ఆదాయంతో వీలైనన్ని వసతులను అనుభవించాలంటే, ధరలు పెరగకుండా చూడడమే వ్యక్తుల కర్తవ్యంకూడా. 1969 లోనైనా యీ విషయంలో సరియైన కృషి జరిగితే, మనదేశం బాగుపడుతుంది; అంటే ప్రజలు సుఖపడతారన్నమాట.

1968 లో దేశంలో అందరికీ క్షోభకలిగించిన మరొకవిషయం ఏమిటంటే, విద్యార్థుల అలజడి. ఈనాడు విద్యార్థులు, మనదేశంలోనేకాక ప్రపంచమంతటాకూడా, ఒక అలజడి పరిస్థితిలో వున్నారు. దీనికి బాధ్యత, రాజకీయాలలో నిమగ్నులై, రాజకీయాలను వృత్తిగా పెట్టుకున్న వ్యక్తులదే. రాజకీయ ప్రయోజనాలకు విద్యార్థులను ఉపయోగించుకోవడం రాజకీయనాయకులు ఎప్పుడైతే ప్రారంభించారో, అప్పుడే విద్యార్థుల విద్యార్థిత్వాన్ని భగ్నంచేసిన వారయారు. రాజకీయ ప్రదర్శనాలలో పాల్గొనే విద్యార్థులకు చదువు ఎలా

అనేక ఫాక్టరీలలో ఉత్పత్తి అయిన సరకులు అమ్ముడుకాకపోవడమూ, అందువల్ల చాలా ఫాక్టరీలు మూసివేయబడడమూ, చాలా ఫాక్టరీలలో పనివారలను తగ్గించివెయ్యడమూ, ఆ కారణంచేత నిరుద్యోగం ఎక్కువ వడమూ జరిగింది. ఆర్థికంగా, 1968 సంవత్సరములో ఎన్నో కుటుంబాలు చాలా కష్టపడ్డాయి. ఎన్నో పరిశ్రమలు దెబ్బతిన్నాయి. ఉత్పత్తి అయిన సరకు అమ్ముడుకాక ఫాక్టరీలలోనే వుండిపోయినందున పెట్టుబడిదారులు చాలా మంది చిక్కులో పడ్డారు. వ్యక్తుల ఆదాయం వృద్ధిపొందకపోగా సరకుల ధరలు పెరిగినందువల్ల వ్యక్తులకు కొనుగోలుశక్తి చాలలేదు. ధరలు పెరగకుండా, వాటిని అదుపులోకి తెచ్చేమార్గం ప్రభుత్వం ఇంతవరకూ కనిపెట్టలేకపోయింది.

ధరలు మరీ పెరిగిపోయినందువల్ల కలిగేచిక్కులు, ప్రధానమైనవి రెండు. నిత్యావసరవస్తువులను కొనుక్కునే శక్తి చాలనందున ఉద్యోగాలలో ఉన్నవారు ఎక్కువ జీతాలను అడగడం ఒకటి, వస్తువులు అమ్ముడుకానందున ఉత్పత్తి ఎక్కువ చెయ్యలేక ఫాక్టరీలలో ఉద్యోగస్తులను తగ్గించడం రెండు వీటివల్ల కలిగే ఫలితం ఏమిటంటే, వ్యాపారం మందగించి, ప్రభుత్వానికి పన్నులు తగ్గిపోతాయి. ఆదాయం తగ్గినప్పుడు, ప్రభుత్వంగాని, ప్రైవేటుసంస్థలకు గాని తమ ఉద్యోగులకు ఎక్కువ జీతాలు ఇచ్చేశక్తి రాదు. ఈ పరిస్థితిని తొలగించి ఆర్థికవ్యవస్థను పటిష్ఠం చెయ్యాలంటే, ప్రభుత్వం ఎప్పుడో ఒకప్పుడు, ప్రజలలో కొందరికిగాని, పరిశ్రమల యజమానులలో కొందరికిగాని నష్టంవచ్చినా, యిష్టం లేక పోయినా గట్టిచర్య తీసుకోకతప్పదు. అదేమిటంటే, వస్తువుల ధరలను తగ్గించి, ఏ పరిస్థితులలోను అవి పెరగకుండా దిట్టమైన ఏర్పాటు చెయ్యడం. అలా చేసిననాడు, ఒక ఏడాదిపాటు ప్రభుతా దాయం కొంత తగ్గవచ్చును; పరిశ్రమల యజమానుల ఆదాయం కొంత తగ్గవచ్చును. కాని, ఉద్యోగస్తులు ఎక్కువ జీతాలు, అలవెన్సులు ఇమ్మని అడగడానికి అవకాశం వుండదు. ఉత్పత్తి అయిన సరకులు అన్నీ అమ్ముడుపోతాయి. అందువల్ల ఏ ఫాక్టరీని మూయ్యవలసిన అవసరంగాని, పనివారిని తగ్గించవలసిన అవసరంగాని ఉండకపోగా, ఫాక్టరీలు బాగా పనిచేస్తే ఎక్కువ మందికి ఉద్యోగాలు లభించే అవకాశం ఏర్పడతుంది. ఇవన్నీ ఆలోచించి, 1969లో ఏ వస్తువుధరా పెరగకుండా ప్రభుత్వం కట్టుదిట్టంచెయ్యాలి. దానికితోడు, ఉద్యోగల జీతాలుగాని, అలవెన్సులుగాని పెంచకుండా వుండాలి. ధరలు పెరిగాయనే కారణంచేత జీతాలు

పెరగడమూ, జీతాలు పెరిగాయనే కారణంచేత ధరలు పెరగడమూ మన దేశంలో ఒక దురవస్థగా పరిణమించింది. ఈ దురవస్థ తొలగాలంటే ధ లను అదుపులో పెట్టకతప్పదు దానికి ప్రభుత ం గట్టిచర్య తీసుకోవడం తప్ప వేరే మార్గంలేదు.

1968 సెప్టెంబరు నెలలో మనదేశంలోని కేంద్రప్రభుత్వ ఉద్యోగులు కొంత మంది, జీతాలూ, అలవెన్సులూ ఎక్కువగా కావాలని కోరుతూ సమ్మెచేశారు. ప్రజాబాహుళ్యం దృష్టిలో ఈ సమ్మె ఎంతమాత్రమూ సబబుగా లేదు. కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులజీతాలు, రాష్ట్రప్రభుత్వ ఉద్యోగుల జీతాలకంటె ఎక్కువ. నెలజీతాలు, అలవెన్సులుకాక, ప్రభుత్వోద్యోగులకు, ఇతర ఉద్యోగులకు లేని సౌకర్యాలు ఎన్నోవున్నవి. పైగా, వీరికంటె తక్కువ జీతాలు తీసుకుంటున్న వా రెందరో చేసేపనితో పోల్చిచూస్తే, వీరుచేసేపని తక్కువ. తమతోపాటు జీవిస్తున్న అసంఖ్యాకులైన ప్రజల పరిస్థితులను గమనించకుండా, తమకు మాత్రం ఎక్కువగా జీతాలూ, భత్యాలూ ఇమ్మని కేంద్రప్రభుత్వ ఉద్యోగులు సమ్మెకు దిగడం, సామాన్యప్రజలు హర్షించలేకపోయారు. ప్రభుత్వ ఉద్యోగా లలో వున్నవారుగాని, ప్రైవేటు పరిశ్రమలలో ఉద్యోగాలలో వున్నవారుగాని, ధరలను అదుపులో పెట్టడంలో ప్రభుత్వానికి తోడ్పడి, సామాన్య ప్రజల కష్టా లను తొలగించడానికి కృషిచెయ్యాలి. రూపాయల లెక్కలో ఆదాయాన్ని పెంచుకోవడంగాక, వచ్చే ఆదాయంతో వీలైనన్ని వసతులను అనుభవించా లంటే, ధరలు పెరగకుండా చూడడమే వ్యక్తుల కర్తవ్యంకూడా. 1969 లో నైనా యీ విషయంలో సరియైన కృషి జరిగితే, మనదేశం బాగుపడుతుంది; అంటే ప్రజలు సుఖపడతా రన్నమాట.

1968 లో దేశంలో అందరికీ క్షోభకలిగించిన మరొకవిషయం ఏమిటంటే, విద్యార్థుల అలజడి. ఈనాడు విద్యార్థులు, మనదేశంలోనేకాక ప్రపంచ మంతటాకూడా, ఒక అలజడి పరిస్థితిలో వున్నారు. దీనికి బాధ్యత, రాజకీయా లలో నిమగ్నులై, రాజకీయాలను వృత్తిగా పెట్టుకున్న వ్యక్తులదే. రాజకీయ ప్రయోజనాలకు విద్యార్థులను ఉపయోగించుకోవడం రాజకీయనాయకులు ఎప్పుడైతే ప్రారంభించారో, అప్పుడే విద్యార్థుల విద్యార్థిత్వాన్ని భగ్నంచేసిన వారయారు. రాజకీయ ప్రదర్శనాలలో పాల్గొనే విద్యార్థులకు చదువు ఎలా

సాగుతుంది. వారిలో ఒక ఐకమత్యతగాని, సహోదర భావంగాని ఎలా స్థిర పడుతుంది? జాతి, దేశం బాగుపడాలంటే ఏ రాజకీయవాదీ విద్యార్థుల జోలికి పోకూడదు. స్కూలుకు, కాలేజీకి పోతున్న ప్రతిబాలుడూ, ప్రతిబాలికా తన చదువుపూర్తి అయినదాకా, చదువుతప్ప మరొక సంగతిని పట్టించుకోకుండా వుంటేనే, వారి విద్యార్థిత్వం ఫలవంతమౌతుంది. విజ్ఞాన సంపాదనలో నిమగ్నులై, భావిపౌరులుగా సుశిక్షణ పొందినతరువాత, వారు విద్యార్థిదశనుంచి విరమించినవారవుతారు. అప్పటివరకు రాజకీయాలలో పాల్గొనడం, రాజకీయనాయకుల ఆదేశాలప్రకారం ప్రదర్శనలలో పాల్గొనడం, విద్యార్థులకు మంచిదికాదు. అయితే, రాజకీయాలను గమనించడం, రాజకీయ శాస్త్రాన్ని ఆకళింపు చేసుకోవడము, విద్యార్థులకు అవసరమే, రాజకీయాలు విద్యార్థులకు తాము చదివే ఒకవిషయంగానే వుండాలిగాని, తాము పాల్గొనవలసిన ఆందోళనగా వుండకూడదు. విద్యార్థులను రాజకీయాలలోకి లాగే రాజకీయనాయకులు దేశానికి చాలా అపకారంచేసినవారవుతారు. చదువు పూర్తి అయినదాకా రాజకీయాలలోకి దిగవద్దు అని విద్యార్థులకు బోధించినవారే దేశానికి ఎంతో మేలుచేసినవారవుతారు. 1969 లో నైనా, రాజకీయవాదులు తమ స్వప్రయోజనంకోసం విద్యార్థులను ఉపయోగించుకోవడం మానివేస్తే, 1970 నాటికి విద్యార్థులు తమలోతాము ఐక్యతతో, సోదరభావంతో, తమ చదువును ఏ విధమైన అంతరాయం లేకుండా పూర్తి చేసుకోగలుగుతారు. అలా చదువు పూర్తిచేసుకున్న విద్యార్థులు, తరువాత ఏ రాజకీయ పక్షంలో చేరినా, దేశాన్ని ప్రగతిపంథాలో నడపగల దక్షతకలవారవుతారు.

---

# చిత్రవార్తలు



"సుడిగుండాలు" చిత్రానికి రాష్ట్రపతినుండి బహుమతినందుకుంటున్న
నిర్మాత – నటుడు పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు

---

ఎన్. టి. ఆర్. ఎస్టేట్ – రామకృష్ణ 70 మి.మి. థియేటరుకు ప్రారంభోత్సవంచేసిన
ముఖ్యమంత్రితో శ్రీ ఎన్. టి. రామారావు



# వాసనుడు

## 'మురయా'

వెంకట్రామయ్య గొడ్లపాకముందు బాదంచెట్టు నీడలో నిలబడి నాలుగు వైపులా తృప్తిగా చూచాడు. అప్పుడే విడిచిపెట్టిన దూడలు ఆత్రంగా పాలు కుడుస్తున్నాయి. గోమాతల కళ్ళల్లో సంతృప్తి సంతోషం కన్పించాయి ఆయనకు. తనకు కలిగిన ఆ తృప్తివిషయం జ్ఞాపకంవచ్చింది. అప్రయత్నంగా ఇంటివైపు చూచాడాయన. ఎదురుగా, దూరంగా అరుగుమీద భార్య కన్పించింది.

పార్వతమ్మ ఒకసారి భర్తవంక చూచింది.

'మగవాడు ఇంత అందగాడుకావడం ఒకరకంగా ప్రమాదమే. కాని నా అదృష్టంబాగుంది' అనుకొని ఆవిడ చిరునవ్వు నవ్వుకొంటూ నెమ్మదిగా లోపలికి వెళ్ళింది. మళ్ళీ అంతలో అక్కడకు తిరిగివచ్చి ''శాంతా ఇక్కడే ఉన్నావా త్వరగా వచ్చి చల్లచెయి. ముందు కాఫీ కలిపి ఇవ్వు." అన్నది.

తులసికోటచుట్టూ ముగ్గులువేస్తున్న శాంత నెమ్మదిగా లేచి నిలబడి చేతులు దులుపుకొని "ఇదుగో వస్తున్నానండీ" అన్నది. అందుకు పార్వతమ్మ "అండి ఏమిటి– కొండి ఈ నాగరికాలు నచ్చవు నాకు. సరే ముందు పనికానీ" అన్నది.

శాంత తలవంచుకొని మెల్లగా అడుగులో అడుగువేసుకొంటూ ఒయారంగా ముందుకు నడిచింది. శాంత దగ్గరకు వచ్చాక ఆవిడ నవ్వుతూనే "అదుగో. ఆ ఒయ్యారమే వద్దన్నాను. గబగబానడు" అన్నది.

శాంత లోపలకు వెళ్ళింది.

వెంకట్రామయ్య నెమ్మదిగా అరుగు దగ్గరకు వచ్చి "ఏమిటి అంటున్నావ్" అన్నాడు. ఏంలేదు. ''ఈపాటికి పెళ్ళి చేస్తే ఎంతమంది కలిగేవారో–అన్నాను." అన్నది ఆయనభార్య. అందుకు ఆయన నవ్వుతూ "మరి అలాఅయితే – అయిందిగా నీకు–ఎంతమంది కలగవలసింది'' అన్నాడు.

పార్వతమ్మ ఒకసారి భర్తవంక కోపంగా చూచి చప్పున వెనుతిరిగి పెద్ద పెద్ద అంగలువేసుకొంటూ హడావిడిగా లోపలకు వెళ్ళింది. ఆవిడ ఒకసారి ఇంటి ముందుకువెళ్ళి మళ్ళీ లోపలకువచ్చి

ఆయాసపడుతూ "ఏమే శాంతా, గుమ్మం ముందు ముగ్గువెయ్యాలని కూడా తెలియదా?" అన్నది పెద్దగా.

శాంత ప్రక్కగదిలోనుంచి నెమ్మదిగా అక్కడకువచ్చి "అలాగే" అని వీధిగుమ్మంవైపు వెళ్ళింది. అలా వెళుతూ వెంకట్రామయ్య చూపులు తన్ను వెంటాడుతున్నాయని శాంత అనుమానించింది.

పార్వతమ్మ అరుపులు, పురమాయింపులు శాంతకు క్రొత్తేమీకాదు. ఆమెకు మరీ క్రొత్తగా కన్పిస్తున్నదల్లా వెంకట్రామయ్య పోకడే.

* * *

"అమ్మా ఇంకనేను ఇక్కడఉండనే. రేపో ఎల్లుండో నేను మళ్ళీ తాతయ్యగారి ఊరు వెళ్ళిపోతాను" అన్నది శాంత-తల్లి ప్రక్కమీద కూర్చుంటూ. అప్పటికే ప్రొద్దుపోయింది. శాంతతల్లి నాగమ్మ అప్పుడే నడుంవాల్చింది. ఆవిడ కూతురువీపు నిమురుతూ "ఎందుకమ్మా అలా అంటున్నావ్. ఏం- పార్వతమ్మ పనులు ఎక్కువ చేయిస్తున్నదనా? నాకు మళ్ళీ కొంచెం ఓపికరానీ-సగం పనులు నేనేచేస్తాను. అక్కడమాత్రం నీకు ఎవరున్నారు తాతయ్య ఉన్నంత కాలం ఏదోలా కష్టపడుతూ అక్కడ గడిపావు. ఇక నీకు ఇక్కడ తప్పదు. ఆవిడ అలా అరుస్తుందేకాని చెడ్డమనిషి కాదు. నాకు అన్నాళ్ళు జబ్బుచేసి లేవలేకపోతే ఎంతో సహాయం చేసింది. 'పెద్దమ్మా నువ్వు మందు తాగావా'అంటూ ఈ పాకలోకి రోజూ కనీసం ఒక్కసారి అయినా వచ్చివెళ్ళేది, ఆరెండునెలలూ. మన బ్రతుకంతా వాళ్ళమీదే ఆధారపడి ఉంది. దిక్కులేక ఇక్కడకు చేరినప్పటినుంచీ నన్ను ఆవిడే ఆదుకొన్నది. మీ తాతయ్య నిన్ను పెంచాడూ- అంటే అదంతా ఆవిడచలవే. నీకు ఓ అక్షరం ముక్క అబ్బిందీ అంటే- అందుకు కారణం ఆవిడే. చెడిపోయిన మనిషినీ ఆమనిషి కూతురునూ ఇంతగా ఎవరు ఆదరిస్తారే? మనం ఆవిడకు కృతజ్ఞత చూపాలి. ఆవిడ ఏమన్నా పడాలి. ఏపని చెప్పినా చెయ్యాలి. ఈమాత్రం పైపనులు చెయ్యడానికే నీకు కష్టమైతే ఎలా."

"అదికాదే ఆవిడ పనులు చేయిస్తున్నదనీ, సాధిస్తున్నదనీ నేను బాధపడటంలేదు కాని ఆయన..." అని ఆగింది శాంత, అందుకు వెంటనే ఆవిడ అందుకొని 'ఛఛ. ఆయన్నుగురించి ఏమీ చెప్పకు. ఆయన అన్ని విధాలా యోగ్యుడు. ఊరంతా తరిమికొడితే ఇక్కడచేరాను. దొడ్లో ఈ పాకవేయించి ఇచ్చాడు. ఎవరిబాధా లేకుండా నిన్ను అక్కడ పెంచి పెద్దదాన్ని చేయడానికి సహాయంచేశాడు. ఆవిడతో మన బంధుత్వం ఏపాటిది. కేవలం ఆయన వల్లనే నా బ్రతుకు ఇలా ఇన్నాళ్ళూ నిశ్చింతగా గడిచింది. వాళ్ళమీద నేరాలు




చెప్పకు. సంతానం కలగలేదని వాళ్ళ ఇద్దరికీ ఒకరిమీద ఒకరికి కోపం, ఆ కోపం అప్పుడప్పుడు వారిమీదా, వీరిమీదా చూపిస్తుంటారు. ఇవన్నీ నీకుచెప్పినా తెలియవులే. ఇంక నువ్వెళ్ళి పడుకో." అని నాగమ్మ మరోవైపు తిరిగి పడుకున్నది. శాంత అక్కడనుంచి లేచివెళ్ళి, ప్రక్క వేసుకొని పడుకొన్నది.

'ఆయన అలా చేసాడనుకో లేదు.' అనుకొన్నది శాంత ఒకటికి రెండుసార్లు.

పదిరోజులుగా ఆయన తన్ను చూపులతో వేధించడం జరిగింది. ఏమిటో– అనుకొన్నది. ఎవరూ చూడనప్పుడు ఆయన యధాలాపంగా తన ఒంటిమీద చేయివెయ్యడం, తను సిగ్గుపడడం, తర్వాత రెండు మూడుసార్లు మృదువుగా చెక్కిళ్ళు స్పృశించడం తను చలించడంకూడా జరిగింది. మురిసిపోవడం, ముసిముసి నవ్వులు నవ్వడం ఎందుకో మొదట అర్థంకాలేదు, కాని తర్వాత తర్వాత అర్థం అయింది. కాని తను ఏమీ అనలేదు. ఎందుకో ప్రతిసారీ భయంవేసింది. ఒళ్ళు కంపించింది. అంతలో పులకరించింది. క్రొత్తగానూ ఉన్నది. మనసు మనసులో లేకుండానూ పోయింది. కొన్నిసార్లు వారిద్దామని గట్టిగా అనుకొన్నది. ఎలా వారించాలో తెలియకపోయింది. ఏమంటే ఏమవుతుందో అనీ, ఎవరికి తెలిస్తే ఏమంటారో అనీ భయపడి ఊరుకొన్నది. ఊరుకోకతప్పదని అనిపించింది.

అంతలో అనుకోకుండా ఇలాజరిగింది.

ఆ రోజు రాత్రి తొమ్మిదిగంటలకు ఆయన ముందుగదిలో పట్టిమంచంమీద పడుకొన్నాడు. రోజూ ఆయన అక్కడ కాసేపు విశ్రమించి, శాంత పనులు ముగించి పెరట్లోకి వెళ్ళాక పైకి వెళతాడు. ఆయనభార్య ఎనిమిది కాగానే పైకివెళ్ళి పడుకొంటుంది. రోజూ పైకి వెళ్ళేముందు గ్లాసునిండా పాలుతాగి వెళ్ళడం ఆయనకు అలవాటు. అలా పాలు శాంతఇవ్వాలి

రోజూలాగానే పాలగ్లాసు మంచం ప్రక్కన బల్లమీదపెట్టి వెళుతుంటే ఆయన నెమ్మదిగా 'శాంతా' అని పిలిచాడు.

శాంత వెనుతిరిగి చూసింది,

వెళ్ళిపోతున్న వసంత వెనుతిరిగి చూచినట్టు అనిపించింది - వెంకట్రామయ్యకు. దగ్గరకు రమ్మని సంజ్ఞ చేశాడు. వచ్చిన మరుక్షణంలో ఆయన శాంత చెయ్యి గట్టిగా పట్టుకొని 'కోపమా' అన్నాడు.

శాంత మారుమాటాడలేదు. తల వంచుకొన్నది; సిగ్గుతో తలదించుకొని పోయింది. భయంతో వణికిపోయింది. అంతలో ఆయన శాంతను ఒక్కవేటున హఠాత్తుగా తనపైకి లాక్కొనిగాఢంగా ఆలింగనం చేసుకొన్నాడు. ఎడంచేయి నడుముచుట్టూ పెనవేసి కుడిచేత్తో మెడ మీద నొక్కుతూ ముఖం ముందుకు లాక్కొని ఆమెను ఉక్కిరిబిక్కిరిచేస్తూ గట్టిగా చాలా సేపు అధరాలను చుంబించాడు. ఆవేశంలో తన్నుతాను మరచిపోయి పెదిమలపైనా, నుదుటిపైనా, వక్ష ఉపరిభాగంపైనా మళ్ళీమళ్ళీ గట్టిగా ముద్దు పెట్టుకొన్నాడు.

ముద్దుల జడివాన వెలిశాక ఆయనకు ఆవేశం కొంతతగ్గింది బిగి కౌగిలి సడలించికూడాను.

శాంత తెప్పరిల్లుకొన్నది.

ఆమె చప్పున ఆయన కౌగిలినుంచి తప్పించుకొని గబగబా బయటకు వెళ్ళింది. ఆయన అక్కడే నిలబడిపోయాడు.

* * *

శాంత పెదిమలను మునిపళ్ళతో గట్టిగా నొక్కుకొన్నది.

ఎంతసాహసం!

తలుపులు తెరిచేఉన్నాయి.

ముందు పెరట్లో పనివాళ్ళు తిరుగుతూనే ఉన్నారు. మేడపైన పార్వతమ్మగారు మేల్కొనే ఉన్నది ఎవరు ఏక్షణంలో అయినా ఆ గదిలోకి రావచ్చును. కాని ఎవరూ పిలిస్తేనేకాని రారు. అదీ ఆయన పిలిస్తేనే. తను పిలిస్తే రాకపోవచ్చు. ఆవిషయం తనకూ తెలుసు.

'అదే ఆయనధైర్యం కాబోలు' అనుకొన్నది శాంత, మళ్ళీ అంతలో 'అబ్బే' కాని.. ఇలాజరుగుతుందని అనుకోలేదు' అనుకొన్నది. ప్రక్కకు ఒత్తిగిలి పడుకొంటూ. కళ్ళు గట్టిగా మూసుకొని



తల్లికి ఫిర్యాదుచేసినా ప్రయోజనం లేక పోయిందే - అని ఎంతోసేపు మదన పడ్డది శాంత. ఆమె తల్లి చెప్పినమాటలు జ్ఞాపకం చేసుకొన్నది. తల్లి హితబోధ బోధపడలేదు శాంతకు. ఆమెకు మరో మార్గాంతరం కూడా కన్పించలేదు 'ఇందులో నా దోషంమాత్రం లేదా' అని ఒకటి రెండుసార్లుకన్న తాను ప్రశ్నించు కొన్నది. తోచిన సమాధానం ఆమెకు తృప్తిగా నచ్చలేదు. విసుక్కొంటూ శాంత మరోప్రక్కకు తిరిగి పడు కొన్నది. అంతలో మళ్ళీ ప్రక్కలో అటూఇటూ మసలి బొక్కబోరలా పడు కొని కళ్ళుగట్టిగా మూసుకొన్నది

శాంతకు ఆరాత్రి ఎప్పటికోగాని నిద్రపట్టలేదు.

*    *    *

'పార్వతమ్మ నలతగా ఉండడానికి కారణం అదికాదని విన్న ఆ డాక్టరు చెప్పివెళ్ళాడట గాని నిజమేనా శాంతా. ఆవిడ నీకేమైనా చెప్పిందా? ఈ పది రోజులనుంచీ ఆవిడకు సేవలు చేస్తూ నువ్వు ఆవిడదగ్గర చనువు సంపాదించి నట్టున్నావ్; అడగలా?' అన్నదినాగమ్మ.

'ఎలా అడగను. నాకు సిగ్గుకాదమ్మా. కాని ఆవిడేచెప్పింది. ఇది అదే అయితే తనూ ఆయనా ఎంతో సంతోషించేవార మనీ, దాని ఆ అదృష్టం తమదేననీ, పైగా ఈ ఉదరవ్యాధి మూలంగా తమకు తీరని అశాంతి కలుగుతున్నదనీ చెప్పు కొని ఎన్నోసార్లు కంట తడిపెట్టింది. ఆయనధోరణి ఇలాగేఉన్నది. ఏమిటో వీళ్ళగొడవ నాకేం అర్థం కావటంలేదు' అన్నది శాంత.

శాంతకు బాగా అర్థం అయిందని నాగమ్మ నిర్ధారణ చేసుకొన్నది —మన సులో. ఆవిడ అంతలో ఆవిషయం మార్చి 'అది సరేకాని శాంతా నువ్వు ఇవ్వాళ సాయంత్రం వీధిలోకివెళ్ళి ఎవరి తోనో మాటాడివచ్చావు కదూ ? ఎవర తను. నీ అంతట నువ్వే చెబుతావను కొని అడగలేదు.' అన్నది. అందుకు శాంత సమాధానం చెప్పలేదు. ఆవిడ మళ్ళీ అడిగింది. "అవునే శాంతా—నాకు చెప్పకూడదా ? అతను విన్నా మొన్నా కూడా వచ్చివెళ్ళాడు. ఇందాక పార్వ తమ్మ నాతో అన్నది. అతన్ని ఆవిడ చూచిందట. నువ్వు అతగాడితో అంత సేపు మాటాడి రావలసిన అవసరం ఏమి వచ్చిందనీ, నేను వెనకఉండి చేయవల సిన పని ఇదేనా అనీ సూటిపోటుమాటలు అన్నది. సరేఇంతకూ అతను ఎవరు?" అన్నది రెట్టిస్తూ.

శాంత నెమ్మదిగా 'ఇందులో అంత దాపరికం ఏమీలేదమ్మా. తాతయ్యగారి ఇంట్లో ఉండగా పరిచయం అయింది. అతనే కావాలని నాతో పరిచయం చేసు కొన్నాడు. ఆఊరే అతనిది. వాళ్ళది మంచి కుటుంబమేనట. ఈ ఊళ్ళో ఎవరో బంధువులు ఉన్నారని వచ్చాడు' అన్నది.

'అంతేనా ?' గద్దించి అడిగింది నాగమ్మ.

'కాదు — అతను నన్ను ప్రేమిస్తు న్నాడు.'

'సరె, సరె. ఇంకేం, ఊం తర్వాత?'

కాలంనాడు నాగమ్మకూడా ఈమాటే అన్నది — తండ్రితో. ఇరవైఏళ్ళనాటి సంగతులు అన్నీ ఒకసారి జ్ఞాపకం వచ్చాయి. ఆవిడ కళ్ళవెంట నీళ్ళు తిరి గాయి. ఆనాడు తండ్రి తన్ను బుజ్జగిస్తూ అన్నమాటలు జ్ఞాపకం చేసుకొన్నది. అంతలో అప్పుడాయన కరుగ్గాఉంటే తనజీవితం ఎలా వుండేదో. తండ్రి నిర్ణయించిన సంబంధం కాదని తనకు నచ్చాడనుకొన్న వ్యక్తితో, ఇల్లువిడిచి వెళ్ళిన నాటినుంచి పడిన కష్టాలన్నీ స్ఫురణకువచ్చాయి. ఆవిడకు ఎంతో బాధకలిగింది. అలా బాధపడుతూనే ఆవిడ 'ఏమే అడిగినదానికి సమాధానం చెప్పవేమే ?' అందుకు శాంత మరో వైపు చూస్తూ 'ఏం చెప్పమంటావే ?' అన్నది.

నాగమ్మ కొంచెం పెద్దగా 'ఇంకేం ?

అతగాడివలలో పడ్డావన్నమాట, అటు తాతయ్యకూ, ఇటునాకూ తెలియకుండా నువ్వే వ్యవహారం నడుపుతున్నావన్న మాట. అవునా ? అవున్లే! చెడిపోయిన దాని కూతురు ఇంతకంటె మరేం చేస్తుంది. నిన్నుఅని లాభం లేదు.' అన్నది కోపంగా. అందుకు శాంత 'ఏమిటేఅమ్మా మాటి మాటికీ అమాటే అంటావ్. ఎందుకూ_నువ్వే దవ్వు వేసు కొంటావ్, తెలియని వాళ్ళకుకూడా తెలియడానికా ?' అన్నది. నాగమ్మ కూతురు చెయ్యిపట్టుకొని 'ఎందుకు తెలియదమ్మా. తెలుసు. ఇల్లాంటివి దాగవు. పైగా బీదవాళ్ళ విషయాలు అసలుదాగవు. దాగుతాయని భ్రమ పడతాం; అదిభ్రమ_ అని తెలిసిపోయిన తర్వాత మొండిగా, నిర్భయంగా ప్రవ ర్తిస్తాం. కాని సంఘం కళ్ళుమూసుకు పోలా. వాళ్ళతో మనకేంపని అని మనమే కళ్ళు మూసుకొంటాం. స్వేచ్ఛగా వ్యవహరిస్తాం. మనం మళ్ళీ కళ్ళు తెరిచేసరికి ఎక్కడో, అఘాతంలో. వుంటాం. ఊబిలో దిగబడిఉంటాం. అప్పుడు మన్ని ఉద్ధరించడానికి ముందుకు రాలేదని వారినీ వీరినీ ఆడిపోసుకొంటాం. వాళ్ళు మరింతదూరం అవుతారు. నాసంగతి అలానే అయిందేతల్లీ' అంటూ దుఃఖం ఆపుకోలేక పెద్దగా ఏడ్చింది. శాంత తల్లిని ఊరడించడానికీ ఆమె అంత బాధపడవలసిన విషయం ఏమీ లేదనీ, దోషం ఏదీ జరగలేదనీ, నిజం చెప్పి నమ్మించడానికీ విశ్వప్రయత్నం చేయవలసివచ్చింది.

నాగమ్మ ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది

'ఏమిటీమనిషి అతను మాటాడి వెళ్ తేనే ఇంత అనుమానపడి, ఆరాలుతీసి నాకు తెలియకుండా అతనితో, అతనికి తెలియకుండా నాతోనూ మాట్లాడి ఇంత ఆర్భాటం చేసిందే_మరి వెంక ట్రామయ్య తనతో చనువుగా ఉండడం, తనకు మంచి చీరలు కొనిఇవ్వడం, కాను కలు ఇవ్వడం స్వయంగా చూచికూడా ఏమీ అనదేం ? పార్వతమ్మగారు మాత్రం ఈవిషయం పసిగట్టి ఉండదా ? నాకోసం అతను అల్లావచ్చి వెళితే ఇంత అనుమానపడ్డ మనిషి తనభర్త నాపట్ల చూపుతున్న వ్యామోహం అర్థం చేసుకో లేదా ? ఎన్నోకల్పించి తల్లితోచెప్పదా ? చెబితే మరి ఈమనిషి అనదేం ? అది తప్పుఅయితే ఇదీ తప్పేగా.' అని శాంత ఎంతోసేపు మధనపడ్డది.

* * *

'నువ్వు ఈరహస్యం అతనికి చెప్ప కుండా ఉండవలసింది' అన్నది శాంత గునుస్తూ.

'ఏమీ ?' అన్నది నాగమ్మ.

'ఏమా_అతనింక నాముఖం చూడడు.'

'చూడకపోవడమే మంచిది. అయినా ఏమిటి నువ్వనేమాట. ఇక్కడ వెంక ట్రామయ్యతో వ్యవహారం ఇంతదూరం

వచ్చాక, మళ్ళీనీకు అతని విషయం ఎందుకు ఆలోచనవచ్చింది? తప్పుకాదూ-సంతానవతివి కాబోతున్నావ్! నీకీ కుర్ర తనపు మాటలు పనికిరావు - అన్నది నాగమ్మ నెమ్మదిగా మందలిస్తూ.

'శాశ్వతంగా ఇక్కడే ఈ రహస్య జీవితం గడపాలనిలేదు నాకు' అన్నది కాంత.

'నీమాటలు అర్థం కావటంలేదు. నీకు ఇష్టంలేకుండా ఆయనతో వ్యవహారం ఇంతదూరం వస్తుందని నేను అనుకోను. ఇష్టం లేకపోతే ముందే తప్పుకో వలసింది. మొదలువంచి విన్నిందుకు ఇక్కడ ఎవరూ ఒప్పించలేదు. నువ్వు చాలా అసహ్యమైన ఊహచేస్తున్నావు. ఇక్కడ, కనివెళ్ళి అతన్ని పెళ్ళాడదా మనుకొంటున్నావు. ఇటువంటివి ఎప్పుడూ దాగవు. ఒకవేళ అతి ప్రయత్నంమీద దాచిపెట్టి అతన్ని పెళ్ళా డినా-ఏనాడో ఒకనాడు ఈవిషయం బయటపడుతుంది. నిజం చెప్పమకు అతను నిన్ను రాచి రంపానపెడతాడు. నిజం చెప్పాక నిన్ను బయటకు గెంటు తాడు. అదంతా అలాఉంచు. ముందతను నిన్ను పెళ్ళిచేసుకుంటాడా? పూర్వం మొట్టమొదటిసారిగా నాకంట బడ్డప్పుడు అతన్ని నేను అనునయించి-మా అమ్మా యిని నువ్వు పెళ్ళిచేసుకుంటావా-అని అడిగాను. అతను-నాగమ్మ కూతురు అని తెలిసి-మానాన్న ఒప్పుకొంటాడా? అని ఎదురు ప్రశ్న వేశాడు; అవును-ఒప్పు కోడు. కాని అతను ముందే ఇవన్నీ ఆలోచించుకోవద్దూ? నాముందే ఎంత మాట అన్నాడే! అతని వాలకంచూస్తే నిన్ను ఏలుకొనేవాడులా కన్పించలా. ఎవరిదగ్గరో ... అట్బే నే నా మా ట అననులే; 'అడుక్కుతినేవాడి ఆలిఅయ్యే కంటె' అని ఆగింది నాగమ్మ-కూతురు ముఖం జేవురించడం గమనించి.

రెండుమూడు నిముషాల తర్వాత నాగమ్మ కూతురును బుజ్జగిస్తూ 'కాంతా నువ్వు కోపం తెచ్చుకోకు; అనవసరంగా మనసు కష్టపెట్టుకోకు. ఆనాడు నేను అలా అడిగానని వెళ్ళిపోయాడతను. నిజంగా ప్రేమవున్నవాడు అలా చేస్తాడా? ఆనాటి విషయంపోనీ, ఈనాడు ఏమైంది? మళ్ళీ ఆరునెలలకు వచ్చాడు. ముందు నేను ఎంతో మర్యాదగా మాట్లాడాను. నీ భవిష్యత్తు పాడుచెయ్యవద్దని బ్రతిమి లాడాను. కాని అతనిధోరణి 'ఏమీ మార లేదు. పూర్వం అన్నమాటే అన్నాడు. పూర్వంనుంచీ నీతో అక్రమ సంబంధం ఉన్నదని ఇక్కడ అందరితో చెప్పి అల్లరి పెడతానన్నాడు. నన్ను అడ్డు తొలగమన్నాడు. పుస్తెకట్టి అలాగే తీసుకునివెళ్ళు. నేను అడ్డు తొలగుతాననే అన్నాను. కాని నిర్భయంగా చెబు తున్నాడు-నిన్ను లేవతీసుకొని వెళతానని. ఇక్కడనీకూ, నాకూ దిక్కెవరున్నారు అప్పుడు గత్యంతరంలేక నీకు నెల




తప్పిందని అన్నాను నీయందు నిజంగా ప్రేమకలవాడైతే ఆమాట అంత వెంటనే నమ్మడు. పైగా ఎంతో బాధపడతాడు – అదేమీలేదు పీధినిపడి నిన్నూ, నన్నూ కలిపితిట్టాడు. అతనితిట్లువిని పార్వతమ్మ పాలేరును పంపించి. అతను పాలేరునూ తిట్టాడు. ఇంతలో, వెంకట్రామయ్య బయటకు వచ్చాడు ఆయన్ను చూచి అతను పరుగు లంకించుకున్నాడు. నేను లోపలకు వచ్చాక వీళ్ళతో, ఈవిషయం అంతా చెప్పవలసివచ్చింది. ఆవిడ నీకు తగిన రక్షణ ఇస్తానన్నది; ఆయననాతో రహస్యంగా అన్నీ మాట్లాడాడు. నిన్ను పెళ్ళిచేసుకొన్నట్లే అన్నాడు, ఇవుగో, నగలు. ఇదుగో డబ్బు. ఇదుగో ఆయన వ్రాసిఇచ్చిన కాగితం. ఇంతదాకా అక్కర్లేదు. ఆయనచేసిన వాగ్దానం చాలు; ఇందుకు ప్రభుత్వం ఒప్పుకోదుకాని మన శాస్త్రం ఒప్పుకొంటుందట రెండో పెళ్ళి వాడికి పిల్లను ఇవ్వొచ్చనుకొంటాను. సంతానంకోసం ఆయన నిన్ను స్వీకరించా ననుకొంటున్నాడు. ఇక నీకేం భయం లేదు. అంతేకాదు; ఆవిడకు ఆరోగ్యం చక్కబడ్డాక ఈవిషయం అంతాచెప్పి ఒప్పిస్తానన్నాడు ఆవిడ ఒప్పుకొంటుంది; ఆ నమ్మకం ఆయనకూ ఉన్నది. నాకూ ఉన్నది ' అన్నది

శాంత అంతావిన్నది

కొంతసేపు మారు మాటాడలేదు,

కూతురుకు కోపం పోయిందనుకుని నాగమ్మ ముందుకువచ్చి నగలు మెడలో వెయ్యబోయింది. శాంత విదలించుకొని

తల్లివంక కోపంగా చూచింది. అందుకు నాగమ్మ 'అవున్లే. అమ్మాయి! నీకు కోపంగానే ఉంటుంది నాకుతెలుసు. తలిదండ్రులు చేసిన తప్పులు పిల్లలు క్షమించరు. బిడ్డలుచేసిన తప్పులు తలిదండ్రులు క్షమిస్తారు' అన్నది.

శాంత కొంచెం పెద్దగా, కోపంగా 'అయితే ఇదంతా తప్పనితెలిసే చేశా వన్నమాట' అన్నది. నాగమ్మ శాంతంగా 'పిచ్చిపిల్లా-నీకెలా తృప్తిగావుంచేఅలా అనుకో; కాని ఒక్క-విషయం. ప్రస్తుతం నేను ఉన్న పరిస్థితులలో ఆటు ఆయనకు భయపడి ఇలా చేయలేదు. ఆయన స్వభావం తెలుసుకనుక ఇలా జరగ నిచ్చాను. అంతే. అంతకన్న నాతప్పు మరేమీలేదు' అన్నది.

శాంత మారు మాటాడకుండా వెను తిరిగి ప్రక్క-గదిలోకి వెళ్ళింది.

*  *  *

ఆరోజు వెంకట్రామయ్య అన్ని విధాలా ఆందోళన పడిపోయాడు. భార్యకు ఉదరవ్యాధి పెరిగింది. వెంటనే పట్నం తీసుకొనివెళ్ళి శస్త్రచికిత్స చేయించవలసి వచ్చింది. నాగమ్మ వెంటవచ్చి తీరాలని పార్వతమ్మ పట్టుపట్టింది. నాగమ్మ ఇరకాటంలో పడ్డది. కూతురుకు ఏక్షణంలో అయినా నొప్పులు వచ్చేలా ఉన్నాయి. వెంకట్రామయ్యతో సంప్రదించింది. ఆయన ఉపాయంచెప్పాడు. రెండు టాక్సీలలో బయలుదేరి అరగంటలో, పట్నం చేరారు - వారు నలుగురూ. ముందు భార్యకు శస్త్ర చికిత్సకు జరగవలసిన ఏర్పాట్లు పూర్తి చేసి తర్వాత శాంతను ప్రయివేటు ప్రసూతి వైద్యాలయంలో చేర్పించాడు- వెంకట్రామయ్య.

ఆరాత్రి ఎనిమిది గంటలకే పార్వతమ్మకు శస్త్రచికిత్స జరిగింది. ప్రాణాపాయం తప్పింది. ఆయన ఎంతో సంతోషించాడు.

ఆ మరునాడు శాంతకు సుఖంగా కాన్పు అయిందనీ, మగపిల్లవాడు కలిగాడనీ ప్రసూతి వైద్యాలయంనుంచి వెంకట్రామయ్యకు సమాచారంఅందింది. ఆయన సంతోషం పట్టలేకపోయాడు. నాగమ్మ కూతురు అదృష్టవంతురాలయి పోయింది. ఆరోజు సాయంత్రం ఆరుగంటలకు తీరుబడి చేసుకొని ఆయన నాగమ్మను వెంట పెట్టుకొని ప్రసూతి వైద్యాలయానికి వెళ్ళాడు.

ముందు నాగమ్మ శాంతఉన్న గదిలోకి వెళ్ళింది.

ఇరవై నిముషాలతర్వాత బయట నిలబడ్డ వెంకట్రామయ్యకు పిల్లవాణ్ణి తెచ్చి చూపిస్తూ 'పురిటిస్నానం అయేదాకా శాంత మిమ్మల్ని చూడదట. దానికి సిగ్గుగానూ, ఎందుకో కోపంగానూ

ఉన్నది.' అన్నది. వెంకట్రామయ్య నవ్వి ఊరుకొన్నాడు. పిల్లవాణ్ణి పొత్తిళ్ళలో ఎత్తుకొని 'ఇన్నాళ్ళకు నాకుఇంత అదృష్టం కలిగింది' అన్నాడు.

పార్వతమ్మ దగ్గరకు వెళుతున్నప్పుడు దారిలో నాగమ్మ కూతురు అంటున్న మాటలన్నీ వెంకట్రామయ్యతో చెప్పింది. మీ కొడుకును మీకు అప్పగించి తను ఎక్కడైనా వెళ్ళిపోతుందట. మీకు తనకంటే కొడుకే ముఖ్యమట. పార్వతమ్మ అయినా పిల్లవాణ్ణి మీ కారణంగా ఆదరిస్తుందిటకాని తన్ను ఆదరించదట. తన్ను గౌరవించదట. తను మీయింట్లో ఉండదట. అలా ఉండి ఆవిడకు అన్యాయం చేయలేదట. తన్ను క్షమించమన్నది. ఇంకాఏమిటోచెప్పింది. అమ్మా నన్ను క్షమించని అంటూ వెక్కి-వెక్కి-ఏడ్చింది. తనకు తండ్రి లేకపోవడంవల్లనే అంతా ఇలా జరిగిందని ఏడ్చింది. తను ఒంటరిగా ఎక్కడికైనా దూరప్రాంతానికి పోయి ఏ శరణాలయంలో అయినాచేరి, కష్టపడి చదువుకొని పైకి రావాలను కొంటున్నదట. బాగా చదువుకొంటే పెద్దఉద్యోగం వస్తుందట. తను స్వతంత్రంగా, హాయిగా బ్రతకడానికి అదే మార్గమట అది అలా ఎటో వెళ్ళిపోతే నేను దిగులుపడి చావవలసిందే.' అంటూ కళ్ళు ఒత్తుకొన్నది. 'ఇదంతా నా పాపకర్మమే. భగవంతుడు నన్ను క్షమించ లేదుకాబోలు' అని గొణిగింది నాగమ్మ.

వెంకట్రామయ్యకు కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. 'శాంత ఒట్టి బిడ్డను విడిచిపెట్టి నన్ను విడిచిపెట్టి, తల్లిని విడిచిపెట్టి ఎక్కడికు వెళుతుంది. ఊరికే కోపంకొద్దీ. ఏదో అఘాయిత్యంకొద్దీ. తనకేదో అన్యాయం జరిగిపోయినదన్న బాధకొద్దీ అలా అన్నదేకాని మమకారాలు తెంచుకొని పారిపోగలదా? చూస్తా ఎలా వెళుతుందో. ఊఁ వెళ్ళనిస్తానా? పిల్లవాడి విషయంలోనే కాదు; శాంతవిషయంలో కూడా తండ్రి నిర్వహించవలసినబాధ్యత అంతా నాదే. ఇంకా ఇరవై ఏళ్ళకుకాని నేను ముసలివాణ్ణికాను. అప్పుడు ఆడించమనండి' అని కళ్ల గట్టిగా ఒత్తుకవి నాగమ్మవంక తిరిగి కావాలని నవ్వుతూ 'ఏం ఈమాట చెబుతావా?' అన్నాడు వెంకట్రామయ్య.





ఎం. రామకోటి

"ఇంక మీకూ యీ వూరికిసరి ... ఋణం తీరిపోయింది తల్లీ!"

అంతకంతకు దూరమవుతున్న విశాఖపట్నాన్నీ, సింహాచల పరిసరాల్నీ పరధ్యాన్నంగా రైలు కిటికీలోంచి గమనిస్తూ ఆ మాటలువిని వులికిపడి తిరిగి చూసేను.

నాకు యెదురుగావున్న బెర్తుమీద



ఒక ముసలాయినా, కూతురూ కూర్చు న్నారు నావేపే చూస్తున్న ఆ అమ్మాయి నే నటు తిరగగానే మొహం తిప్పేసు కుంది. బెదిరి యెగరబోయే పిచ్చుక రెక్కల్లా ఆవిడ కనురెప్పలు రెపరెప కొట్టుకున్నాయి. కాళ్ళకి పసుపు, జడలో కనకాంబరాలూ, మెడలో నల్లపూసలూ, కాటుక కొలికలూ, చేతిలో మరచెంబూ చూస్తే ఆ అమ్మాయి అత్తారింటి కెళ్తోం దనుకున్నాను. ముసలాయన నెరసిన గెడ్డం పెరిగిపోయింది; నిగనిగలు వాడి పోయి, నల్లదనం విరిగిపోతూ వెలి

బూడిదలా వెలవెలబోతున్నాయి కంటి పాపలు. వడిలిపోతూ మీదపడే ముసలితనం బరువు మోయిలేక గొంతుకమీద చర్మం వణికిపోయి వూగిసలాడిపోతోంది. గంధరేఖలూ, చిలాయిబొట్టూ చూస్తే పాతకాలం వాడనిపించింది.

స్లీపర్ కోచ్ లో నిలువుగా కిటికీదగ్గర రెండుబెర్తులున్నచోట దిగువబెర్తు దొరికింది నాకు; నామీద బెర్తులో చింపిరి గెడ్డం పంజాబీ గుర్రుపెడుతున్నాడు. నాకు యెదురుగావున్న అడ్డుబెర్తులలో దిగువబెర్తుమీద కూర్చున్నారు. తండ్రీ కూతుళ్ళిద్దరూను. ఆ బెర్తుమీద కూర్చునే మూడోవాడు దూరంగా మరోచోట స్నేహితులతో పేకాడుకుంటున్నాడు. డ్రైయినువైపు టెరిలీనుపేంటు వెనక జేబులో పాకెట్ బుక్కు దోపుకుంటూ గళ్ళగళ్ళ బుష్షర్టులోంచి వుబికేకండల చేత్తో ఏదో సినిమాపత్రికలో రంగుల బొమ్మని నలిపేస్తూ తదేకంగా చూసి తన్మయం చెందిపోతూ, వూలేసుకుంటూ పచార్లు చేస్తున్నా డొక విద్యార్థి భర్త ఆప్యాయంగా హల్వా నోటికందించబోతే, కళ్ళలో సిగ్గులు గుమ్మరించి, రింగులాడించుకుంటూ బాగుందిబాగుంది అన్నట్టు వంకనవ్వు నవ్వుతూ, మందలింపుగా మరోవేపు తిరిగిపోతోందో బెంగాలీ అమ్మాయి. కొత్తదంపతులనుకున్నాను — వాళ్ళని చూడగానే. ఆ అమ్మాయి బుగ్గలు ఎర్రబడ్డాయి; కళ్ళు కరుగుతున్నాయి. చేతిలో మరచెంబు గిరగిరా తిరిగిపోయింది. గిరుక్కున తిరిగిపోయి కిటికీలోంచి పరుగులెడుతున్న పచ్చటి పొలాలవేపు చూస్తోంది.

టెలీగ్రాఫ్ తీగలమీద పాలగువ్వ పెళ్ళికూతురులా తూగుతూ రంగులు సింగారించుకని, నీలాల చీరకుచ్చిళ్లాంటి తోక ఝళిపించి రైలుతో పందెంకట్టి పరుగులెత్తబోయింది. అలిసిపోయి వుస్సురని పొలంలో జొన్నకంకిమీద వాలిపోయింది. కట్లో రాక్షసి బొగ్గుపడి భగ్గుమంది. చేతిరుమాలుతో కన్నొత్తుకుంటూ ఆ అమ్మాయివేపు చూసేను.

"నా బతుకలాగేవుంది... యెంతకని యెగరగలవే వెర్రిముండా" అని తనలోనే గొణుక్కుంది పాలగువ్వనిచూస్తూ ఆ అమ్మాయి. చూసిచూసి చీరకొంగుతో కళ్ళొత్తుకుంది.

కాఫీవేళకి తునిలో రైలాగింది.

"కాఫీ దొరుకుతుందేమో చూడు తల్లీ!" అని రైలాగిన కుదుపుకి లేచి ఆవలిస్తూ చిటికేసుకున్నాడు-కునుకుతున్న ముసలాయన.

"అదే నేనూ చూస్తున్నాను నాన్నా... ఏయ్ కాఫీ...కాఫీ" అని కిటికీలోంచి తొంగిచూసి చేతులూపిందా అమ్మాయి. ఎవడూ వినిపించుకోలేదు.

నాకూ కాఫీతాగాలనిపించింది; ముసలాయన పడే యాతనచూసి జాలేసింది కిట్ లోంచి టిఫినుబాక్సూ ఫ్లాస్కూతీసి

ప్లేట్లో వెన్నరాసిన రొట్టెముక్కలూ, కొంచెం కారప్పూసవేసి. ఫ్లాస్కు మూతలోకాఫీపోసి "ప్లాట్ ఫారం కాఫీ తాగలేరు తాతగారూ ... యిది పుచ్చు కోండి" అని అందించేను.

ఒక్కక్షణం తెల్లబోయి నా మొహం లోకి చూసేడు ముసలాయన. యేవఁను కున్నాడోయేఁవో.

"మీకెందుకుబాబూ శ్రమ" అంటూ వెంటనే తేరుకుని మొహమాటపడ్డాడు.

"శ్రమకేవుందండీ_ యిందులో ... ఫరవాలేదు తీసుకోండి చల్లారిపోతుంది" అంటూ కాఫీ టిఫినూ అందించేను

"కాఫీ చాలు బాబూ ... యేంతిన్నా అరగదు ... యీ కాఫీవుందే ... దీని తల్లికడుపు కాలా ... దీనికి లోకువై పోయేను బాబూ... సమయానికి లేక పోతే పిలకసాగదీసేస్తుంది...ఏం అల వాట్లో యేం బతుకులో" అంటూ అమృ తంలా కాఫీని అవురావురుమఁటూ అందు కున్నాడు.

"పోనీ మీరు తీసుకోండి" అని టిఫినుప్లేటు అమ్మాయికిచ్చేను.

ముందు వద్దని తరవాత థేంక్సండీ అని పుచ్చుకుంది. ఫ్లాస్కుమూత కడిగి తెచ్చిందాఅమ్మాయి. చదువుకుందామని పుస్తకం తీస్తున్నాను.

"నడుం లాగుతోందే అమ్మాయ్... పడుకోవాలమ్మా" అని యిటూ అటూ పర్కాయిస్తున్నాడు ముసలాయన.

కూతురు పక్కనకూర్చుంటే పడు కోడఁ వెలాగా అని తటపటాయిస్తున్న ముసలాయన యిబ్బందిచూసి_

"పోనీ నా బెర్తుమీద పడుకోండి... నేనక్కడ కూర్చుంటాను" అని లేవ బోయేను.

"మీకు చాలా శ్రమకలిగిస్తున్నాను బాబూ."

"ఆ బెర్తు మానాన్నకి చాలదు...: కాళ్ళు ముడుచుకు పడుకోవాలి...నాన్ని క్కడే పడుకుంటాడు లెండి" అని తండ్రిని పడుకోమని ఆ అమ్మాయి నా బెర్తుమీదకొచ్చి కూర్చుంది.

ఒక్కక్షణం కలవరపడ్డాను: ముస లాయన దీనంగా నావేపుచూసి నడుం వాల్చేడు. ఆ అమ్మాయి కిటికీలోంచి చూస్తోంది. చదువుకుందావఁని పుస్తకం తెరిచేను. అక్షరాలు అలుక్కుపోతు న్నాయి - రైలుకుదుపులో, మనసు గందరగోళంలో, ఆలోచనల చిందర వందరలో. ఓరకంట చూసే ఆ అమ్మా యిని కనిపెడుతున్నాను ఆ కళ్ళు నీళ్ళు చిమ్ముతున్నాయి. ఉబుకుతున్న దుఃఖం లోంచి యీదుకొచ్చే వెలితిచూపులు శూన్యాకాశంలోకి చొచ్చుకుపో తున్నాయి.

మా రైలుతోబాటే ఆకాశంలో ఒక పొడిమేఘం పరుగులెడుతోంది. అందుకో బోయే కొండకొనకి అందీ అందకుండా తప్పించుకుని పారిపోతోందో; మనసు

లేక మొద్దుబారిన కొండని కవ్వించి కరిగించి కౌగలించుకుందామని అవస్తోందో- పసిగట్టలేక పోయేను ఆలోచనల కనుగుణంగా రకరకాల ఆకారాలలో నిమిషానికొకలాగ కనబడుతోందా మబ్బుతునక

"ఏమిటండీ ఆ పుస్తకం?" అంది ఆ అమ్మాయి ఆతృతగా యింతలేసి కళ్ళు చేసుకుని వంగి అట్టమీద బొమ్మ చూస్తూ.

"ఏదో యింగ్లీషు నవల" అన్నాను

"బోధపడి చావదు . దిక్కుమాలిన గోల" అని నవ్వేసింది

"మీరు చదువుకోలేదా ?"

"ఏం చదువండీ వానాకాలం చదువూ.. ఆపాటి యింగ్లీషొస్తే . నాకీ ఖర్మేం.. ఎంచక్కా నేనూ అమెరికా వెళ్ళి..." అని నడుంమీద చేతులేసుకుని వూపుకుంటూ యేదో చెప్పబోయి సిగ్గుపడి నవ్వేసింది

"ఇంగ్లీషు చదువుకోడం అమెరికా వెళ్ళడానికా ?" అన్నాను కొంచెం విస్తుబోతూ.

"మరెందుకండీ లేకపోతే... వంటింట్లో కీసరబాన రనుకోడానికా... యింగ్లీషు రానివాళ్ళు అమెరికా వెళ్ళేరు ..."

"అమెరికా వెళ్ళకపోతే వచ్చే నష్టం వేమిటి .. ?"

"అదేమిటండీ అలా అంటారూ!... అమెరికా అంటే పెద్దకిటికీ... అందులోంచి ప్రపంచం అంతా కనబడుతుంది. పధ్నాలుగు భువనాలూ కళ్ళకట్టినట్టు కనబడతాయి అమెరికా వెళ్తే లోకాలన్నీ తిరిగినట్టే ." అని చిన్నపిల్ల చెప్పినట్టు చేతులు తిప్పింది- వెక్కిరింతగా.

"ఆఁ అలాగా ... వినాయకుడు యెలుకమీద కూర్చుని తల్లిచుట్టూ తిరిగి భూమంతా తిరిగొచ్చేనన్నట్టు" అన్నాను వెటకారంగా.

"అహాఁ ... అలాగా" అని నవ్వేసింది.

విదేశాలు వెళ్తే మనకి ఒరిగిపోయే దేమిటండీ ?" అన్నాను.

"అమెరికా వెళ్ళనివాళ్ళూ, ఇంగ్లీషు రానివాళ్ళూ . నూతిలోకప్పలు ...వుత్త కప్పలు కాదు...బావురుకప్పలు... అప్పలమ్మలు" అంది అకస్మాత్తుగా జేవురించిన మొహంతో హేళనగా పెదాలు బిగించి చిన్నవంక నవ్వునవ్వి, బరువుగా వూపిరిపీలుస్తూ.

నా కెందుకో ఆ మాటలు సహజంగా హాస్యధోరణిలో అన్నట్టు అనిపించలేదు. అట్టడుగున యేదో వేదన మూలుగుతోంది.

"పాంపిట్టలెంత బాగుంటాయండీ!.. బొద్దుగా ముద్దుముద్దుగా...ఆ చిలిపి జీవాలకి దేవు డెన్నెన్ని రంగులద్దేడో చూడండి...ఎంత అందమైన రెక్కలిచ్చేడూ ! ఎన్ని సరదాలిచ్చేడూ!"




అని కిటికీలోంచి చూడడం మొదలు పెట్టింది మళ్ళీ.

"పాలపిట్టా!" అంటూ నేనూ కిటికీలోంచి చూసేను.

"ఆఁ...అదిగో... యిదొకటి ... యిందాక రైలుతో సవాలుచేసి యెగరబోయిన పాలగువ్వని మీరూ చూసేరు కదూ?" అని నా కళ్ళలోకి చూసింది.

"ఓ...అదా ... పాపం రైలుతో వుజ్జీపడి ఆయాసపడి అలిసిపోయింది" అన్నాను.

"అవునులెండి; వియ్యానికేనా సమవుజ్జీ వుండాలంటారు ... విమానాల్లో సూర్యుడికన్న ముందు భూమిఁనిచుట్టొచ్చే వాళ్ళతో మనం పరుఁగులెత్తగలఁవా?... పొలం గట్లమీద తుప్పఁతుప్పమని గెంతుకుఁటూ ఆడుకునే వెర్రిబాగుల ముఁడ ఆ పాలగువ్వకి. యినపపట్టాల మీద జారిపోయే రైలుకి సాటా?" అంది_జాలిగా నవ్వుతూ, పిచ్చిచూపులుచూస్తూ.

ఒకదానికొకటి పొత్తుకుదరని ఆ మాటల తీరు నాకేం బోధపడలేదు.

"మీరెక్కడికి వెళ్తున్నారు" అన్నాననుకోకుండా.

"హైదరాబాదు"

"మీ ఆయనేం చేస్తున్నారు"

"యూనివర్సిటీలో రీడరు"

"ఎక్కడనుంచొస్తున్నారు?"

"విశాఖపట్నం"

"నేనూ అక్కడే యెక్కేనే" అన్నాను.

"అవును _ చూసేను" అంది.

ఇంకేం మాట్లాడాలో తోచక పేపరు విప్పబోయేను.

"పేపరూ యింగ్లీషేనా?" అంది నేను చదువులో పడతాననిలా వుంది.

"అఁ...ఏం?" అన్నా – మొహఁ వెత్తకుండా నే.

"మీరేం చేస్తున్నారూ?"

"పోలీసు శాఖలో సీఐడీని!"

"అబ్బో! అయితే మీలాంటివాళ్ళు ఫస్టుక్లాసుల్లో ప్రయాణంచేయాలి– ఈ థర్డుక్లాసేం ఖర్మ?"

"అవసరాల్నిబట్టి, మేము ఎందులోనైనా చేయొచ్చు!"

"అంతే?"

"అంతకన్నా నేను చెప్పకూడదు"

"ఓ! అలాగా! అయితే. మీకు పిల్లలా?"

"లేరు" అన్నాను, యెందుకా – యీ ప్రశ్నలన్నీ వేస్తోందని కొంతసేపు తటపటాయించింది.

"మీ రెంతవరకూ ప్రయాణం?" అంది.

"హైదరాబాదే."

"మీరొక్కరే వెళ్తున్నారేం?"

"మరెవరొస్తారూ ... ఏవిఁటి మీరనేదీ!" అని తలెత్తిచూసేను.

"మీ ఆవిడో" అంది–మరెవరూలేరా అన్నట్టు.

"ఆవిడెందుకూ – అన్నాను,

"ఎందుకా? నామొహంలావుంది ... మీరెందుకేం ... ఏం మాటలండీ ... మీ మగాళ్ళు...హుఁ..." అని విసుక్కుంది.

నావేపు చురచుర చూసి "మీరూ ఫారిను వెళ్ళేరా?" అంది.

"వెళ్ళేను"

"అమెరికా యేనా?"

"కాదు...ట్రెయినింగుకి స్కాట్లెండు వెళ్ళేను"

"మీ ఆవిడకి యింగ్లీషొచ్చా?"

"రాదు"

"రాదూ! ... అయితే పుట్టింట్లోనే నన్నమాట మకాం"

"పుట్టింట్లో యేంఖర్మం...నిక్షేపంలా నాదగ్గరేవుంది,"

"మీతోనే వున్నారా! ... మీ ఆవిడకి యింగ్లీషు రాదంటున్నారూ... వుత్తనే కోతలు – మీరు ఫారిను వెళ్ళలేదు" అని సందేహిస్తోంది.

"ఏం ... ఎందుకలా అడుగుతున్నారూ?"

"ఇంగ్లీషు రాకపోతే యెలాగండీ... మీకు నామోషీకాదూ? ... కప్పలతో కాపరం యెలాగండీ" అంది నవ్వుతూ, నలకపడిందంటూ కళ్ళొత్తుకుంటూ.

విదేశాలు వెళ్తున్న భర్తను సాగనంపడానికో, యెన్నాళ్ళకో విదేశాలనుండి తిరిగొస్తున్న భర్తను కలుసుకోడానికో వెళ్తోందనుకున్నాను.

ఏదీ శాశ్వతం కాదంటూ, కరిగిపోయే గతంలా పొలాలూ, యేర్లూ, గట్లూ, పుట్టలూ కంటిముందు కదిలి మాయ మవుతున్నాయి. పాతవి వెనక




బడుతున్నాయి, కొత్తవి ముందు కొస్తున్నాయి, మరుగునపడి కరిగి మాయమవుతున్నాయి. అయినా అంతులేని దృశ్యాలు అలా కంటిముందు కదిలిపోతూనేవున్నాయి. జీవితం తుదీ మొదలూలేని ప్రవాహం అని అలాంటప్పుడు యెవరూ చెప్పకుండానే స్ఫురిస్తుంది, బోధపడుతుంది. మతిచెడినవాడి వాగుడులాగ ఒక దృశ్యానికీ మరోదానికీ సంబంధం వుండదు. అతికిచూస్తే యేదో అర్థం చూచాయగా ధ్వనిస్తుంది, యేవో రహస్యాలు గుస గుసమని వినిపిస్తాయి. దేనిమట్టుకదే చూస్తే సముద్ర కెరటాల్లా నురుగులు కక్కుతూ విరిగిపడతాయి.

"యేవిఁటేవిఁటో తెగవాగుతున్నాను... ఘరేవఁనుకోకండి..., మా పెద్దన్నయ్య మీలాగే వుండేవాడు.. మిమ్మల్ని చూస్తుంటే. ." అని ఆగిపోయింది.

"ఫరవాలేదమ్మా" అనేశాను.

వినీవినబడనట్టు యింకా యేదో తనలో తానే గొణుగుకుంటోంది. నాకు చిన్న కునుకు పడుతోంది.

"ఏమండీ_నిద్దరోతున్నారా?" అంది.

"ఏం?" అన్నాను తుళ్ళిపడి.

"ఆ వెధవపీనుగ యిందాకటినుండి చూస్తున్నాను — నావేపెందుకలా చూస్తాడూ? పిచ్చివెధవ, దొమ్మరివెధవ, వెకిలినవ్వులూ వాడూనూ తన్నాలన్నుంది" అని దూరంగా మరోబెర్తు వేపు తీక్షణంగా చూసింది.

ఆ మీసం, పిల్లిగెడ్డం, వేషం, వాలకం చూస్తే వాడెవడో వుత్తరాదివాడిలా

వున్నాడు. నేను ఆవేపుచూడగానే యేపీఁ యెరగనట్టు మొహం తిప్పేసుకుని యెటోచూస్తూ మీసం దువ్వుకుని, పైపిన్ను సద్దుకుంటున్నాడు.

"వెధవచూపులూ వాడూనూ-నేనిక్కడుంటే కాల్చుకుతింటాడు-మీరు పడుకోండి" అఁటూ నాబెర్తుమీదనుంచి లేచి, తండ్రినిలేపి తన బెర్తుమీద కూర్చుంది-వుత్తరాదివాడికి కనబడకుండా.

బెజవాడ చేరేసరికి చీకటిపడింది. వచ్చేపోయేవాళ్లూ, భోజనాలు తీసుకొచ్చే సర్వర్లూ అంతా కోలాహలంగావుంది. నేను భోంచేసి నాసీటుదగ్గర కొచ్చాను.

"ఏవఁండీ?"

"ఏం?"

"నాన్నమధ్య బెర్తులోకి యెక్కిపడుకోడం కష్టం-మీకు అభ్యంతరం లేకపోతే మధ్యబెర్తులో మీరు సర్దుకోండి, నాన్న కిందబెర్తులో పడుకుంటాడు."

"మరిమీరో?"

"మీ బెర్తుమీద పడుకుంటాను."

ఆడకూతురూ, ముసలాయనా సర్కసుఫీట్లెలాచేస్తారని, యిబ్బందైనా-'సరే'నన్నాను. ప్రయాణబడలికా, భుక్తాయాసం యేకమయ్యాయి. రైలు కుదుపులో అందరూ కునుకు తీస్తున్నారు. తెలివితప్పి తప్పనట్టు మగత నిద్ర పట్టింది నాకు. పైనజరిగేవీ బుర్రలో చెలరేగేవీ అన్నీ కలగాపులగమై కలా నిజం కలిసిపోయే కనికట్టు గారడీఅది. ఫెడీమని చప్పుడైంది. తిట్లూ, శాపనార్థాలూ వినబడ్డాయి. కలగంటున్నాననుకున్నాను.

"పశువా - బుద్ధిలేదూ - ఎద్దులా వున్నావు! వెధవా - యేం పోయేకాలంరా నీకూ" అని చెవినిబడి ఉల్కిపడిలేచేను

ఆ అమ్మాయి బెర్తుమీదలేచి కూర్చుని యేడుస్తోంది. ఆవుత్తరాదివాడు భుజంమీద టర్కీ తువ్వాలుతో చేతులు తుడుచుకుంటూ వాడి బెర్తుదగ్గరకి వెళిపోతున్నాడు. మధ్యబెర్తులో యిరుక్కున్నానేమో లేవమోయి, తలబొప్పి కట్టి, కళ్ళు నులుపుకుంటూ మెల్లిగా కిందికి దిగేను. తారాజువ్వలా చివాల్న లేచిందా అమ్మాయి.

"నాన్నా నాన్నా - లేవండినాన్నా - మిమ్మల్నే" అని కంపించిన భూదేవిలా దద్దరిల్లి జలదరించిపోతూ పడుకున్న తండ్రి భుజాల్నిపట్టి వూపి లేపింది.

ముసలాయన బరువుగా కళ్ళు తెరవలేక, నుదురుచిట్లించి, ఆవలిస్తూ కూతురు వేపు చూసేడు. అమ్మవారు వూనినట్టు శివాఁలాడుతున్న కూతురుమొహం, కణకణలాడే కళ్ళూచూసి తెల్లబోయేడు.

"చూడండి నాన్నా-ఎనుబోతులాగ వెధవ, పందిలాగున్నాడు. యేంచేసేడో చూడండి. వెధవని తన్ని జుత్తుపట్టి యీడ్చిపారెయ్యండి నాన్నా-పోకిరీవెధవ



యేవఁనుకున్నాడో యేఁవో" అని తండ్రినివూపేస్తోంది.

"అర్థరాత్రప్పుడీ ఖాగోతఁవేఁవిఁటమ్మా? అబ్బ! పోయిపడుకో – వాడే పోయేడులే – ఊఁ పో పడుకో ఖర్మ" అని కూతుర్ని మందలించి పక్కకితిరిగి పడుకుని గుర్రుపెట్టి నిద్రపోయేడు–ముసలాయన.

"ఏవిఁటినాన్నా మీరూ – మీరడుగుతారా–నన్నే అడగమంటారా–వాడి పరువు మంటా – నాన్నా నాన్నా" అని నెత్తి బాదుకుని బొఖ్ఖుమంది.

చీమఁకుట్టినట్టేనా లేక, పక్కకి తిరిగి పోయిన తండ్రినిచూసిఆశ్చర్యపోయేను. ముసలాయన నిద్దరమత్తులో వున్నాడు. మేలుకునివుంటే మాత్రం యేం చెయ్యగలడు? ఓపిక, బలంలేక తెల్లబోయి యేవీఁతోచక నిశ్చేష్టుడై పక్కకి తిరిగి పోయేడనుకున్నాను. ఎంత చేతకాక పోయినా యెవడేనా యేవీఁ జరగనట్టూరుకోగలడా? నాకేవిఁటో అంతా అగమ్యగోచరంగా, అయోమయంగా వుంది. ఆ అమ్మాయిని సముదాయించి, వూరుకోబెట్టి యేం జరిగిందో చెప్పమన్నాను.

"ఏం జరిగిందీ – నాపిండాకూడు–ఏం జెప్పమంటారు. ఎలా చెప్పగల్నండీ నాసిగ్గు బొగ్గులవ్వా" అంది పేండ్రించుకుంటూ నుదురు బాదుకుని.

"చెప్పకపోతే ఎలాగమ్మా? ఏవీఁ చెప్పకపోతే యేం చెయ్యగలం చెప్పండి" అని బుజ్జగించేను.

"వాత్తేరులో రైలెక్కిం దగ్గరనుండీ ఆవెధవ నాప్రాణాలు తోడేస్తున్నాడు- కొరివిచూపులూ వాడూను" అంది.

"అది సరేనమ్మా-ఏం చేసేడూ ?"

"వీడిమొహం తగలెయ్యా-ఓకన్ను తెరిచి బితుకు బితుకు మంటూనే ఆటూ యిటూ దొర్లుతున్నాను."

"ఊఁ"

"వచ్చి పక్కలో జొరబడ్డాడు."

"ఆఁ!... అమ్మ దొంగవెధవా... రాస్కెల్ !"

"కాళ్ళూ పాదాలూ రాసి మెల్లిగా... అబ్బ... సిగ్గుమాలిన చచ్చినాడు... నా కర్మ కాకపోతే,... యేవిఁటిదంతా"

"వూరుకున్నారా ?"

"వూరుకోక యేం చెయ్యగలనూ... బిక్కచచ్చిపోయి యేం చెయ్యాలో తోచక కాలు జాడించి కసిదీరా తన్నేను- భటాచోరు వెధవని... కట్టుకున్నవాడు కాదంటే కన్నవాళ్ళకే నిష్ఠూరం... అందరికీ లోకువ...అదుగు బొదుగు బతుకూ... యేంచెప్పుకున్నా యెవరూ వినిపించుకోరు... నేను జడ్డిదాన్ని. యాబరాసిని... నాదంతా పిచ్చివాగుడు. నా సొదెవరికాక్కావాలి" అంటూ వుక్రోషంగా నా వేపు చూసి కొంగునోట్లో గుక్కుకుంటూ వెక్కివెక్కి యేడ్చింది

నాకు ఒళ్ళు మండింది. అందరూ గాఢంగా నిద్రపోతున్నారు. వుత్తరాది వాడు నిద్రనటిస్తున్నాడు - దగ్గరికి వెళ్ళి జబ్బలు కుదిపి లేవదీసేను.

"ఏయ్ మిస్టర్...ఏవిఁటి సంగతి?" అన్నాను భుజంమీద చెయ్యేసి.

వాడు తెలుగు రాదని హిందీలో వాగడం మొదలుపెట్టేడు – విసుగ్గా నా చెయ్యివిదిలేస్తూ... హిందీ నాకు రాదని యింగ్లీషులో వూదరగొట్టేను. కొంచెం బెదిరేడు. వినయంలో దిగేడు.

"ఆ అమ్మాయి పక్కలో జేరి... వెధవ్వేషాలేసేవా లేదా ?" అని గద్దించేను.

"లేదు" అన్నాడు.

"లేదూ ?... చెప్తావా చెప్పించమంటావా ?" అని గుడ్లెర్రజేసి చొక్కా కాలరు పట్టుకున్నాను.

"నేను బాత్‌రూముకి వెళ్తుంటే ఆవిడ కాలుతగిలింది... క్షమించండి... నేనూ మీలాంటివాణ్ణే మర్యాదస్తుణ్ణి ... అలాంటిపని చేస్తానా ? కావాలంటే చూడండి - అంటూ మనీ పర్సుతీసి తన విజిటింగుకార్డు చూపించబోయేడు.

"నీ భుజకీర్తులూ, నీ హోదాలూ యెవడిక్కావాలోయ్ పెద్దమనిషీ... నిజంచెప్పు" అన్నాను - పళ్ళు పటపట లాడిస్తూ.

"మీ రెవరింతకీ ? ఆ అమ్మాయి మీ కేఁవేఁనా అవుతుందా ?" అన్నాడు వెటకారంగా.

' నే నెవరో యిప్పుడే తెలుస్తుంది....



బద్మాష్! తప్పొప్పుకుని క్షమాపణ చెప్పుకో."

"చెప్పకపోతే?

యీ క్షణంలో రైలాపించి అరెస్టు చేసి జైలుకి పంపించగల్ను" అంటూ బూటుకాలు బెర్తుమీదపెట్టి కాలరుపట్టుకుని గుంజాయించేను.

అప్పుడే పడుకున్నవాళ్ళు ఈ గొడవతో విసుగ్గా లేస్తున్నారు.

"క్షమించండి. ఏదో అయిపోయింది... దయచేసి నన్నల్లరిపెట్టకండి. ప్లీజ్" అన్నాడు బతిమాలుకుంటూ, నలుగురూలేస్తే పులుసులోకి యెముక లేకుండా తంతారని భయపడి.

"చాల్లెండి రౌడీవెధవకి.. అయినకాసి చాలు... వెధవనోట్లో నోరెడితే మనకే సిగ్గూ. రండి చాలు" అంటూ వెనక్కి లాగిందా అమ్మాయి.

అందరూ లేస్తే ఆ అమ్మాయిబతుకే నవ్వులపాలవుతుందని నేనూ భయపడి తగ్గిపోయేను. తెల్లారింది, సికింద్రాబాదులో రైలాగింది; మొహం కడుక్కుని కాఫీ తాగుదామని రైలు దిగేను. ఆ అమ్మాయి తెలివితప్పి పడుకుంది. పందుంపుల్ల నవుల్తూ ముసలాయనకూడా కాళ్ళాయిదగ్గర చేరేడు.

"అమ్మాయిని అత్తారింటికి దిగబెడుతున్నారా - తాతగారూ" అన్నాను.

"ఇంకా అత్తారిల్లేవిఁటిబాబూ పుట్టింటికే తీసుకెళ్తున్నాను" అన్నాడు దిగులుగా.

"అదేం!" అన్నాను తెల్లబోతూ.

"దాని బుర్రకొంచెం చెడిందిబాబూ. మతి స్తిమితంవుండదు ... వెర్రివాగుడూ

అదీను ... ఒక ఛేగొణుగుడు ..అందరి మీద అనుమానం. .అతగాడు అమెరికా వెళ్ళిందగ్గర నుండి అదేవాలకం...యీ జద్దిమాలోకాన్ని అల్లుడుమాత్రం యెన్నాళ్ళు భరించగలడు బాబూ కొన్నాళ్లు పుట్టింట్లో వుంచి పంపండని నాతోపంపే సేడు...రాత్రి మిమ్మల్నేవీ చికాకుపెట్ట లేదుగదా? ... అంతామాకర్మ ... దాని అదృష్టం అలా బండలుబారింది." అన్నాడు ముసలాయన కూతుర్ని తలుచుకుని కుంగిపోతూ.

లేపినా లేవకుండా ముసలాయన అలా నిశ్చింతగా యెందుకుపడుకున్నాడో అప్పు డర్థమైంది.

"అల్లుడెక్కడుంటున్నాడూ?" అనడిగేను.

"యూనివర్సిటీలోనే ... అమెరికా అవీవెళ్ళి పెద్దపెద్దచదువులే వెలగబెట్టేడు ...యేఛేటా దేశాలన్నీ తిరిగొస్తుంటాడు...అతగాడిదదో ధోరణి...ఏం చెప్ప మంటారు? మనవాళ్ళన్నా మన అలవాట్లన్నా అతగాడికి అసహ్యం యీదేశం పందులగుడిసెట.. దీని వాలకం చూస్తే యిలా తగలడింది. .పరమాత్ముడి కృప అలావుందిబాబూ" అంటూ కొళాయి దగ్గర దోసిలితో నీళ్ళుపట్టి పుక్కిలించి మొహంకడుక్కుని కళ్ళు తుడుచుకున్నాడు.

ఎంతమంది మూర్ఖుల్ని యీ దేశం యెగుమతిచేస్తుందో అనుకుని నొచ్చుకున్నాను.

"అమ్మాయికి యింగ్లీషు చెప్పించండి . అన్నీ సర్దుకుంటాయి..."అని ముసలాయనవేపు చూసేను.

నిర్వేరబోయేడు. వాంపల్లిలో అందరం దిగిపోయేం.

"ఈ మారు హైదరాబాదు వచ్చినప్పుడు మీ ఆవిడని మా యింటికి తీసుకురండేం.. మరిచిపోకండేం" అంటూ యెడ్రసు రాసిచ్చిందా అమ్మాయి.

"తప్పకుండా రాబాబూ" అంటూ ముసలాయన కూతురితో వెళ్ళబోతున్నాడు.

జాలిగా, అమాయకంగా కృతజ్ఞత నిండిన చూపులతో వెళ్తూ వెళ్తూ చేతులు జోడించిందా అమ్మాయి.

"చదువుకో అమ్మా. . యింగ్లీషు చదువుకో... కాలేజీలో జేరు అన్నాను.

"నేనా ;... యింగ్లీషూ, చదువూ .. వుద్యోగం... నేనూ. .బాకురు కప్పని.. అప్పలమ్మని యెంత వెర్రిబాగులవారండీ" అని బావురుమని ఏడ్చినట్టుగా నవ్వింది.

నామనసు చివుక్కుమంది. కాదమ్మా! నువ్వు రెక్కలుపడిన పాలగువ్వవి అందామని నోటిదాకా వచ్చింది. అనలేక పోయేను.

ముసలాయన భ్రమపడ్డాడు. ఉత్తరాదివాడు అబద్ధమాడాడు. ఆ అమ్మాయి నిజమే చెప్పింది. ఇవన్నీ నాకొక్కడికే తెలుసు! ఎవరితో చెప్పుకునేది?





# మనిషి-నీడ

— శెంబాశా —

గుర్రం రెండడుగులు ముందుకువేసి ఒక అడుగు పక్కకువేసింది. ఏనుగు బరువైన తన శరీరాన్ని ఊపుకుంటూ నేరుగా వెళ్తున్నది. మంత్రి ఎటువైపు పడితే అటువైపు ఉరకడానికి సిద్ధంగా ఉన్నాడు. శత్రుసైన్యం అప్పటికే చాలా భాగం చెల్లాచెదరైంది.

సీతాపతి సిగరెట్టుమీద సిగరెట్టు ఊదేస్తున్నాడు. తన రాజును రక్షించుకోడానికి ప్రయత్నం చేస్తున్నాడు. యుద్ధరంగం బీభత్సంగా ఉంది.

గాజుల గలగల

ఆ శబ్దం ప్రతిరోజూ వింటున్నదే; అయినా-భయంకరంగా ఉంది రాజు

ఒక్కడుగు ముందుకు వేయలేకుండా ఉన్నాడు.

గాజుల గలగలలో మంత్రిని ఒక్క గడి ముందుకు జరిపి ... ఇప్పుడు తప్పించుకోండి చూద్దాం...మరి దారి లేదు...అన్నది లలిత సీతాపతివైపు అదోలా చూస్తూ

లలిత చెస్ బోర్డుమీదికి వంగి కళ్లన్ని పెద్దవిచేసుకుని ముందుకు వెళ్తున్నది.

సీతాపతికి ఏటువైపు పోవడానికి దారిలేదు; ముందుకుపోతే గొయ్యి వెనక్కువెళ్తే నుయ్యి...

జరిగిన పరాభవాన్ని మనసులో అణుచుకుంటూ నీవే గెల్చావు లలితా .. కంగ్రాట్యులేషన్స్!... అన్నాడు నీరసంగా సీతాపతి

సీతాపతి ఓడిపోవడం ఇది మొదటిసారి కాదు

లలిత కిలకిలానవ్వుతుంది - గెలిచినపుడల్లా. సీతాపతి కుంచించుకుపోతాడు.

కాలక్షేపానికి క్యారంబోర్డు అడినప్పుడూ లలితే గెలుస్తుంది

ఓటమిని నిజంగా ఓటమిగా తీసుకుని బాధపడ్తాడు సీతాపతి-ఓడిపోయిన రోజు...లలిత అనాకారిగానూ-చేసిన వంట పదార్థాలు చేదుగానూ కన్పిస్తాయి - సీతాపతికి...ఆ రోజు నిద్ర పట్టదు; లలితకు తాత్కాలికంగా దూరం అవుతాడు.

మీరు మరీ అంత సెన్సిటివ్ గా ఉంటే ఎలా? - అన్నది లలిత ఓ రోజు.

సీతాపతికి మింగుదామన్న కోపం వచ్చింది

అబ్బే...అదేంలేదు . నీవు గెలిస్తే నాకు సంతోషమే ... నాకు గర్వం కాదూ మరి...నిన్ను చూస్తూ ... నీ చేతిలో ఓడిపోవడమే సరదా ... అన్నాడు సీతాపతి.

* * *

టినోపీలో మంచి పిక్చరుందివాళ పెందరాడే రండి వెళ్దాం - అంటూ ఆఫీసుకు సాగనంపింది లలిత.

సీతాపతి ఆలోచిస్తూ ఆఫీసుకు వెళ్ళాడు

సీతాపతిని బాగా ఎరుగున్నవాళ్లు, స్నేహితులు, ఆఫీసులోవాళ్ళు - జీనియస్ అని అంటారు. సీతాపతికి ప్రపంచంలో చాలా విషయాలు తెలుసు. అవసరంవస్తే అనర్గళంగా మాట్లాడగలడు. నలుగురిలో మెఖాస్ అనిపించుకుంటాడు. మంచి ఆలోచనా శక్తి ఉంది. ఎదటివాళ్ళను ఆకట్టుకోగలడు ఇతరులు తనను మెచ్చుకున్నా తనను తాను పొగుడుకోలేడు. ఎప్పుడూ మూడీగా ఉంటాడు చెప్పుకోదగ్గ పర్సనాలిటీ లేకపోయినా అతని మెదడు రేజరుబ్లేడులాంటి పదును. ఆ బ్లేడు తనను తాను కోస్తూ ఉంటుంది - అప్పుడప్పుడు.

సీతాపతికి చాలామంది స్నేహితులున్నా-వాళ్ళను ఎప్పుడూ ఇంటికి తీసుకువచ్చి ఓ కప్పు కాఫీ అయినా ఇవ్వలేదు.

ఆఫీసుపని కాగానే బయటపడి... రామారావుకోసం ఎదురు చూశాడు-పోర్టికోలో ఒక పక్కగా నిల్చుని. రామారావ్ వస్తూనే...'ఏం భాయ్.. ఇంకా ఇంటికిపోలేదా?...' అన్నాడు.

అలా సరదాగా...వెళ్ళి తాజ్‌లో కాఫీ తాగుదాం పద...అంటూ దారి తీశాడు సీతాపతి.

తాజ్‌లో కనీసం గంటయినా గడిపి ఉంటారు - ఇద్దరూ లోకాభిరామాయణం మాట్లాడుతూ. రామారావు ఇంటికి వెళ్ళాలని తొందరపడుతున్నాడు. 'పోవచ్చులే...అంత తొందరేమిటి? త్వరగా వెళ్ళకపోతే మీ శ్రీమతి కోప్పడుతుందా!...అన్నాడు సీతాపతి. రామారావు ఒక నవ్వునవ్వి ...'త్వరగా గూటికి చేరుకోవద్దూ .. మరి-' అన్నాడు.

ఇద్దరూ నవ్వారు. హాయిగానవ్వారు. సీతాపతి బిల్లు చెల్లించి, ఓ సిగరెట్టు ముట్టించి...రామారావును బస్‌స్టాండ్ దగ్గర దిగబెట్టి ... టాటాచెప్పి నడక ప్రారంభించాడు. తన బస్‌స్టాప్ కూడా దగ్గర్లోనే ఉంది. అయినా అంత త్వరగా బస్ ఎక్కడానికి మనస్కరించలేదు. కొంతదూరం నడిచాడు, నడుస్తున్నాడు; రోడ్డుమీద జనం ఇంకా పల్చబడలేదు. బస్సులూ, కార్లూ, టాక్సీలు స్కూటర్లూ దూసుకుపోతున్నై. స్కూటర్లమీద కొంతమంది ఆడవాళ్లు వెనకాల కూచుని ముందు కూచున్న మగవాళ్ళను గట్టిగా కావలించుకుని గాలిలో తేలిపోతున్నారు, రంగరంగుల చీరెలు గాలికి రెపరెపలాడుతున్నాయి. పేవ్‌మెంట్లమీద పూలమ్మే పిల్లవాడు-బండిమీద బనీన్లు, డ్రాయర్లు, సాక్సు అమ్మేవాడూ-ఆ మూలలో కలాలూ బాల్‌పాయింట్ పెన్స్ ... మరో మూల ప్లాస్టిక్ సామాన్లూ.. ఒకచోట పరిచిన కట్‌పీసెస్ అమ్మేవాడూ .. అందరూ సీతాపతివైపు చూస్తున్నట్టే ఉంది కానీ ఉద్దేశ్యం లేకపోయినా అవన్నీ వరసగా చూసుకుంటూ... నెమ్మదిగా వెళ్తున్నాడు. బస్‌స్టాప్ వచ్చింది యాంత్రికంగా బస్‌లో ఎక్కి కూచున్నాడు...

ఇంట్లోకి వస్తూనే ... వెరీసారీ ... లలితా ... ఆలస్యం అయిపోయింది. ఇవ్వాళ బెజవాడనుండి ఓ మిత్రుడు వచ్చాడు అతనితో కొంతసేపు గడిపి రైలుకు పంపించి వస్తున్నాను ... మరేమీ అనుకోనంటే నాకు తృప్తిగా ఉంటుంది ... ఆకలేస్తోంది ... భోజనం చేద్దామా మరి? ... అన్నాడు ఆప్యాయంగా ...

'ఏం ఫర్వాలేదు లెద్దురూ ... సిని

మాకు మరోరోజు పోవచ్చు...పోయి తీరాలని ఏం లేదుగా ... అవకాశం ఉంటే వెళ్ళేవాళ్ళం ... దానికేం...' అన్నది లలిత. సీతాపతి భోజనానికి సిద్ధమైనాడు.

'వంటలో ఈవాళో స్పెషాలిటీ ఉంది ఏవిటో కనుక్కోండి' సీతాపతి ఆలోచిస్తున్నాడు.

'ఈవేళ మీ ఫేవరిట్' చేశానండీ; ... బెంగుళూరు మిరపకాయకూర సెనగపిండికూరి చేశాను. వండర్ ఫుల్ కర్రీ...ఎలావుందో చెప్పండి...' మిరపకాయ కొరుకుతూ ... బ్రహ్మాండంగా ఉంది; మరో రెండుకాయలు వెయ్యి - అంటూ చకచకా భోజనం చేశాడు.

'భోజనం ఎప్పుడూ హడావుడిగా చేస్తారు. నెమ్మదిగా కూచుని తాపీగా మాట్లాడుతూ, పదార్థాలు ఎంజాయ్ చేస్తూ, హాయిగా భోంచేయకూడదూ ... అది మనసుకూ - వొంటికీ కూడా ఎంతో ఆరోగ్యం...'

'నీవు ఎప్పుడూ చెప్తూనే ఉంటావు, ...ఈ వెధవ అలవాటును మార్చుకోలేకుండా ఉన్నాను. ఏవిటో - మరి నాలోని బలహీనత...' అన్నాడు.

దీంట్లో బలహీనత ఏముందీ? అలవాటును నెమ్మదిగా మార్చుకునే ప్రయత్నం చెయ్యండి ... ఏదైనా ఓ విషయాన్ని గురించి మాట్లాడుతూ భోజనం చెయ్యండి ... మాట్లాడుతూ నేనూ మిమ్మల్ని ఎంగేజ్ చేస్తాను ... ఎక్స్పరిమంట్ ఎలా ఉంటుందో చూద్దాం...'

ఆలోచిద్దాం...అన్నాడు సీతాపతి ముభావంగా. భోజనం ముగించి - సిగరెట్టు ముట్టించి...వరండాలో పచార్లు చేస్తున్నాడు -సీతాపతి

చిటికలో పన్లన్నీ ముగించుకుని వచ్చింది లలిత. సీతాపతి సిగరెట్టు ఊదేస్తున్నాడు.

'మీ ఆలోచనలకు సిగరెట్లకు పోటీపడిన ట్లుందే ... ఏదిముందు! ఇదిగో చూడండీ ... సిగరెట్లు ఆరోగ్యాన్ని పాడుచేస్తాయని మీకుతెలుసు, ...నేను చెప్పవలసిన దాన్నికాదు ... పూర్తిగా మానేయడం ఇబ్బంది అయితే సంఖ్య కొంచెం తగ్గించండి ..' - అన్నది లలిత. 'ప్రయత్నం చేస్తున్నాను లలితా ... ఎందుకో నెగ్గలేకుండా ఉన్నాను. ఓటమే ఎదురవుతున్నది...'

అసలే సన్నగా ఉంటారు - బలహీనంగా...ఈ సిగరెట్లు మరీ బలహీనం చేస్తయి; పొద్దునపూట ఆలస్యంగా నిద్రలేస్తారు. దానివల్ల బోలెడంత బద్ధకం ... పెందలాడే లేచి ఏదైనా ఎక్సర్ సైజ్ చేస్తే బావుంటుంది మొన్న రీడర్స్ డైజస్టులో చూశాను; ...కొన్ని సింపిల్ లెసన్స్ ఇచ్చాడు - ఓ ఆర్టికల్‌లో ... అవిచేయడంకూడా




చాలా సులభం ... గేమ్స్ ఆడడం మీ కలవాటు లేకపోతే ఇవైనా బాగానే ఉంటయి. బ్రీదింగ్ ఎక్సర్ సైజ్ - చాలా సులభం...'

'ఈ ప్రాణాయామం అంటే నాకు ప్రాణాంతకంగా ఉంటుంది.'

'మొదలు పెట్టిచూడండి . మీతో పాటు నేనూ ప్రారంభిస్తాను. కాలేజిలో ఉండగా బోలెడు గేమ్స్ ఆడేదాన్ని; అప్పుడు ఎంతో హాయిగా ఉండేది...'

'అవును లలితా - అలా చేస్తే శారీరకంగానూ, మానసికంగానూ ఆరోగ్యంగా ఉంటుంది; మంచిరోజు చూసి ప్రారంభించాలి.'

, లలితఆరోగ్యంగానూ అందంగానూ ఉంటుంది. తీయని కంఠం; చక్కగా; పాడుతుంది...ముఖంలో మంచి తేజస్సు; స్వచ్ఛమైన నవ్వు. వయసుతోపాటు అందం పెరుగుతూ, ప్రతికదలిక లోనూ కొట్టవచ్చేట్టుగా అందం తొణికిసలాడుతూ ఉంటుంది 'భారీమనిషి; ఇద్దర్నీ ఒకసారిచూస్తే లలితే పొడవేమో అనిపిస్తుంది-ఆమె శరీరం ధృడముగా ఉండటం మూలాన. కాలేజీలో గేమ్స్‌లోనూ, డిబేట్లలోనూ, కల్చరల్ ప్రోగ్రామ్స్‌లోనూ బోలెడు ప్రయిజులొచ్చాయి...

వైభవంగా పెళ్ళయింది.

సీతాపతి తనకు భర్తగా లభించడము తన అదృష్టం అనుకున్నది.

ఆమె ఏ పని చేసినా ఓ ప్రత్యేకత ఉట్టిపడుతూ ఉంటుంది: తనపై చూపే శ్రద్ధకు ఎప్పుడూ సీతాపతి కృతజ్ఞతలు చెప్పుకుంటూనే ఉంటాడు సీతాపతి కన్న లలితలో ప్రతి విషయంలోనూ ఆధిక్యత కన్పిస్తూ ఉంటుంది.

వివాహం అయిన తొలిరోజు...

పూలపాన్పు...

అలంకరించుకుని హుందాగా సీతాపతివైపు రెండడుగులు వేసింది. లలితను ఆపాదమస్తకం ఓసారి చూసి- ఇంత అందాన్ని భరించలేం-అన్నట్టుగా కుంచించుకుపోయి మాటలు రాలేదు- సీతాపతికి. ఆరోజు సీతాపతికంటే లలితే ఎక్కువసేపు మాట్లాడింది. మాటల్లో చురుకుతనం, మనిషిలో ఆకర్షణ, ఆమె నవ్వుల్లో గలగలలు, సీతాపతిని ఉక్కిరిబిక్కిరి చేసినై. గదిలో అనేక విషయాలపై సరదాగా మాట్లాడుకున్నారు సీతాపతి ముభావంగానే ఉన్నాడు.

సీతాపతిని దగ్గరకు తీసుకుంది లలిత. ఆమె శరీరంలో ఇమిడిపోయాడు గువ్వలాగ.

మరి మీరంత సన్నగా ఉంటే ఎలా? పూఃగవ్వల్లలాగ; - ... మాటల ధోరణిలో అనుకోకుండా అనేసింది... అరె! అని నాలిక కొరుక్కుంది.

సీతాపతికి కొరడాతో కొట్టినట్లయింది.

సీతాపతి ముఖకవళికల్లోని మార్పును గమనించింది - లలిత ...

సబ్జక్టు మార్చి మల్లెపూలను గురించి ప్రారంభించింది. మల్లెపూలలోని ప్రత్యేకత గురించి చాలాసేపు మాట్లాడుకున్నారు. సీతాపతి లలితను దగ్గరికి తీసుకున్నాడు. రెండుచేతులూ చాలవా అన్పించింది. తెల్లవారింది.

టూత్ బ్రష్...పళ్ళవరసను అంటిపెట్టుకుని...శబ్దంచేస్తూ పైకీ కిందికీ గిరగిరాతిరుగుతున్నది. సీతాపతి ఆలోచిస్తూ అద్దంలో తనను తాను ఒకసారి చూసుకున్నాడు.

లలిత తనకన్నా దృఢమైనది అందమైనది. తెలివిగలది చురుకైనది. వెన్నలాంటి మనసు. అయినా సీతాపతి గర్వపడలేదు.

*    *    *

ఆదివారం పొద్దున్నే అలవాటు ప్రకారం ఆలస్యంగా బద్ధకంగా లేచాడు సీతాపతి.

టూత్ బ్రష్‌మీద పేస్టు పులుముతూ అద్దంలో చూసుకున్నాడు. జుట్టు అక్కడక్కడ తెల్లబడుతోంది. ముఖంలో ముడతలు కన్పిస్తున్నయి.

సీతాపతి కార్యక్రమం పూర్తయే సరికి-కాఫీ రెడీచేసి పేపరు చూస్తూ కుర్చీలో కూచున్నది లలిత.

'కాఫీ బ్రహ్మాండంగాఉంది లలితా- చక్కటి కాఫీ!' /అన్నాడు సీతాపతి.



మీరు ఆదివారంనాడు, తీరుబాటుగా నెమ్మదిగా సిప్ చేస్తూ సిగరెట్టు కాలుస్తూ...కాఫీ...బాగా ఎంజాయ్ చేస్తారని స్పెషల్ గా తయారుచేశాను- అన్నది పేపరు తిరగేస్తూ.

లలితవైపు చూస్తూ నెమ్మదిగా కాఫీ సిప్ చేస్తున్నాడు సీతాపతి.

'ఏవండీ ... ఇవ్వాళ రవీంద్రభారతిలో మంచి ప్రోగ్రామ్ ఉంది. గోపీకృష్ణడ్యాన్స ... పోదాము, మీకేం ఎంగేజ్ మెంట్సు లేవుగా ..'

'తప్పక వెళ్దాం...నేనుమధ్యాహ్నం వెళ్ళి టికెట్స తీసుకువస్తాను.'

అద్దంలో చూసుకుంటూ తల దువ్వుకుంటున్నాడు సీతాపతి. దువ్వుకుంటుంటే జుట్టు సన్నసన్నపీచులాగా ఊడిపోతోంది. అక్కడక్కడ తెల్లగా మెరుస్తోంది.

చదువుతున్న పేపరు చటుక్కున మూసేసి...'మీ జుట్టు అక్కడక్కడ

తెల్లగా ఉంటే ఎంతో అందంగా ఉంది. మంచి గ్రేస్ ఉంది' అన్నది లలిత.

చురుక్‌మన్నది సీతాపతికి.

జుట్టు తెల్లపడేంత వయసు లేదు సీతాపతికి. ఇంకా ముప్ఫైఅయిదు నిండలేదు. అప్పుడే తనెంతో ముసలివాడైనట్లూ ...తనసందరూ వెక్కిరిస్తున్నట్లు బాధపడ్డాడు.

'అవును లలితా ... నీకు మంచి 'ఈస్తటిక్ సెన్స్' ఉంది. ప్రతి చిన్న విషయంలోనూ అందం మాస్తావు. నీవు అందంగా ఉండడమేకాకుండా-' అన్నాడు సీతాపతి.

లలితను చూసినప్పుడల్లా-తనలోని బలహీనతను, తనలోని లోపాలను, ఎవరో గుర్తుచేస్తున్నట్టే ఉంది.

లలితతో ఎక్కడికన్నా బయటకు వెళ్ళడాన్ని సహించలేడు. ఏదో చెప్పలేని మానసికమైన బాధ లలిత పక్కన నిల్చున్నప్పుడు తనూ ఓ కురూపిగానూ, కురచగానూ ఉన్నానని అనుకుంటాడు. కాకిముక్కుకు దొండపండు అని అనొచ్చు-ఎవరైనా.

ఇది ఒకరితో చెప్పుకునే బాధ కాదు.

లలితను బాధపెట్టడం ఇష్టంలేదు. లలితను భార్యగా గాక ఒకవ్యక్తల్లే చూస్తూ - భయపడుతూ ...

ఎప్పుడూ ఒదిగిపోయి ... కుంచించుకుపోతూ ..గంభీరంగా ఉంటాడు మానసికాందోళనతో చిక్కి సగమైనాడు. పెళ్ళి చేసుకున్నపుడు ఇలాంటి ఉపద్రవం వస్తుందని ఊహించలేదు. మానసికంగా-తను పెరుగుతున్న కొద్దీ ...బాధ ఎక్కువైంది. జుట్టు తెల్లబడడంతో తనమీద తనకేకోపం ఎక్కువైంది. భరించలేకుండా ఉన్నాడు

లలిత నిజానికి తనకన్న పొడుగేం కాదు. మనిషి భారీగా ఉండి ధైర్యముగా నిటారుగా నిల్చోడంవల్ల అలా కన్పిస్తుంది. మంచి హుందాతనం ఉంది. తను వంగిపోయినట్లుగా ఉంటాడు.

ఏదోసాకు-నచ్చేట్లుగా చెప్పి లలితను ఎక్కడికీ తీసుకు వెళ్ళడంలేదు. ఆ రకంగా ఆమెను బాధపెడ్తూ తను నరకము అనుభవిస్తున్నాడు.

తనలోని ఈ రెస్ట్‌లెస్‌నెస్‌కు పరిష్కారం లేదు ...

ఈసారి - ధైర్యంచేసి రవీంద్ర భారతికి తీసుకెళ్తే ... ఎలా వుంటుందో ... లలిత చాలా సంతోషిస్తుంది ... అనలే అల్పసంతోషి ... ఏమీ లేకుండానే నిండుగా నవ్వుతుంది.

ఏ విషయానికీ నిర్ధారణకు రాలేకుండా ఉన్నాడు భోజనంచేసి, లలిత విశ్రాంతి తీసుకుంటున్నది నిద్రపోతున్న లలితను చూశాడు. ఆరోగ్యమైన శరీరం. అందమైన ముఖం. నిర్మలంగా ఉంది. ఫ్యాన్ గాలికి




ముంగురులు అటూ ఇటూ కదుల్తున్నాయి. ఆమె చీరె కట్టడంలోనే ఓ ప్రత్యేకత ఉంది ఏ చీరెకట్టినా చీరెకే అందం వచ్చిందా అన్నట్లుంటుంది సీతాపతి కవి కాదు. అయితే ఆమె నిద్రాసౌందర్యాన్ని గురించి ఒక కావ్యం రాసిపారేసే వాడే! సీతాపతి మానసిక బాధతో సతమత మవుతున్న తరి, మనిషి దృఢమైన శరీరం- నిశ్చలమైన మనసుతో ప్రశాంతంగా నిద్రపోతున్న లలితను చూసి సీతాపతి ఓ విధమైన బాధకు గురైనాడు.

రవీంద్ర భారతిలో సాయంత్రం ప్రోగ్రామ్... దానికి తీసుకువెళ్తా నని మాట ఇచ్చాడు లలిత తనకన్న అందమైనది, చురుకైనది. అన్ని విషయాల్లోనో ఆమెదే ఆధిక్యత కన్పిస్తుంది ఆమెముందు తను మరుగుజ్జులా ఉంటాడు. ఆ మాట తలుచుకుంటే భరింపరాని బాధ; తనో లిలీపుట్‌గా ఊహించుకుంటాడు.

ఆమెను తనతో తీసుకువెళ్ళటానికి మనస్కరించలేదు.

సన్నగా పాడుతున్న రేడియోను ఆపేశాడు

మంచినీళ్లు తాగితే రుచించలేదు. చేదుగా ఉన్నాయి.

సిగిరెట్టుమీద సిగిరెట్టు ఊదేస్తున్నాడు.

పెదిమలు కాలిపోయి నల్లగా

ఉన్నాయి. నోరు బెరడుకట్టి రుచీపచీ లేకుండా ఉంది.

కుర్చీలో కూర్చుని రెండుకళ్లూ రెండువేళ్ళతో మూసుకున్నాడు; మరో రెండు వేళ్ళమధ్య సిగిరెట్టు; ముడుచుకొన్న కనుబొమలు; తలలోంచి పొగవస్తున్నది. తలలోంచి లేచిన పొగ గాలిలో వలయాకారంగా రింగు రింగులగా వెళ్తోంది.

సీతాపతి కుర్చీకి కొంచెం వెనకాలగా మంచంమీద పడుకున్న లలిత కొద్దిగా కదిలింది. మెలకువ వచ్చిందల్లే ఉంది ... గభాల్న లేచింది. ఏదో కలవచ్చినట్లుంది ...

ఏవండీ ... అయ్యయ్యో అదేవిఁటి, మీ తలలోంచిపొగవస్తున్నది?... గభాల్న లేచింది

వేళ్ళమధ్య కాలుతున్న సిగిరెట్టును చూసి 'అబ్బ ... ఎంత కంగారుపడ్డానండీ;...ఏదో కలవచ్చింది...'ఉండండి ...కాఫీ తీసుకొస్తాను - అంటూ వంటఇంటివైపు వెళ్లింది.

సీతాపతి మొహం అంతా సిగిరెట్టు పొగ అలుముకుని – అసలే నల్లగా ఉన్న చర్మం మాడిపోయినట్టుగాఉంది.

సిగిరెట్టులోని సన్న నిరవ్వలు చొక్కాలేని తనశరీరం మీదపడి చురుక్కుమనే టప్పటికి సీతాపతి ఈ లోకంలోకి వచ్చేడు.

తలమీదనుండి చేతులు గుండెల మీదికి వచ్చినయి.

లలిత కాఫీ తీసుకువచ్చి బల్ల పెట్టింది.

సీతాపతి సన్నగా మూలిగేడు.

'అదేవిఁటండీ! గుండెలలో చేతులు పెట్టుకున్నారు? కొంచెం నీరసంగా కనపడుతున్నారు?' లాలనగా అన్నది లలిత.

'గుండెలలో ఎందుకో బరువుగా ఉంది;... అదే తగ్గిపోతుందిలే -అనుకున్నాను. నిన్ను డిస్టర్బ్ చేయలేదు...' అన్నాడు నీరసంగా.

అలా మంచంమీద పడుకోండి ... అమృతాంజనం తెచ్చి కొంచెం రుద్దుతాను...అంటూ లోపలికి వెళ్లి అమృతాంజనం తీసుకువచ్చి సీతాపతి పక్కన కూర్చున్నది.

'ఏఁవండీ ... రుద్దుతుంటే కొంచెం రిలీఫ్‌గా వుందా?...అని పదేపదే అడిగింది.

సీతాపతి కళ్లుమూసుకు పడుకున్నాడు; మధ్య మధ్య లలితవైపు చూస్తూ ... చేతి కదలికకు వచ్చిన గాజుల గలగలను వింటూ ...

ఇవ్వాళంతా రెస్టు తీసుకోండి. అవసరమైతే రేపు శలవు పెట్టి, పూర్తిగా రెస్టు తీసుకోండి - అన్నది అమృతాంజనం రుద్దుతూ

"ఓ గంట ఉంటే అదే తగ్గిపోతుంది, సాయంత్రం అలా రవీంద్రభారతికి వెళ్దాం. మంచి ప్రోగ్రామ్ ఉంది." అన్నాడు నీరసంగా.



'ప్రోగ్రామ్ వద్దూ-ఏమీ వద్దూ-మీ రెక్కడికీ కదలగూడదు.'

సీతాపతికి కొంచెం రిలీఫ్ ఇచ్చింది. అయినా సన్నగా మూలుగుతున్నాడు.

లలిత ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ లో బొమ్మలు చూస్తున్నది

సీతాపతి మళ్ళీ సిగిరెట్టు తీయబో తున్నాడు. లలిత సీతాపతి రెండు చేతులూ పట్టుకుని... 'మీకు పుణ్యం ఉంటుంది...ఇప్పుడైనా ఆ సిగరెట్టు మానేద్దురూ! నొప్పి కొంచెం తగ్గిం తరువాత, రెండురోజులు పోయాక మొదలెట్టచ్చు, అంతగా ఉండలేక పోతే' - అన్నది

సీతాపతికీ లలితకూ మధ్య సిగరెట్టు నలిగిపోయింది సీతాపతి సిగరెట్ ఎందుకు మానలేడో లలితకు తెలుసు. లలితకు తెలుసునని సీతాపతికి తెలి యదు.

రవీంద్రభారతిలో ప్రోగ్రామ్ ప్రారంభం అయే టైమ్ అయింది

సీతాపతి సన్నగా మూలుగు తున్నాడు

లలిత సీతాపతివైపు చూస్తున్నది! ఆ చూపులో ఏ భావనా లేదు లలిత చురుకైనది, తెలివైనది...అందమైనది...ఆమె శరీరం ధృడంగానూ... మనస్సు నిశ్చలంగానూ ఉంటుంది!! సీతాపతి అంతకంతకూ కురచైపో తున్నాడు.

# "అలసిపోయాను!"

ప్రపంచ ప్రఖ్యాతికెక్కిన హాలీవుడ్ సినీమా హాస్యనటుడు బాబ్ హోప్, ఇప్పటికి పాతికసంవత్సరాలకు పూర్వం, ఒక పుస్తకానికి ఉపోద్ఘాతం వంటివి రాయవలసివచ్చింది. పుస్తకం గురించి రెండు ముక్కలు రాశాక, అతని ఉపోద్ఘాతం ఈవిధంగా ముగిసింది.

"ఈ ఉపోద్ఘాతంతో నేను పూర్తిగా అలసిపోయాను. ఎందుకంటే: ఇవేళ నేను చాలా పనులు చేశాను. ఈవేళ నా గుండె లక్షామూడు వేల మూడువందల ఎనభైతొమ్మిదిసార్లు కొట్టుకుంది. నా రక్తం పదహారుకోట్ల ఎనభైలక్షల మైళ్ళు ప్రయాణంచేసింది. ఇరవైమూడువేల నలభైసార్లు ఊపిరితీశాను. నాలుగువందల ముప్ఫయిఎనిమిది ఘనపుటడుగుల గాలి పీల్చుకున్నాను. మూడుంపావు పౌండ్ల తిండితిన్నాను. రెండుమ్ముప్పావు పౌండ్ల ద్రవపదార్థాలు తాగాను. దాదాపు వొకటిన్నర పైంట్ల చెమటపట్టింది. ఎనభైఅయిదున్నర డిగ్రీల ఉష్ణాన్ని బయటకొదిలాను. నాలుగువందల యాభైటన్నుల శక్తి నాలోంచి పుట్టుకొచ్చింది. నాలుగువేల ఎనిమిదివందల మాటలు మాట్లాడాను, ఏడువందలయాభై పెద్దరకం కండరాలు కదిలించాను. నా గోళ్ళు .000046 అంగుళాలూ, నా కేశాలు 01714 అంగుళాలూ పెరిగిపోయాయి. నా మెదడులో డెబ్భయిలక్షల కణాలు పనిచేసిపెట్టాయి. నేను పూర్తిగా అలసిపోయాను."

ఇందులో ఒక చక్కని చమత్కారం ఇమిడివుంది. అదేమిటో తెలుసుకోలేనివారు క్రింది వాక్యం చూడండి.

ఆరోగ్యకరమైన ప్రతి మనిషికీ అది నిత్యానుభవమే.




పరిమళా సోమేశ్వర్

నీటుగా ముస్తాబై నగరయాత్రకు సిద్ధంగా వుంది ఇన్ఫర్మేషన్ ఆఫీసుముందు 'మనోరమ'

ఎఱ్ఱటి పాప్లిన్ క్లాత్ మీద తెల్లటి పూలున్న 'మినీస్కర్టు' ధరించిన 'ఎలిజా' హ్యాండ్ బాగ్ ఊపుకుంటూ ఆఫీసులో నుండి బయటకు వచ్చింది. ఆమెతో పాటుగా భాగ్యనగర సందర్శనార్థం వివిధ ప్రదేశాలనుండి వచ్చిన జనం కూడా 'మనోరమ' దిక్కుగా నడిచేరు.

ఎలిజా అందరికంటె ముందుగా బస్సెక్కింది; ముందుసీట్లో కూర్చుని తలను సీటువీపుకాన్చి బస్సులోకి ఎక్కుతున్న వ్యక్తులను ఒక్కొక్కరినే పరిశీలనగా చూడసాగింది.

మొదట మెడలో కెమెరాని తగిలించుకున్న ఓ రోమన్ క్రాపు జల్సా రాయుడు ఎక్కేడు; అతని వెనుక భార్యా బిడ్డలతో సహా బిలబిలమంటూ ఎక్కేడు ఒక 'కుటుంబయ్య' వీళ్ళ వెంట ఓ ఇరవై ఏళ్ళ యువతి పాతికేళ్ళ యువకుడు వచ్చేరు. వాళ్ళిద్దరూ 'హనీమూన్' కోసం బయల్దేరిన నవ దంపతులని 'గైడ్' వృత్తిలో మూడేళ్ళుగా ఉంటూవచ్చిన ఎలిజా యిట్టే గ్రహించింది. తరువాత ఖద్దరులాల్చీ, ఖద్దరుపంచ ధరించిన ఒక పెద్దమనిషి, అతని అనుయాయుడుగా కనపడుతున్న మరో వ్యక్తీ ఎక్కేరు. వాళ్ళ వెనుక విచిత్రచూపులు చూస్తూ కంగారుగా ఎక్కేరు నీలికావిపంచలు చొక్కాలు తొడుక్కున్న యిద్దరు రైతు యువకులు తరువాత ఠీవిగా, నెమ్మదిగా ఎక్కేరు పాశ్చాత్యదేశాల నుండి వచ్చిన వ్యక్తులుగా కనపడుతున్న

దంపతులిద్దరు; ఆఖరున పాన్ నములుతూ ప్రవేశించేడు పొడుగాటి షేర్వాణీలో ఒక నలభై యేళ్ళ వ్యక్తి.

ఎవరి సీట్లలో వారు కూర్చున్నాక, క్లుప్తంగా ఆనాడు వారు చూడబోయే ప్రదేశాలను గూర్చి వివరించింది ఎలీజా.

'మనోరమ' కదిలింది వయ్యారంగా.

మొదట నాంపల్లి మీదుగా పబ్లిక్ గార్డెన్స్ దగ్గరకు వచ్చి ఆగింది-టూరిస్ట్ బస్సు

అందరూ ఒకరినొకరు తోసుకుంటూ దిగేరు బస్సులోనుండి. 'కుటుంబయ్య' గారి పిల్లలు బిలబిలమంటూ పరుగెత్తేరు గార్డెన్సులోపలికి అరుస్తూ, కేకలు పెడ్తూ: అమ్మానాన్నలు వారిస్తున్నా వినకుండా మొక్కమొక్కనీ చేత్తో పట్టుకుంటూ పరుగులు తియ్యసాగేరు రోమన్ క్రాఫువాలా కెమెరాను సరిచూసుకుంటున్నాడు మంచి 'యాంగిల్సు' కోసం.

'పాశ్చాత్యదంపతులు లోకంతంలో కొంచెం మూతులు వంకరగా పెట్టి మాట్లాడుకుంటూంటే వారికి గజం దూరంలో నడుస్తూ వాళ్ళ ప్రతి కదలికనూ దొంగచాటుగా పరీక్షచేస్తూ ఆశ్చర్యాద్భుత రసాల్లో తేలి ఓలలాడుతున్నారు రైతు యువకులు. ఖద్దరు లాల్చీ పెద్దమనిషి మెత్తని పచ్చికమీద కూర్చుని ఉపన్యాసం ఇస్తుంటే తలూగిస్తూ వినయంగా వింటున్నాడు ఆయన అనుచరుడు. షేర్వాణీ ధరించిన పెద్దమనిషి ప్యాకెట్ ట్రాన్సిస్టరును 'ఆన్' చేసి మెల్లగా నడుస్తూ తిరగసాగేడు.

ఎలీజా వాళ్ళతోపాటు తిరగకుండా హెల్తుమ్యూజియం ముందున్న పచ్చికలో కూర్చుని అరగంటలో అందరినీ తోటచూసి అక్కడికి రమ్మనిచెప్పింది.

వృత్తిరీత్యా రోజూ చూడటానికి అలవాటు పడిపోయిన ఆ గార్డెన్సు ఆమెకు ఎలాటి ప్రత్యేకమైన ఆనందాన్నీ, ఆకర్షణనీ ఇవ్వలేకపోయినయ్. కాళ్ళురెండూ కొద్దిగా బారజాపి చేతులు వెనకనేల కానించి తల పైకెత్తి చూసింది ఎలీజా. లేత నీలవర్ణపు ఆకాశంలో మెల్లగా కదలుతున్న తెలిమబ్బుల సోయగాలను తిలకిస్తూ నిశ్శబ్దంగా ఉండిపోయింది కొంతసేపు.

హఠాత్తుగా 'క్లిక్' మన్న శబ్దం వినిపించినట్లయి ఉలిక్కిపడింది ఎలీజా

ఆమెకు పదిగజాల దూరంలో 'రోమన్ క్రాఫు' కెమెరాను మెడకు తగిలించుకున్నాడు. "థాంక్యూ మేడమ్!" అన్నాడు గారపట్టిన పళ్లు బయటపడేట్టు నవ్వుతూ.

ఆమె నవ్వింది, సుస్మితంగా, అందంగా.

అతను అటు తిరగగానే అదే భంగిమలో కూర్చుని తన శరీరాన్నంతటినీ ఓ మారు గర్వంగా చూసుకుంది.

లోతుగా కత్తిరించిన జాకెట్టులో



నుండి నిండైన రొమ్ముల మధ్య గల సన్నని రేఖ స్పష్టంగా బయటకు కనపడుతోంది. నగ్నంగా ఉన్న మోకాళ్లు సూర్యరశ్మిలో – నిగనిగ మెరిసిపోతున్నయ్. తేనెవర్ణంలో ఉన్న ఉంగరాల జుట్టుకొసలు మృదువుగా మెడపక్క భాగాలను తాకుతూ గిలిగింతలు పెడ్తున్నయ్. నిండు యౌవనంలో ఉన్న పొందికైన తన అవయవాలన్నటినీ చూసుకుని గర్వంగా తృప్తిగా నవ్వుకుంది ఎలిజా

ఆమె లేచింది. రెండుచేతులూ వెనక్కుకట్టుకుని అటూ ఇటూ పచార్లు చేయసాగింది. అలా నడుస్తూనే మాటి మాటికీ తనశరీరాన్ని తానే పైనుండి కిందకు పరిశీలనగా చూసుకుంటూ రహస్యంగా తృప్తి పొందసాగింది.

కొంతసేపలా గడిచిన తరువాత ఒక్కరొక్కరే రాసాగేరు ఆమె వైపుకు; వాళ్ళందరూకూడా దూరాన్నుండి తనవంకే తదేకంగా చూస్తూ రావటం కనిపించిందామెకు.

వాళ్ళందరినీ హెల్తుమ్యూజియంలోకి తీసుకువెళ్ళింది. అందులోని గదులు చిన్నవిగా ఉండటంవల్లను, వీళ్ళుకాక అప్పటికే యింకా చాలా మంది జనం వచ్చి ఉండటంవల్లను కిటకిట లాడిపోతోంది మ్యూజియం. జనం ఒకరి నొకరు తోసుకుంటూ ఆరోగ్య సూత్రాలను బోధించే చిత్రాలను, వాక్యాలను చూసుకుంటూ నడుస్తున్నారు, ఆ సందట్లో ఒకరిద్దరు తనను రాచుకుంటూ పోవటం 'రోమన్ క్రాపు' మోచేయి తనకుడి రొమ్మును

తాకటం - యివేమీ గమనించనట్లే నటించింది ఎలిజా.

'కుటుంబ నియంత్రణ'ను ప్రచారం చేసే చిత్రం ముందు నిలబడిందామె. ఆమె దగ్గరకు 'హనీ మూన్' దంపతులు వచ్చేరు. అతను ఎలిజాదగ్గరగా నిలబడి ఎలాగైనా ఆమెతో మాట్లాడాలని ఏదో అర్థంలేని ప్రశ్న వేసేడు. ఆమె సమాధానం చెప్పినా విడవకుండా అక్కడే నిలబడి సంభాషణని పొడిగించసాగేడు. అతని 'అర్ధాంగి' తన భర్త ఒక ఆకర్షణీయమైన యువతితో అంత చనువుగా మాట్లాడటం భరించలేక తన అసూయను, అయిష్టాన్ని భర్తకుచెప్పే చనువు, సాహసం లేకనూ అసహనంగా నిలబడింది- వాళ్ళకు కొంచెం దూరంలో.

చెప్పులులేని ఆమె కాలివేళ్ళకుగల మట్టెలను తనకుదగ్గరగా నిలబడిన ఆతని ఎడమచేతి వేళ్ళకుగల మూడు ఉంగరాలను మార్చి మార్చిచూస్తూ నిలబడింది ఎలిజా.

నీరుకావి దుస్తుల రైతు యువకులు గాజు పెట్టెల్లో ఉంచిన మృతశిశువుల కళేబరాలను నోళ్ళు తెరచుకుని చూడసాగేరు.

"ఏందిరోయ్. మడిసి పిల్లలు ఇందులోకి ఎట్ట దూరేర్రోయ్." అన్నాడొకతను ఆశ్చర్యంగా వెఱ్ఱికేక పెడ్తూ.

"ఆళ్లు బతికున్నోళ్లు కాదురా. సచ్చినోళ్ళను తీసుకొచ్చి ద్రావకంలో పడేత్తారట."

"ఏం దేండి! అట్టసెప్పు"

"మన రాజగోపాళంగారి మూడో అబ్బాయి యిక్కడే డాట్టరుకోర్సు సదువుతున్నాడు కదూ? ఆ డోపాలి చెప్పేళ్ళ - నాతో."

"బలేబలే సిత్రంగా ఉందే."

"ఇంక టైమయిపోయింది పదండి" అంది ఎలిజా ఇంగ్లీషులో. అంతా ఆమె ననుసరించేరు

అందరూ బస్సులోకి ఎక్కేక ఎలిజా 'రవీంద్ర భారతి'ని, 'రేడియో స్టేషను'ని బయటనుండే చూపించింది

'మనోరమ' వేగం పెంచింది

ఎక్కడా ఆగకుండా దూకుడుగా పరుగెత్తుకుంటూ వెళ్ళి 'సాలార్ జంగ్ మ్యూజియం' ముందు ఆగింది 'మనోరమ.'

అందరూ దిగేవరకు ఎలిజా సీట్లోనే కూర్చుంది. ఆఖరున రైతు యువకులు ఓరకంట ఆమెను చూస్తూ దిగేరు.

బస్సు దిగబోతూ ఒకతను "ఒరేయ్ నర్సిగా. 'అది' ఆడదా, మొగోడా?" అనడిగేడు గట్టిగా గుసగుసలాడే కంఠస్వరంతో. నర్సిగాడు కిసుక్కున నవ్వేడు.

"ఎర్రినాయాలా! ఆ మాత్తరము తెలీదూ? సూత్తే కనపట్టంలా...? ఆడదే!"

"ఆడదైతే మరి మొగానబొట్టు

నేదేం? చెవులకు కమ్మలు లేయే? జుట్టు మొగోడి క్రాపునాగుందేమరి?"

"ఆశ్చర్యంలేలే. అట్టనే ఉంటారు. ఆళ్లు మనోళ్ళుకాదు. 'బాస' మాట్టాడే వోళ్ళంతా దాన్లానే ఉంటారు."

"బలేబలే!"

ఆ రైతు యువకు లిద్దరూ తనని ఉద్దేశించె మాట్లాడుకుంటూన్నా రని ఎలిజాకు తెలుసు. ఆమెకు తెలుగు బాగానే మాట్లాడటం వచ్చు. ఆమె పుట్టి పెరిగింది చిత్తూరులో కాని బయటకు వస్తే ఎన్నడూ ఒక్క తెలుగు మాటకూడా ఉపయోగించదు. ఆమె వేషం అదీ చూసి అంతా ఆమె 'ఆంగ్లో యిండియన్' అనీ ఆమెకు తెలుగు రాదనీ అనుకుంటారు

ఆ పల్లెటూరి యువకుల సంభాషణ విన్న ఎలిజాముఖం కొద్దిగా చిన్న బోయింది. ఆమె మనసు చివుక్కు మంది. కానిఆమె అంతరాంతరాళాల్లో దాగిన 'సెన్సాఫ్ హ్యూమర్' చటుక్కున విరగబడి నవ్వించింది.

"ఎలిజాకూడా దిగి వాళ్ళవెంట నడచింది.

ఒక్కొక్క గదిలో అమర్చి ఉన్న వస్తువులను చూస్తుంటే అందరికీ సంతోషంగా, ఆశ్చర్యంగా ఉంది. పిల్లల భాగంలో అమర్చబడిన బొమ్మలను, వాటని చూసేక 'కుటుంబయ్యగారి' సంతానం యొక్క ఆనందానికి పట్టపగ్గాలేక పోయినయ్. ఆ బొమ్మనీ ఈ బొమ్మనీ తాకటం. చేతికి వీలుగా ఉన్న వస్తువులను పైకి ఎత్తటంకూడా చేస్తూంటే తల్లి తలో రెండూ అంటించింది. దాంతో వాళ్ళు 'కీ చు కీ చు' మంటూ ఏడుపు లంకించుకున్నారు. పిల్లలలా అసభ్యంగా ఏడవటం అవమానకరమని భావించిన కుటుంబయ్య "ఏడుపు మానార్తారా, లేదా?" అంటూ మరో రెండు అంటించేడు.

పుష్టికరమైన అవయవాలతో పరిపూర్ణ సౌందర్యంతో ఆకర్షణీయంగా ఉన్న పాలరాతి స్త్రీ ప్రతిమలను నోళ్లు తెరచుకుని చూడసాగేరు - రైతు యువకులు

"ఒరేయ్. ఈ బొమ్మకు గుడ్డల్లేవు రోయ్" గుసగుసమన్నాడు ఒకతను.

"అందంతేరా. మడుసులకుమల్లె అన్ని బొమ్మలూ గుడ్డలు కట్టుకోవు."

నగ్నంగా ఉన్న గ్రీకు సుందరిని చూసి చటుక్కున కళ్ళు తిప్పేసుకుంది కుటుంబయ్యగారి భార్య 'హవ్వ!' అని బుగ్గ నొక్కుకుంటూ.

ఆ గది దాటేవరకు ఆ బొమ్మనే వెనక్కి తిరిగితిరిగి చూస్తూ వెళ్లేరు రైతుయువకులు.

ఆ మ్యూజియంలోకల్లా పిల్లలనీ పెద్దలనీ అందరినీ ఆకర్షించింది గడియారంలో గంటలుకొట్టే మనిషి.

తలుపుతెరచుకుని ఒకతను గబు

క్కున బయటకువచ్చి పన్నెండు గంటలుకొట్టి మళ్ళీ తుర్రున లోపలికి పోయి తలుపేసుకోగానే పిల్లలంతా చప్పట్లుకొట్టేరు అరుస్తూ.

"ఆహా!" అంటూ కుటుంబయ్య గారి భార్య ముక్కుమీద వేలేసుకుంది. రైతుయువకులు అది భూలోకమన్న సంగతే మర్చిపోయేరు కాసేపు. ఏ మాయలమారి ఫకీరో తమనో విచిత్ర ప్రపంచంలోకి తీసుకువెళ్ళినట్లు అనుభూతిపొందేరు.

ఖద్దరులాల్చీ పెద్దమనిషి ఆ రకమైన గడియారం హైద్రాబాద్‌లో తప్ప ఇండియాలోనేకాక ప్రపంచంలోని మరే ఇతర దేశంలోకూడా లేదని సాధికారంగా ప్రకటిస్తుంటే అతని అనుచరుడు అక్షరాలా ఆయన అభిప్రాయాన్ని నమ్మటానికి ప్రయత్నించేడు.

ఆ తరువాత చార్‌మినార్ దగ్గరకు తీసుకువెళ్ళింది 'మనోరమ' వాళ్ళందరినీ.

ఆ షేర్వాణీవాలా చార్‌మినార్ కింద నమాజ్ చేసేడు. అతను నమాజ్ చేస్తున్నంతసేపూ పాశ్చాత్య దంపతులు అతనినీ అతనిలాగానే నమాజ్ చేస్తున్న మరికొందరినీ వింతగా పరిశీలిస్తూ నిల్చున్నారు. అప్పటికే మిగతా వాళ్ళంతా చార్‌మినార్ ఎక్కటం మొదలెట్టేరు.

నమాజ్ ముగిసేక పాశ్చాత్య దంపతులు అతనిని నమాజ్‌ని గురించి ఏదో అడిగేరు. అతను సగం ఇంగ్లీషు, సగం ఉర్దూకలసిన విచిత్రమైన భాషలో వాళ్ళకు బోధపరచటానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు. అలా మాట్లాడుకుంటూ వాళ్ళు ముగ్గురూ కూడా చార్‌మినార్ ఎక్కసాగేరు.

చీకటిగా ఉన్న మెట్లమీద కుటుంబయ్యగారి పిల్లవాడి కాలుజారింది 'అమ్మో!' అంటూ గావుకేక పెట్టి వాడు తల్లిని కౌగలించుకున్నాడు

"నాయనా భద్రం! ఒసే సీతాలూ, రాధీ! జానకీ! శీనుగా, వెంకన్నా! జాగ్రత్త! చూసినడవండి. ఒసే అమ్మడూ నువ్విలారావే. ఒరేయ్ చెవులసన్నాసీ! నువ్వు నాన్నగారి చెయ్యిపట్టుకోరా! అమ్మా! నాయినా! ఏడుకొండలవాడా!" అంటూ ఆపసోపాలు పడుతూ ఎక్కింది ఒక్కొక్క మెట్టే ఆవిడ. చివరికెలాగైతేనేం అరగంటలో అంతా చార్‌మినార్ చివరి భాగం చేరుకున్నారు.

మట్టమధ్యాహ్నపు సూర్యుడు తీక్షణంగా వెలిగిపోతున్నాడు. అతని తీక్షణతకు ఆగలేక ఆకాశంరంగు వెలిసిపోయి వెలవెలాబోతోంది.

కర్చీఫుతో నుదుటిమీద బుగ్గలమీద సున్నితంగా అద్దుకుంది ఎలిజా. లిప్‌స్టిక్ రాసిన పెదవులు ఎండి బిగు




సుకు పోయినయ్. బుగ్గలకు రాసుకున్న రోజారంగు చెమటలో తడిసి చెదిరిపోయింది.

చార్మినార్ అంచున నిలబడి క్రిందకుచూసింది చీమలబారుల్లా సాగిపోతున్న జనప్రవాహాన్ని తదేకంగా చూస్తూ నిల్చున్న ఎలిజాలో ఏదో చిత్రమైన కదలికబయల్దేరింది ఎప్పుడూ అలా అంత ఎత్తున నిల్చుంటే గబాల్న క్రిందికి దూకాలన్న ప్రబలమైన కోరిక కలుగుతూంటుంది. ఆమెకు దూకేక ఆ పైన ఏమవుతుందో! తన యీ సుందర దేహాన్నుండివిడిపోయిన కాళ్లూ చేతులూ, వికృతంగా తెరిచిన నోరూ నిలువుగుడ్లువేసిన కళ్ళు—చావు అంత వికారంగా, భయంకరంగాఉంటుందా—

అయినా మృత్యువులో విచిత్రమైన ఆకర్షణ ఏదో ఉంది. అదో గొప్ప సెంసేషన్! నవ్వుకుంది ఎలిజా.

పావుగంట గడచేక అదరాబాదరా అందర్నీ క్రిందకు తరిమింది ఎలిజా.

హడావిడిగా "నెహ్రూ జూలాజికల్ పార్కుకు" చేరుకుంది టూరిస్టు బస్సు

అక్కడ చల్లని చెట్లనీడల్లోకూర్చుని అందరూ తాము తెచ్చిన తినుబండారాలను బయటకు తీసి తినసాగేరు

కుటుంబయ్యగారి భార్య గుడ్డసంచిలోనుండి సత్తుకారియర్ను బయటకు తీసింది. ఒక్కొక్క గిన్నె తీసి అందులోనుండి పులిహోర, గారెలుతీసి రెండు విస్తళ్లలో వడ్డించింది పది

నిమిషాల్లో ఒక్కమెతుకన్నా మిగలకుండా ఊర్చిపారేసేరు పిల్లలందరూ. తరువాత మరో చిన్న కారియర్‌లో తీసుకొచ్చిన నీళ్ళమజ్జిగను అందరికీ తలా కొంచెం యిచ్చింది తల్లి.

రైతు యువకులు ఎవరూ లేని చోట కూర్చుని తాము తెచ్చుకున్న చద్దన్నం మూటలువిప్పేరు. ఆవకాయలో అన్నాన్ని పెద్దసైజు నిమ్మకాయంత ముద్దలుచేసి వాళ్ళిద్దరూ మింగుతుంటే అప్పుడే తిని అటు వచ్చిన కుటుంబయ్యగారి పిల్లలు వెంకన్న, శీను నోరూరించుకుంటూ చూస్తూ నిలుచున్నారు.

"అబ్బ! ఎర్రగా ఎంత బాగుందో ఆవకాయ అన్నం! మనకోముద్ద పెడ్తే బాగుండును," అనుకున్నారిద్దరూ.

వెస్టరిన్ కఫుల్, ఖద్దరు లాల్చీ పెద్దమనిషి, అతని అనుచరుడు రోమన్ క్రాపు, షేర్వాణీవాలా, ఎలిజా కాంటినుకి వెళ్ళేరు తినటానికి; హానీమూను దంపతులు యింటిదగ్గరనుండి తెచ్చిన బూందిలడ్డూలు, కారప్పూస తిన్నారు కాంటీను ముందరే ఉన్నా చెట్లదగ్గర కూర్చుని

ఉపాహారం ముగించుకున్నాక ఎలిజా టాయ్‌లెట్ రూమ్‌లోకి వెళ్ళి ముఖానికి పౌడరు రాసుకుని బుగ్గలకు రోజారంగు పులుముకుని పెదవులకు లిప్‌స్టిక్కు పూసి తల నోమారు దువ్వుకుని 'ట్రిమ్'గా తయారై బయటకు వచ్చింది. చక్కగా అలంకరించుకుని నడచివస్తున్న 'ఎలిజా'ను చూసి లడ్డుండ నోట్లో పెట్టుకుంటున్న 'హానీమూను' యువకుడు తినటంకూడా మానేసి ఆమెవంకే కన్నార్పకుండా చూడటం మొదలెట్టేడు, తనభర్త చూపులను అంతబలంగా ఆకట్టుకున్న ఎలిజాను చూసేక ఆ యువతికి యింక తిను బండారా లేవీ గొంతుదిగలేదు. రోషముతో, అవమానంతో నిండిన కన్నీరు ఆమె గొంతులో గరగరమంది. ముందు కొంకకు నల్లబారిన ఆమె చామనచాయ మరింత నల్లబడిపోయింది —నిరాశతో; దుఃఖాతిశయంతో.

మనుష్యుల మనోభావాలను అర్థం చేసుకోగల శక్తిని ఉగ్గుపాలతోనే అలవర్చుకున్న ఎలిజా అల్లంత దూరంలో ఉండగానే ఆ హానీ మూనుదంపతుల ముఖాలలో వ్యక్తమౌతున్న భావాల భాషను అర్థం చేసుకునికూడా చేసుకోనట్టే, వారి నసలు చూడనట్టే రీవిగా వాళ్ళముందునుండి నడచి వెళ్ళింది

ఒకపక్క రీవి, మరోవంక వయ్యారము పోటీపడ్తున్నట్లుగా నడుస్తున్న 'ఎలిజా'కు ఒకజతకళ్లు తనని గుచ్చి గుచ్చి చూస్తున్నట్లు మరోజతకళ్లు తన వంక అసూయగా, నిస్సహాయంగా, విచారంగా చూస్తున్నట్లూ తెలుసును. ఎండకు తనముఖాన్ని చూపటం ఇష్టం




లేక నీడగావున్న ప్రదేశాల్లో నే 'నడుస్తూ తిరగసాగింది ఎలిజా.

ఖడ్గమృగం, నీటిగుఱ్ఱం, మరికొన్ని విచిత్రమైన జంతువులను చూసి వచ్చి చివరకు 'ఎక్వేరియం'లోకి వచ్చేరు అంతాను. ఆ ఎక్వేరియం చూస్తున్నంతసేపూ ఖద్దరు లాల్చీ పెద్దమనిషి 'బాంబే'లో ఉన్న "తారాపూర్ వాలా ఎక్వేరియం" ముందు యిది దిష్టి తిప్పటానికికూడా పనికిరాదనీ ఆ బాంబేలో ఉన్నంత పెద్ద ఎక్వేరియం ప్రపంచంలోనే చాలా అరుదనీ ధారాళంగా ఉపన్యాసం యిస్తూనే ఉన్నాడు తన అనుచరుడికి.

' రోమనుక్రాపు, హనీమూను యువకుడు తనవంక ఆశగా చూస్తూ గుటకలు మింగటం గమనించిన ఎలిజా గర్వంగా నవ్వుకుంది. మిడిసిపడుతున్న తన యావనాన్ని చూసి మురిసిపోయింది కొంతసేపు. వాళ్ళిద్దరూ తనదగ్గరకు వచ్చి ఏవేవో సందేహాలున్నట్లు అడగటం, లోతుగా కత్తిరించిన తనజాకెట్టు లోపలికీ, తనకళ్ళలోకీ ఎర్రటి తనశరీర ఛాయలోకీ మార్చిమార్చి. చూడటం...యివన్నీ గమనించికూడా యేం తెలియనట్లే వాళ్ళతో అతిసహజంగా మాట్లాడింది.

రెండుగజాల దూరంలో కొండచిలువదగ్గర నిలబడి తనభర్త ఆ అమ్మాయికి దగ్గరగా నిలబడి కళ్ళల్లో మెరు

పులు, పెదవుల్లో చిరునవ్వులు కురిపిస్తూ మాట్లాడుతూంటే చూస్తున్న ఆ యువతి ముఖంలోని 'ఎక్స్‌ప్రెషను' చూసి ఎలిజాకి గుండెను తొలచినట్లయింది ఆ యువతి హృదయంలో భగభగమండుతున్న అగ్నిజ్వాలలు తన హృదయంలోకి ప్రవేశిస్తున్నట్లనిపించి చటుక్కున సంభాషణను తుంచేసి "టైమయిందింకపదండి, గోల్కొండ పోవాలి," అంటూ అక్కడనుండి వెళ్ళి పోయింది.

ఆమె మనసంతా చెదరిపోయింది. ఆ యువతి కళ్ళే మాటిమాటికీ ఆమెకు కనపడసాగినయ్. తనుకూడా స్త్రీయే; మరో స్త్రీ యొక్క అంతర్యాన్ని అర్థం చేసుకోవటం ఏమంత కష్టమైన పనికాదు తనకి.

స్త్రీత్వంలోని ఆశలు, నిరాశలు, నిస్పృహ, నిస్సహాయత, అసూయ, ఆరాటం అన్నీ ఒకచోట మూర్తీభవించినట్లున్నాయ్ ఆ యువతి కళ్ళు

వివాహమైన కొద్ది సంవత్సరాలలోనే పిల్లలు, జబ్బులు, దరిద్రం ఆకర్షణ నశించిపోయిన భార్యా, ఆంతర్యము చచ్చిపోయిన భర్త ... అన్నీ కలసిన ఆ జీవితం నరకసదృశంగా ఉంటుందన్న నిజాన్ని మధ్యతరగతి కుటుంబంలో పుట్టిముగ్గురు అక్కయ్యల జీవితాలను, నలుగు రన్నయ్యల జీవితాలను క్షుణ్ణంగా చదివి తెలుసుకుందా యువతి. అందుకే కనీసం వివాహపు తొలిరోజుల్లో లభించిన మాధుర్యాన్నైనా గుండెలో దాచుకుని, ఆ అనుభవాల జ్ఞాపకాలతో శేషజీవితాన్ని అర్థ్రం చేసుకోవాలని ఆమె ఆరాట పడుతోంది.

కాని మగవాడి మనసు భ్రమరం లాటిది; అందమైన ఏపువ్వువైపుకో ఆకర్షింప బడటం దాని సహజగుణం. నీతి నియమాలు, సంఘంలోని కట్టుబాట్లు, పెద్దల ఆదేశాలు శరీరాన్ని కొంత వరకు కట్టివేయగలవేమో. కాని మనసుని శాసించి దానికి తగుశిక్షణ నిచ్చే నీతి సూత్రాలేవీ యింతవరకు పుట్ట లేదు. ఒకవేళ అలాటివేమైనా ఉన్నా, అవి సామాన్య మానవుడి అవగాహన శక్తికి అతీతమైనవి! ఎలిజా నిట్టూర్చింది.

'మనోరమ' బద్ధకంగా కదిలింది గోల్కొండవైపుకు. ముందు సీట్లో కూర్చున్న ఎలిజా తన కుడిపక్క సీట్లో కూర్చున్న హనీమూన్ దంపతుల మధ్య జరుగుతున్న సంభాషణని శ్రద్ధగా వినసాగింది.

బహుశా అంతకుముందే వాళ్ళ సంభాషణ ప్రారంభమైన ఉంటుంది.

"అసలు మనం ఇక్కడకు వచ్చిపది ఎందుకు? ఇద్దరంకలసి సుందర ప్రదేశాలని చూస్తూ వాటిలోని సౌందర్యాన్ని తిలకిస్తూ, ఒకరి ఆనందంలో




ఒకరు పంచుకుంటూ, ఈ మధుర క్షణాలను భావిజీవితంలో శాశ్వతం చేసుకోవాలనేకదా 'హానీమూన్' యొక్క ఉద్దేశ్యం? కాని మీకు ఇప్పుడే నా మీద వెగటు పుట్టేసింది! ఇకముందు..." దుఃఖంతో ఆమెకింక మాటలు పెగల్లేదు

"ఐతే నువ్వనేది ఏమిటి? ఇరవై నాలుగు గంటలూ నీ ముఖమే చూస్తూ కూర్చోవాలా? ఇంకో ఆడదాన్ని కన్నెత్తి చూడకూడదు! పన్నెత్తి మాట్లాడకూడదు! అదేనా నీ ఉద్దేశ్యం? తీవ్రంగా ఉందతని కంఠస్వరం.

"ఎవరినీ కన్నెత్తిచూడకూడదని కాదు నేనడిగేది. ఒక్కసారి మీ మనసును తరచిచూసుకోండి ప్రయాణమైన దగ్గరనుండి చూస్తున్నాను- నా ఉనికిని గూర్చిగాని, అసలు మనం ఇక్కడకు ఎందుకొచ్చేమని కాని ... ఏమన్నా ఉందా ఆలోచన-మీకు..."

"ఛ! ఏడుపుగొట్టు మొహమా! కాస్త పరాయిచోటుకు వెళ్ళినప్పుడైనా హాయిగా నవ్వటం చేతకాదు. నా ఖర్మకొద్దీ దొరికావు" చటుక్కున ఆమె పక్కనుండి లేచి వెనకసీట్లో విసురుగా కూర్చున్నాడు అతను.

గోల్కొండ శిథిలాలముందు ఆగింది 'మనోరమ'

ఆ శిథిలాల్లో ఇంకా మిగిలివున్న సౌందర్య చిహ్నాలను, కొన్ని సాంకే

తిక విచిత్రాలను నవాబుల గోరీలను అన్నిటినీ చూసేరు.

అశాశ్వతమైన జీవితాలకీ, క్షణిక మైన భోగాలకు, వైభవాలకు నిదర్శనంగా నిలిచిన ఆ శిథిలాలు ఆలోచన గల ప్రతి వ్యక్తినీ తాత్కాలికమైన వేదాంత భావనలోకి దింపుతయ్.

ఆ శిథిలాల్లో తిరుగుతున్నంతసేపూ ఎలిజా హృదయం శూన్యంగా ఉండి పోయింది

ఒకగంటలో అన్నీ చూసి మళ్ళీ బస్సులోకి వచ్చేరు అంతాను మధ్యాహ్నం మూడుగంటలయింది. అప్పటికి అంతా అలసిపోయేరు. బయల్దేరినప్పుడున్న ఉత్సాహం ఎవ్వరిలోనూ లేదు.

షేర్వాణీవాలా నిద్రమత్తుతో తూల్తున్నాడు

ఖద్దరులాల్చీ పెద్దమనిషి అప్పుడే గుర్రుపెడ్తూ నిద్రపోసాగేడు చల్లగాలికి అతని అనుచరుడుకూడా తమ నాయకుడి మార్గాన్నే అవలంబించ దలచుకున్నట్లు కనపడుతున్నాడు

రోమన్ క్రాపు నీరసంగా బయటకు చూస్తూ కూర్చున్నాడు.

కుటుంబయ్యగారు ఆయనభార్య నిర్లిప్తంగా ఉన్నారు పిల్లలు కొందరు తల్లి ఒడిలో కొందరు తండ్రి భుజంమీద కొందరు సీట్లమీదా కునికిపాట్లు పడుతున్నారు.

పాశ్చాత్యదంపతులకు ఓ పక్క కళ్ళమీద నిద్ర జోగుతూ వస్తున్నా, సభ్యతకోసం రివిగా కూర్చుని మధ్య మధ్యనే తమ ఆధీనంలో లేకుండా వచ్చిపడుతున్న ఆవలింతలను రుమాళ్ల వెనుక దాచేస్తూ అవస్థపడుతున్నారు. హనీమూన్ దంపతులు ముఖాలు ముటముటలాడిస్తూ కూర్చున్నారు

ఎలిజా మెదడు ఆలోచనా శూన్యంగా ఉంది

తరువాత అలవాటుప్రకారం 'మనోరమ' టాంక్‌బండ్ మీదుగా సికింద్రాబాదు వెళ్ళి అందులోని పెద్ద బజార్లన్నీ చూపింది ప్రయాణీకులకు కాని పూర్తిగా వాటిని చూసిన వాళ్ళెవరూలేరు. కొందరు అనాసక్తిగా, కొందరు బద్ధకంగా, కొందరు నిద్రమత్తులో చూసేరు

చివరికి సాయంత్రం ఐదుగంటల వేళకి తిరిగి ఇన్ఫర్మేషన్ ఆఫీసును చేరుకుంది మనోరమ.

ఎలిజా లోపలికివెళ్ళి అధికారుల కోసారి కనిపించి, ఆనాడు తనతో కలసి ప్రయాణంచేసిన వారందరికీ చిరునవ్వుతో వీడ్కోలు చెప్పింది. తరువాత రిక్షా మాట్లాడుకుని ఇంటి వైపుకు వెళ్ళింది.

రిక్షాలో కూర్చున్న ఎలిజాలో ఇప్పుడెలాంటి ఆలోచనలూ లేవు; ఆఖరికి ఉదయంనుండి ఆమెలో ఉంటూవస్తున్న తన సౌందర్యాన్ని గూర్చిన 'కాంషస్




నెస్'కూడా ఆమెలో లేదిప్పుడు. అందుకే ఆమె యీ సమయంలో ఉదయముకన్న అందహీనంగా, ఆకర్షణ రహితంగా ఉంది. ఆమె పెదవులకు, బుగ్గలకు రాసుకున్న రంగులు ఆమె అందాన్ని ద్విగుణీకృతం చెయ్యక పోగా పైగా అతికించినట్లు కనపడుతున్నయ్.

ఆమె కళ్ళలో మెరుపుతీగలకు మారుగానీలినీడలుకదలాడుతున్నయ్-యిప్పుడు.

ఇంటిముందు రిక్షాదిగి రిక్షావాడికి డబ్బు లిచ్చి లోపలికి నడచింది. ఆమె ఉంటున్న అద్దెయింటికి రెండే రెండుగదులు, ఒకవంటగది ఉన్నయ్. ముందుగది డ్రాయింగురూమ్‌గాను వెనకనే వంటగది నానుకుని ఉన్నగది బెడ్‌రూమ్‌గాను ఉపయోగపడుతున్నయ్

ఎలిజా డ్రాయింగు రూములోనుండి నడచింది. అక్కడనుండి బెడ్‌రూమ్‌కి దారితీసే ద్వారం ఒకటుంది. వంటయింట్లోకి పోవాలంటే బెడ్‌రూమ్‌లో నుండే వెళ్ళాలి.

గదిగుమ్మం దగ్గర ఆగిపోయింది ఎలిజా

ఓరగా వేసివున్న తలుపులను అనాలోచితంగా నెట్టింది కొద్దిగా. సగం తెరుచుకున్న తలుపులు తనకు చూపించిన దృశ్యాన్ని తిలకిస్తూనే స్థాణువులా నిల్చుండిపోయింది -ఎలిజా.

కాని ఆదృశ్యానికి కారకులైన

వ్యక్తులు ఆమె రాకను గమనించే స్థితిలో లేరు.

బ్రాందీ వాసనలతో గుప్పుమంటూన్న ఆ గదిలో మంచంమీద మత్తుగా పడుకుని ఉంది ఒక సుందరి— యించుమించు నగ్నంగా, ఆమెనడుము చుట్టూ చేతులువేసి ఆమె పెదవుల లిప్ స్టిక్కుని రుచిచూస్తున్నాడు థామస్ - ఎలిజా భర్త!

"డార్లింగ్! నువ్వెంత అందంగా ఉన్నావు!" థామస్ అంటున్నాడు.

"ఊఁ! మీ ఎలిజాకంటె అందంగా ఉన్నానా?" గాజులు పగిలినట్లు గలగలమంటూ నవ్వింది-మేరీ.

"నో స్వీట్! ఆ పాపిష్టి ఎలిజా మాట నా ముందెత్తకు. రాచిప్ప మొహమూ అదీని! నీ ముందు అ దెక్కడ?" అంటూ ఆమెను మరింత దగ్గరగా లాక్కున్నాడు థామస్.

"ఊఁ. అబ్బ! ఉండు డాలీ! ఏమిటా మోటుతనం!" అంటూ సన్నగా రాగాలు తీస్తూ తనబుజాలమీద నిరాధారంగా వేలాడుతున్న బ్రేసియర్‌ని లాగి అవతల పారేసింది మేరీ.

చటుక్కున తలతిప్పేసుకుంది ఎలిజా, గుమ్మాన్ని పట్టుకున్న ఆమె చేతివేళ్లు పట్టు తప్పినయ్. ఆమెకళ్ళు చూసే శక్తిని, చెవులు వినేశక్తిని కోల్పోతున్నయ్.

తూలుతూ పక్కకుజరిగి గోడకు చేరగిలబడి నిల్చుంది ఎలిజా. ఆమె కళ్ళలో క్రమ్ముకుంటున్న కన్నీరు పరిసరాలను అదృశ్యం చేసేస్తోంది. ఆ కన్నీరు ఆమె బుగ్గలమీదుగా జారి వాటిమీద ఉన్న అందమైన రంగును కరగించి ఆమె గుండెలోకి దిగి అందులో రగుల్తున్న జ్వాలలను చల్లార్చటానికి వ్యర్థప్రయత్నం చేస్తోంది.

ఏడుస్తూన్నందువల్ల విచ్చుకున్న ఆమె పెదవులమీది లిప్ స్టిక్కు పగుళ్లు బారి వికృతంగా తయారయింది.

కాని కరిగిపోతున్న తన సౌందర్య చిహ్నాలమీద ధ్యాసేలేదు ఎలిజాకి

ఆమె యిప్పుడు స్త్రీ.

సమస్త నారీ ప్రపంచంలోని ఆశలు, నిరాశలు, నిస్పృహా, నిస్సహాయతా, అసూయా, ఆరాటం తనగుండెలో దాచుకున్న స్త్రీ - ఎలిజా!

ఆ క్షణంలో తన జీవిత గమ్యమేమిటో, తన భవిష్యత్తేమిటో తనకే తెలియని అయోమయ స్థితిలో నిల్చుండిపోయింది ఎలిజా.





# రాధాయి పెళ్లి

'అన్నయ్య'

"నాకు పెళ్లిచేస్తావుటే అమ్మా!" అన్నాడు రాధాయి పరుగెత్తుకుంటూ వచ్చి. వాళ్ళమ్మ అప్పుడేకాఫీ డికాక్షను పెట్టి, పాలు కాస్తున్నది.

అయిదేళ్ళరాధాయికి హఠాత్తుగా పెళ్లిమీద మనసు పోయింది. వాడు పొరుగింటిలో జరుగుతున్న పెళ్లి హడావిడంతా చూశాడు. వీధి ఆవరణలో బంతాట ఆడుకుంటున్న వాడల్లా ఆట ఆపేసి, బంతి చేతపట్టుకొని, అమ్మ దగ్గర కొచ్చాడు.

"నాకు పెళ్లిచేస్తావుటే, అమ్మా!"

"తప్పకుండా చేస్తానురా నాన్నా! నీకు చెయ్యక ఇంకెవరికి చేస్తానూ?" అన్నది వాళ్ళమ్మ. పాలమీద పొంగు తగ్గించటానికి నీటిచుక్క జల్లుతూ.

వాడి ప్రశ్నకి ఆవిడకు పట్టరానంత నవ్వుకూడా వచ్చింది.

"మరేం, నాకు వాళ్ళ సూరీడు నిచ్చిచేస్తే వొప్పుకోను-ఏమనుకుంటున్నావో - తెలిసిందా?" అన్నాడు రాధాయి. అక్కడే బంతి ఎగరవేస్తూ,

"మా సూరి, మీ రాధాయికోసమే పుట్టింది వదినగారూ!" అంటూ, పక్కింటి 'అత్తయ్య' వాళ్ళమ్మతో ఏదో మాటల సందర్భంలో అనడం.

రాధాయి కెప్పుడూ జ్ఞాపకముంటూనే ఉంటుంది!

"ఏంరా? నీ అందానికి సూరీడు సరిపోలేదుట్రా బాబూ?" అంటూ నవ్వింది వాళ్ళమ్మ.

"ఇప్పుడట్లాగే అంటారులెండి. మీ అమ్మాయికాస్తా పెద్దదై చదువుల సరస్వతయ్యేసరికి, అప్పటి మీ కోరికల ప్రకారం మావాడు ఏ డాక్టరో, ఇంజనీరో కావొద్దూ?" అని వాళ్ళమ్మ జవాబివ్వటం కూడా రాధాయి ఇంత త్వరలో మరిచిపోలేదు.

"మీ వాడు పెద్ద కలక్టరే అవుతాడు లెండి." అన్నది పక్కింటి 'అత్తయ్య'. కలక్టరేమిటి కలక్టరు! మామయ్యట్టి కెట్టుకలక్టరు! ఛీ! అవుతే డాక్టరే కావాలి ఇంచక్కా! లేకుంటే నాన్నారిలా పెద్దఇంజనీరుకావాల్సిందే!

"సూరీడొద్దూ, గీరీడొద్దూ-చింపిరి తలా, చీమిడిముక్కూ అదీనీ-అదంటే నాకు అసయ్యం" అన్నాడు రాధాయి ముక్కు తుడుచుకుంటూ.

"సరే, పెళ్లి చేస్తానుగాని, ఆ బంతి అవతలపడేసి కాఫీ తాగటానికి నాన్నారిని పిలుచుకురా," అన్నది వాళ్ళమ్మ.

"అలాక్కాదు నా కిప్పుడే చెప్పాలి మరి," అన్నాడు రాధాయి. బంతి ఎగురవేస్తూ.

"ఏమిటి చెప్పేది?"

"నా కెప్పుడు చేస్తావు?"

"ఏమిటి చేయటం?"

"పెళ్ళే! పెళ్లి!"

"నువు బాగా చదువుకొని, పెద్ద పెద్ద పరీక్షలు పాసయితే, ఎంతో మంది వస్తారు నీకు పిల్ల నిస్తామంటూ - తెలిసిందా? అప్పుడు. నీకు నచ్చిన మంచిపిల్లను చూసి-"

రాధాయి సగంలో అడ్డొచ్చాడు.

"ఊఁ - అల్లాకాదు - నాకు రేపే చేసెయ్యాలి పెళ్ళి-" అన్నాడు రాధాయి గునుస్తూ.

రాధాయి వాళ్ళమ్మ కాఫీకలిపి చల్లారపోస్తున్నది. వాడి అర్థం కాని గునుపు ఆవిడకు చిరాకెత్తించింది.

"నాన్నారిని పిలవరా అంటే?" అన్నది.

"పిలుస్తానుగాని, మరి నాకు రేపే చేసెయ్యాలి పెళ్ళి!" అంటూ. గునుపు సాగతీశాడు రాధాయి. బంతి గట్టిగా నేలకేసికొట్టి ఎగురవేస్తూ.

బంతి ఒక్కసారి ఎగిరి దభీమని కాఫీగిన్నెలో పడింది.

కాఫీ, వాళ్ళమ్మ ముఖం మీద తుళ్ళిపడింది, గిన్నెడు కాఫీ వొలికింది.

కోపం పట్టలేక రాధాయి వీపు మీద వాళ్ళమ్మ ఒకటి చరిచింది.

"అయిందా నీ పెళ్ళి నా పెళ్ళినీ? ఫో, అవతలకి!" అన్నది వాళ్ళమ్మ

ఇప్పట్లో మళ్ళీ పెళ్లి ప్రస్తావన చేయకూడ దనుకున్నాడు-రాధాయి.




మండు వేసవి మధ్యాన్నం ఒంటిగంటవేళ - డాక్టరు అమృతరాయ్ రోగులను చూడటం పూర్తి అయేవేళ, అతని డిస్పెన్సరీముందు కారొకటి ఆగింది. అందులోనుంచి రంగమహల్ నవాబు, ముష్తాక్ అహ్మద్ సాలార్‌జంగ్ బహాదుర్,

ఎనభై ఏళ్ళ పైబడిన వయసుగలవాడు దిగాడు. ఆయనవెంట బురఖాధరించిన ఒక యువతికూడా దిగింది.

ఈ వృద్ధ నవాబు డాక్టరుతండ్రికి ప్రాణస్నేహితుడు. అంతేగాక డాక్టరు విదేశాలకు వెళ్ళి చదవటానికి ధనసహాయంకూడా చేశాడు. అతిముఖ్యమైన విషయం ఒకటి, ఎవరూలేని సమయంలో, డాక్టరుతో మాట్లాడాలని నవాబుగారు కిందటి రోజే ఏర్పాటు చేసుకుని, ఇప్పుడు తన మనమరాలిని వెంటబెట్టుకుని వచ్చాడు.

డాక్టరుకు నవాబుపేరు బాగా తెలుసును, కాని పరిచయంలేదు. ఎందుచేతనంటే ఆయన దీర్ఘకాలంగా కరాచీలో ఉంటున్నాడు.

"మిమ్మల్ని చూడటం నా అదృష్టం! నా వల్ల తమకు ఏం కావాలో చెప్పండి," అన్నాడు డాక్టరు అమృతరాయ్.

"ఈ పిల్ల నా మనమరాలు; ఈమెకు తల్లిదండ్రులు లేరు. ఈమెతప్ప నాకు వారసులూ లేరు. ఈమెను గురించే వచ్చాను," అన్నాడు నవాబు.

"జబ్బేమిటి?" అని డాక్టరు అడిగాడు.

"అప్రతిష్ఠ!"

డాక్టరుకు అర్థం కాలేదు.

"డాక్టరుగా మీకీ జబ్బుగురించి తెలియకపోవచ్చు. కాని యువతులలో, అందులోనూ గొప్పింటివారిలో, ఇది సామాన్యమైన జబ్బే ... ఈమె గర్భవతి. వచ్చే నవంబరులో వజీరలీఖాన్‌ను పెళ్ళాడవలసి ఉన్నది; అన్నాడు వృద్ధుడు.

డాక్టరు కంగారుపడుతూ, "నన్ను చట్టవిరుద్ధమైన పని ఏదీ చెయ్యమనరుగద?" అన్నాడు.

"లేదు లేదు. మీరు మానవధర్మాన్ని నిర్వహిస్తే చాలు. అందుకు తగిన ప్రతిఫలంకూడా ముట్టజెబుతాను; ముందు ఒక విషయం చెప్పండి - మీకు వివాహమయిందా? పిల్లలున్నారా?"

"వివాహ మయింది, పిల్లలు లేరు."

"అలా అయితే ఈమెకు కలగబోయే బిడ్డను మీరు దత్తు చేసుకోండి; నేనా బిడ్డకు ఇరవై ఒక్క గ్రామాలు రాసి ఇస్తాను; కాని మీరుమాత్రం ఆ బిడ్డను మీ సొంతబిడ్డగానే వ్యవహరించాలి. మీ భార్యకు కలిగిన బిడ్డ అనే లోకానికిచాటాలి.

డాక్టరు మరింత కంగారుపడి, "అదెలా వీలవుతుంది?" అన్నాడు.

,, దానికి తగిన ఏర్పాటంతా నేను ఆలోచించే ఉంచాను. మీరు మీ భార్యతోసహా మాతో వెంటనే మసూరికి వచ్చెయ్యండి. బిడ్డపుట్టిన మూడు మాసాలదాకా మాతో



బాటు అక్కడే ఉండండి. అన్నాళ్ళూ మీకు నేను నెలకు అయిదువే లిస్తాను. మీ ఖర్చులన్నీ నేనే భరిస్తాను. మే నెల అయిపోతూంది. ఏ ఆగస్టులోనో అమ్మాయి ప్రసవిస్తుంది. అక్టోబరు ఆఖరులో మీరు బిడ్డతోసహా ఢిల్లీకి తిరిగివచ్చెయ్యండి," అన్నాడు - వృద్ధ నవాబు.

డాక్టరు కొంచెం ఆలోచించి, "నా భార్యతోకూడా సంప్రదించి, ఏ సంగతీ చెబుతాను." అన్నాడు.

"మీ భార్యతో నేనే మాట్లాడతాను," అన్నాడు వృద్ధుడు. ఆయన నెమ్మదిగా లేచి, కర్ర సహాయంతో బయటికివెళ్ళి, కారులో కూర్చున్నాడు.

డిస్పెన్సరీలో డాక్టరూ, శహజాదీ హుస్నబానూ మిగిలారు.

"దయచేసి డిస్పెన్సరీ తలుపులు మూయండి. నాది లజ్జాకరమైన వ్యాధిగద ! డాక్టరు సమక్షంలో ఘోషా అవసరంలేదు గాని, పై వాళ్ళు-"

ఆమె ఈమాట అనగానే డాక్టరు వెళ్ళి తలుపులు మూశాడు. అతను వెనక్కు తిరిగేసరికి అతని కళ్ళు జిగేలు మన్నాయి. హుస్నబాను బురఖా తీసేసి నిలబడి ఉన్నది. ఆమె అందం వర్ణనాతీతం. స్లేట్ కలర్ జార్జెట్ చీరెలో ఆమెశరీరం బంగారం రంగుతో మెరుస్తున్నది. ఆమెముఖం వజ్రంతో మలిచినట్టున్నది. ఏడ్చింది కాబోలు - ఆమె కళ్ళువాచి, ఉబ్బి ఉన్నాయి. ఆ కళ్ళలో అప్పుడు క్రోధం తాండవిస్తున్నది. ఆమెలో అపురూపమైన లావణ్యంతోబాటు, డాక్టరుకు తేజస్సూ, తీవ్రతా కూడా పొడగట్టాయి.

"మాన మర్యాదలు గురించి మిమ్మల్ని ఒకటి అడగాలి - నేను చేసినపని ఎలాటిదని మీ రనుకుంటున్నారు ?" అన్నదామె.

"మిమ్మల్ని ఎవరో నమ్మకద్రోహం చేసి ఉండాలి.''

"మాయమాటలకు మోసపోయేదాన్ని కాను నేను. కేంబ్రిడ్జి యూనివర్సిటీలో చదివి, ఈయేడే ఎమ్మే డిగ్రీ పుచ్చుకున్నాను సైకాలజీలో... నాకునచ్చిన భర్తను ఎన్నుకున్నాను. ఆయన ఒక ప్రొఫెసరు. గొప్ప నవాబుకాడు. అందుచేత అబ్బాకు నచ్చలేదు. కావలిస్తే ఆయనతన ఎస్టేటును వారికిచ్చి నవాబునుచెయ్యవచ్చు. అందులో సగం మీకైనా ఇస్తారటగాని, వారికివ్వరట ! నన్ను వజీరలీఖాన్‌కిచ్చి పెళ్ళి చెయ్యబోతున్నారే ! ఆయన ఖడ్గమృగంలాంటి మనిషి. ఇప్పటికే ఆయనకు ముగ్గురుభార్య లున్నారు. వయసు యాభైకి తగ్గదు."

"అయితే మీ రీ వివాహాని కెందుకు ఒప్పుకోవాలీ. మీరు మేజరేనే."

"నన్ను అడ్డేది చట్టంకాదు, బంధం. చిన్నతనంలో మాతండ్రి పోయాక అబ్బా నన్నెంతో ప్రేమగా పెంచారు. ఆయన తనమర్యాదలనూ, అభిమానాన్నీ వదులుకోలేరు. ఆయనకు వంశగౌరవం మించినది మరేదీ లేదు. అందుకే ఈ పెళ్ళి నిశ్చయించారు. నా జీవితం ధ్వంసమైనా నేను అబ్బాకు వ్యతిరేకంగా ఏమీ చెయ్యలేను."

"అది బాగానే ఉంది. కాని నవాబుగారైనా మీ ఇష్టాయిష్టాలను పాటించరా ?"

పాటించారు. నేను ప్రొఫెసర్ని ప్రేమించానని చెప్పాక - ఆయన, 'వంశమర్యాద పోతే పోతుంది నువ్వా ప్రొఫెసరునే పెళ్ళాడు.' అన్నారు. నేనే అందుకు సమ్మతించలేదు; నా సుఖంకంటె ఆయన మాటా, వంశగౌరవమూ నిలవటమే ముఖ్యమన్నాను."

డాక్టరు కొంచెం ఆలోచించి, "నవాబుగారు నామీద పెట్టిన ఈ భారాన్ని ఆ ప్రొఫెసరుగారిమీదనే పెట్టలేకపోయారా? విజానికి అదే సక్రమంగా ఉంటుందే!" అన్నాడు.

"అబ్బా అందుకు ఒప్పుకోరు. నా బిడ్డకు నాతోగాని, ప్రొఫెసరుగారితోగాని సంబంధం లేకుండా ఉండటమే మంచిదని నా ఉద్దేశంకూడా."

"పెద్దనవాబుగారి పట్టుదలకు ఎన్ని ప్రాణులు బలి అవుతున్నాయో!.,. మీ ఆదర్శాలు నాకు సమ్మతం కాకపోయినా, మీ మర్యాద కాపాడటానికి మీరు కోరినట్లు చేస్తాను," అన్నాడు డాక్టరు.

"మీ భార్య అంగీకరిస్తారా?"

"అది నవాబుగారు చూసుకుంటారు."

ధన్యవాదాలు! తలుపుతెరిచి అబ్బాను పిలవండి," అంటూ హుస్నబాను బురఖా వేసుకున్నది.

లోపలికి వచ్చిన వృద్ధుడితో, డాక్టరు "మీరు కోరినట్టే చేస్తాను. నా భార్యను ఒప్పించే భారం మీది; నేనీపని చేసినందుకు నాకు ప్రతిఫలమేమీ అవసరంలేదు," అన్నాడు.

"అదంతా నాకు వదలండి. మీ భార్యతో మాట్లాడటానికి రేపుఉదయం వస్తాను," అన్నాడు వృద్ధుడు.

* * * *

డాక్టరు అమృతరాయ్ భార్య అరుణ నవాబుకోరిన ఏర్పాటుకు తేలికగానే ఒప్పుకున్నది, ఆమెకుసంతా నవాంఛ ఇంకా తీరలేదు. అదీగాక ఈ ఏర్పాటువల్ల చాలా డబ్బుకూడా లభిస్తున్నది.

డాక్టరూ, ఆతని భార్యా మసూరి వెళ్ళిపోయారు. అక్కడ హుస్నబాను కుమారుణ్ణి కన్నది. కొంతకాలం గడిచాక డాక్టరుభార్య ఆపిల్లవాణ్ణి తీసుకుని ఢిల్లీకి తిరిగివచ్చింది. డాక్టరు హిందూ సంప్రదాయం ప్రకారం పిల్లవాడికి జాతకర్మ వగైరాలు జరిపి, 'దిలీప్‌కుమార్' అని పేరుపెట్టి, అట్టహాసంగా ఉత్సవం చేశాడు. తరవాత కొన్నాళ్ళయాక పెద్దనవాబు ఢిల్లీవచ్చి, ఒకపెద్ద విందు ఏర్పాటుచేసి. డాక్టరునూ, భార్యనూ, బిడ్డనూ దానికిపిలిచి. డాక్టరు తన కుమారుడిలాటివాడేననీ, అతని తండ్రి గోపాల్‌రాయ్ తనకు ఆప్త మిత్రుడనీ అందరి ఎదటా చెప్పి, వారంతా చూస్తూండగా తన ఆస్తిలోసగం హుస్నబానుకూ, మిగతా

సగం చంటివాడికీ రాసి ఇచ్చేశాడు. చంటిబిడ్డకు రాసియిచ్చిన పత్రాన్ని హుస్నా బాను చేతులమీదుగానే ఇప్పించాడు.

హుస్నాబాను పొందిన హృదయవేదన అపారం. కాని దాన్ని ఎవరూ గమనించ లేదు. అందరూ నవాబుగారి స్నేహశీలతను కీర్తించారు. తరవాత ఆర్భాటంగా విందు జరిగింది.

అంతా సవ్యంగా సాగిపోతుండగా డాక్టరు హృదయంలో చిచ్చు రగులు కున్నది. అతను హుస్నాబానును ప్రేమించి, ఆ ప్రేమతో దహించుకుపోసాగాడు. అతను స్వతః బుద్ధిమంతుడు. భార్యపట్ల ప్రేమానురాగాలు గలవాడు; కాని ఇటీవల జరిగిన అసాధారణ సంఘటనల మధ్య హుస్నాబానుఅపురూప సౌందర్యమూ, అసాధారణమైన ఆమె చిత్తప్రవృత్తీ అతన్ని బలంగా ఆకర్షించి, వివశితుణ్ణి చేశాయి.

ఈ మనోవ్యథను అతను అణిచిపెట్టడానికి ప్రయత్నించినకొద్దీ అది మరింత పెచ్చరిల్లింది. అతనికి నిట్టూర్పులు జాస్తి అయాయి; చిరునవ్వు దూరమయింది; మనసు మనసులోలేదు. మనిషి డీలా అయిపోయాడు. ఇవి దాగేలక్షణాలుకావు. అతనిభార్య కొంతకాలంపాటు అస్వస్థత కాబోలుననుకున్నది. కాని హుస్నాబాను నిజం కనిపెట్టేసింది.

ఒకనాడు తామిద్దరూ కలిసి మాట్లాడుకున్నప్పుడామె అతన్ని "అన్నగారూ" అని సంబోధించి, తగినవిధంగా హితబోధ చేసింది.

"నేనూ నిన్ను ప్రేమిస్తున్నాను. ఆసంగతి తెలిస్తే నువ్వింతగా నీరసపడిపోయి ఉండవు. నేను ప్రేమను ఖాతరుచెయ్యను, కర్తవ్యాన్నిమాత్రమే లక్ష్యపెడతాను. మీలో జరిగేదంతా నాకు తెలుస్తూనే ఉన్నది. నేనేం అమాయకురాలిని కాను; కాని హద్దుమీరావో, నీజీవితం నాశనమవుతుంది. నువు నాశనమైపోయావో, నిన్ను అల్లాడికింద జమకట్టి, కొంచెం జాలిపడతాను, కాని నిండుగా ఉన్నంతకాలమూ నిన్నుచూసి ఆరాధిస్తాను... వియోగమే ప్రేమయొక్క అసలురూపమని నాకిప్పు డిప్పుడే అర్థమవుతున్నది. ప్రేమ అనేది ఒకశిల. మీ హిందువులు శిలావిగ్రహా లను భక్తితో పూజిస్తారు. ఆభక్తి నిష్ప్రయోజనమే, అయినా అది శాశ్వతంగానూ, పవిత్రంగానూ నిలిచిఉంటుంది... ఈబాధను మనం మౌనంగా సహించుదాం," అన్నదామె.

అతను 'సరే' నన్నాడు; వంగి ఆమెపాదాలు తాకాడు.

హుస్నాబాను కంటనీరు కార్చుతూ, "ఏమిటిది ?" అన్నది.




"అక్కపాదాలకు నమస్కరించటం హిందువుల ఆచారం."

"డాక్టర్! కాని నేను చిన్నదాన్ని!"

"వయసులోతప్ప అన్నింటా పెద్దదానివే!...

తనభర్త మనస్థితి అరుణకూ్కడా అర్థమయింది. ఆమె పైకి ఏమీఅనక, లో లోపల కుమిలిపోసాగింది. తనదగ్గిర పెరుగుతున్న కుర్రవాడిపట్లకూడా ఆమెకు విముఖతకలిగింది. అరుణ మనస్థితినికూడా హుస్నబాను పసికట్టింది, కాని ఆమెతో ఏమీ మాట్లాడలేదు.

అయితే, హుస్నబానుతో మాట్లాడి మనసుకు దార్ఢ్యం తెచ్చుకున్న డాక్టరు అమృతరాయ్ తనభార్య ఆరాటాన్ని ఉపశమింప జేయగలిగాడు. అతను తన మనోదౌర్బల్యాన్ని భార్యదగ్గిర ఒప్పుకుని. ఇక తనకు హుస్నబాను చెల్లెలేనని, తనకూ అరుణకూ మధ్య అడ్డుగోడలేవీ లేవనీ చెప్పేశాడు. అరుణ సమాధాన పడింది.

హుస్నబాను కూడా డాక్టరుపైన తీవ్రమైన వ్యామోహానికి గురిఅయింది. వారిద్దరిమధ్య ఉండే ఆకర్షణ ముగిసిపోయేదికాదు ఈసంగతి అరుణకు తెలుసు, కాని హుస్నబాను ప్రవర్తనలో ఎలాంటి పొరపాటూలేదు. ఆమె ఆత్మనిగ్రహం సమగ్రమైనది. డాక్టరుతో ఆమె చాలా మితంగా, అవసరమైనవరకే, అదికూడా కొద్ది పరిచయమే ఉన్నట్టుగా, మాట్లాడేది. డాక్టరుకూడా అలాగే ఉంటూవచ్చాడు.

బానుప్రేమకు మొదటి పాత్రుడైన ప్రొఫెసర్ హబీబ్‌ను పెద్ద నవాబు దేశం

నుంచే ఏకంగా సాగనంపి, అయిదేళ్ళపాటు అతను విదేశాలలో ఉండేటట్టు ఏర్పాటు చేశారు.

అనుకున్న ప్రకారంగానే హుస్నబానుకూ, నవాబ్ వజీరలీఖానుకూ వివాహం జరిగింది. అట్టహాసంగా జరిగిన ఆ పెళ్ళికి ఢిల్లీయావత్తూ రంగ్‌మహల్ దగ్గర హాజరయింది. అంతులేని విందులూ, వినోదాలూ, పాటలూ, ఆటలూ, హాస్యాలూ జరిగాయి. వృద్ధనవాబు తన ఆస్తిలో మిగిలిన సగం మనమరాలికి రాసి ఇచ్చారు. ఇక ఆయనకు మిగిలినది రంగ్‌మహల్ మాత్రమే.

పెళ్ళికి డాక్టరూ, అరుణాకూడా వచ్చారు. హుస్నబాను, రేపు అత్తవారింటికి వెళ్ళిపోతుందనగా, "ఇవాళ నేను మీ ఇంటికి విందుకువస్తున్నాను." అని అరుణకు చీటీ పంపింది.

అరుణా, బానూ ఒకే పళ్ళెంనుంచే తిన్నారు. ఒకరి నోటికొకరు ముద్దలు అందించుకున్నారు.

ఎవరూ చూడకుండా కట్టుదిట్టంచేసి అరుణ బానును పసిపిల్లవాడివద్దకు పంపింది. బాను తన కుమారుణ్ణి ముద్దుచేస్తూ చేస్తూ, ఉద్రేకంతో స్పృహతప్పింది.

అరుణ ఆమెకు శైత్యోపచారాలు చేసింది.

* * * *

నవాబ్ వజీరలీఖాన్ చిత్రమైన మనిషి. వయసు యాభైఅయిదు. గడ్డం ఎల్లప్పుడూ నున్నగాగీకి ఉంటుంది. ఆరడుగుల రెండంగుళాల ఎత్తు మనిషి. బంగారు పూతవేసిన కట్టుడుపళ్ళు — పారిస్‌లో తయారయినవి, జుట్టుకు రంగు వేస్తాడు. చాలా పొడుగ్గా ఉండే షేర్వాణీ, వదులుగాఉండే పైజమా, ఖరీదైన చెప్పులూ, నెత్తిన టోపీ ధరిస్తాడు.

నవాబుగారు డ్రయివర్ను పక్కనేకూర్చోబెట్టుకుని, గంటకు అయిదు మైళ్ళ వేగాన కారును స్వయంగా నడుపుతాడు. "ఎటువోవాలి ?" అని యజమాని అడిగితే డ్రయివరు చెబుతూంటాడు. ఆకారు కొన్ననాటికి రైళ్ళులేవు, కారులోసీట్లు చాలా ఎత్తుగావుంటాయి. కారులో పది పన్నెండుమంది అవలీలగా పట్టుతారు.

ఇదివరకల్లా నవాబుగారికి మూడే జనానాలు. ఇప్పుడు హుస్న్‌బాను కోసం నాలుగోది ఏర్పాటయింది. పెద్దభార్య ముసలిది. జబ్బుమనిషి. నవాబు అప్పుడప్పుడూ వెళ్ళి, అరగంటో, గంటో కూచుని, కుశలప్రశ్నలు చేసి వచ్చేవాడు. రెండోభార్య జీనతున్నీసాబేగమ్ గొప్పింటిబిడ్డ. తండ్రికి ఏకసంతానం కావటంచేత, ఆయనకుగల లక్షలుచేసే ఆస్తీ, ఇళ్లూ, డబ్బూ ఈమెకేవచ్చాయి. ఆమె తన

తండ్రి కట్టించిన ఇంటనే, తనతల్లితోబాటు ఉంటున్నది. వయసు ముప్పై అయిదు: వచ్చగా, బక్కపల్చగా ఉంటుంది, కరుకైనమాట, తీవ్రస్వభావం.

నవాబు ఆమెకు విడాకులిచ్చాడు. అతను తనకు హామీఇచ్చిన రెండు లక్షలకూ బేగమ్ డిక్రీ కూడా పొందింది. డబ్బుఅవసరం వస్తేనే నవాబు ఆమెవద్దకు వెళ్ళేవాడు: తగాదా, బతిమాలటాలూ, అలకలూ అన్నీ అయాక నవాబు తనపనిపూర్తి చేసుకుని వెళ్ళిపోయేవాడు.

మూడోభార్య సాధారణ వేశ్య: వయసులో చిన్నదీ, చాలాచక్కనిదీనూ. ఆమె స్వభావ చేష్టలు ఉదాత్తమైనవికావు. నవాబురోజూ ఆమెఇంటికివెళ్ళేవాడు. అక్కడే తినడూ, తాగుడూ, ఆటా, పాటా, అన్నీ అయాక రాత్రి ఏ రెండు గంటలప్పుడో తనఇంటికి తిరిగి వచ్చేవాడు.

నవాబు తన పడకగదికి ఎప్పుడూ తాళం వేసుకుని, బయట ఇద్దరు విచ్చుకత్తుల వాళ్ళను కాపలా ఉంచుకుంటాడు. ఆయనకు కొన్ని సరదాలూ, భ్రమలూ ఉన్నాయి. ఆయన హార్మోనియం వాయించుకుంటూ పాడేవాడు. తనవంటి గాయకుడీ దేశం మొత్తం మీద మరి లేడని భ్రమపడేవాడు. తనపాటను మెచ్చుతున్నవాళ్ళు ఏమడిగితే అది ఇచ్చేవాడు. ఆయనకు సినిమాస్టారు కావాలనే దురాశకూడా ఉండేది. ఏకంగా నిర్మాత కావాలనే అనుకున్నాడు, కాని అది కొనసాగలేదు.

అతను చాలా ఖర్చుమనిషి. జమీందారీ అంతా తాకట్టులో ఉంది. ఖజానా ఖాళీ అయింది. అందుచేత జీనత్‌మహల్‌కు వెళ్ళటమూ, చెయ్యి చాచటమూ అతనికి తప్పటంలేదు. అతని ఖర్చుకు ముఖ్యకారణం అసంఖ్యాకులైన స్నేహితులు

నవాబుగారికి ఈ వయసులో హుస్నబానుతో జరిగిన వివాహానికికూడా రెండు లక్షలు ఖర్చయింది. ఆడంబరాలకూ, సీసాబుడ్లకూ లోటేమీలేదు.

ఈ పెళ్ళిఅయిన కొద్దిరోజులకు నవాబు కారును తాపీగా నడుపుకుంటూ చీఫ్ జస్టిస్‌గా రింటికి వెళ్ళి, "విషంతాగి మీ యింటిముందు చచ్చిపోదామని వచ్చాను." అన్నాడు.

జడ్జిగారు నవ్వి, "ఏం జరిగింది?" అన్నాడు అతిధి మర్యాదలుచేసి.

ఆ రాస్కెల్ జీనత్‌కు రెండులక్షలకు డిక్రీఇస్తూ, నా ఆస్తి వేలంవేసి వసూలు చేసుకునే హక్కుకూడా ఇచ్చారు. ఇంకేం జరగాలి?"

"చట్టంప్రకారం న్యాయం చెప్పక ఎలా తప్పుతుంది, నవాబుగారూ? ఆమెకు మీరే హామీపత్రం రాసిఇస్తిరి!"

"అది హాయిగానే ఉంటుంది. నేనే సర్వనాశన మవుతాను."

"ఎందుకొచ్చిన పేచీ? బేగంగారితో ఏదోవిధంగా రాజీపడండి," అన్నాడు జడ్జి.

"అదేదో మీరే చెయ్యండి. నా వెంట రండి," అన్నాడు నవాబు.

జడ్జిగారిని ఒప్పించి, తన కారులో ఎక్కించుకుని, డ్రైవరు హెచ్చరికలతో కారును వింపాదిగా నడుపుకుంటూ నవాబుగారు జీనత్‌మహల్ చేరాడు. అక్కడ బందోబస్తు జాస్తి. కత్తుల పహరావాళ్ళు. లోపల తాళాలు. వెలపల తాళాలు. చాలా నడవలూ, గదులూ దాటి నవాబూ, జడ్జీగారూ ఒకగదిలోకి వెళ్ళి కూర్చున్నారు. ఫలహారాలు దట్టంగా అందాయి. టీ కూడా వచ్చింది. కాని బేగమ్ జాడ లేదు. ఆమె పక్కగదిలో చాటుగా ఉన్నది.

జడ్జి ఆమెకు అభివాదనం చేసి, తాను వచ్చినపని తెలిపాడు.

"ఈ వయసులో నవాబుగారిని లోకంమీద ఒంటరిగా వదలటం అంత మంచిది కాదేమో, రాజీపడటం మంచిది. పాతసంబంధాన్ని తిరిగి ఏర్పాటు చేసుకుంటే ఉభయ వంశాలగౌరవమూ దక్కుతుంది," అన్నాడాయన.

బేగం ఘాటుగానే సమాధానం చెప్పింది. అంతా తలాఒకమాటా అన్నారు.
"లక్షచెప్పినా, నాకు రావలిసిన రెండులక్షలూ నేను వదులుకోను," అన్నది బేగమ్.

"డబ్బేనా? నవాబుగారి ధన మాన ప్రాణాలే మీవి!" అన్నాడు జడ్జి.

"నేనుకాదు- ఆ వేశ్య!" అన్నది బేగమ్.

"నీ క్కావలిసింది ఆ రెండులక్షలేగదా; అది నీకూవద్దు; నాకూవద్దు; సినిమా తీసి, పదిలక్షలు గడిద్దాం. సినిమాల్లో నాతో పాడేవాడు లేడు; బొంబాయివెళితే పాడమని సినిమావాళ్ళంతా నన్ను చంపుకుతింటారు; ఇక నటనా? ఓ నవాబు పాత్ర ధరించానంటే నేను ప్రాక్టీసుకూడా చెయ్యనక్కర్లేదు; జన్మతః నేను నవాబునే అయితిని! డైరెక్షన్ సంగతి అడగొద్దు. బొంబాయి కుర్రడైరెక్టర్లు దంగై పోవలిసిందే!"

"అదొకటే తక్కువ - ఇంత పుటకపుట్టి పాడటమూ. డాన్సులు చెయ్యటమూనూ!" అన్నది బేగం.

"అమ్మమ్మా! ఇది ఆర్టు! ఆర్టుకున్న గౌరవం మరిదేనికీలేదు. పై దేశాల్లో గొప్పగొప్ప ప్రభువులు సినిమాసార్లు!"

"ఫిల్మ్ కంపెనీకి రెండులక్షలు చాలవు. ఏ పది, పదిహేనులక్షలో కావాలి. ఆ డబ్బు నేనే పెట్టుబడి చెయ్యగలను - కాని నాకు వీరిమీద నమ్మకం ఏమాత్రమూ లేదు, జడ్జిగారు బాధ్యత వహించాలి," అన్నది బేగమ్.

నవాబుగారు అలిగి, "అయితే పాటకూడా జడ్జీగారే పాడితేసరి!" అన్నాడు.

జడ్జీ నవ్వి, "ఇవన్నీ నాకెలా కుదురుతాయి? నేనింకా పదేళ్ళు సర్వీసు చెయ్య వలసినవాణ్ణి!" అన్నాడు.

ఏమీ తేలలేదు. జడ్జిగారు అత్తరు, తాంబూలాలతో సెలవు పుచ్చుకున్నారు. నవాబు ఆయనను తనకారులో దిగబెట్టి, అక్కడే మధ్యాహ్నభోజనానికుండిపోయి, భోజనానంతరం ఒంటరిగా విశ్రాంతి తీసుకుని కునికిపాట్లుపడ్డాడు; జడ్జిగారినౌకరు అతని దగ్గిరగా సిగరెట్టుటిన్ను పెట్టి వెళ్ళాడు.

నవాబు మధ్యలో కళ్ళుతెరిచి, నౌకరునుపిలిచి, వాడిచేతిలో పదిరూపాయల కాగితంపెట్టి, "బయట నా కారును పిల్లలు పాడుచెయ్యకుండా చూస్తూండు," అన్నాడు. ఇంకోసారి ఇంకో నౌకరును పిలిచి, పదిరూపాయల నోటిచ్చి, "సిగరెట్టు డబ్బా ఒకటి పట్రా!" అన్నాడు. వాడు నోటు జేబులో పెట్టుకుని, నవాబు పక్కనే ఉన్న టిన్ను చూపించి, వెళ్ళిపోయాడు.

సాయంకాలందాకా అక్కడేఉండి, నవాబు జడ్జిగారివద్ద సెలవు తీసుకుని, కొత్త భార్య అయిన హుస్నబాను దగ్గిరికి వెళ్ళాలని బుద్ధిపుట్టి, అక్కడికిచేరాడు. అతను కారులోనేఉండి, "మేం వచ్చామని లోపల చెప్పండి," అని నౌకరుతో చెప్పాడు.

"అవసరంలేదు. తమరు ఎప్పుడువచ్చినా లోపలికి ప్రవేశపెట్టమని రాణిగారి హుకుం." అన్నారు నౌకర్లు.

అంతఃపుర ద్వారంవద్ద దాసీలుకూడా అదేమాట అని అతన్ని లోపలికి తీసుకుపోయారు.

నవాబు తన కొత్త భార్యను కలుసుకోవటం ఇదే మొదటిసారి. అతను గదిలోకి వచ్చేసరికి బాను లేత ఆకుపచ్చదుస్తులు ధరించి, గదిమధ్య ఒకకుర్చీని ఆనుకుని నిలబడి ఉన్నది. గదే మారిపోయింది. అందులో తళుక్కుమనే అలంకరణ లేవీ లేవు. గదిచాలా నిరాడంబరంగా ఉన్నది.

హుస్నబాను నవాబును చిరునవ్వుతో ఆహ్వానించింది. వంగి సలాం చేసింది.

"గదంతా బోసిగాఉంది! నీ ఒంటిన ఒక్కనగాలేదు, ఏమిటిది, బానూ?" అని నవాబు అడిగాడు.

"నాకిలా ఉండటమే ఇష్టం. భోజనం సిద్ధంగాఉంది. లేస్తారా?" అన్నదామె.

"భోజనానికేంతొందర? కారులో నా హార్మోనియం ఉంది, తెప్పించు."

"బాగా పాడతారని విన్నాను," అన్నది బాను, చిరునవ్వు నవ్వుతూ.

"ఏదో పాడతాను. ఇవాళ నా పాట విందువుగాని. తప్పక నీకు నచ్చుతుంది."

బాను దాసీని హార్మోనియం తేవటానికి పంపింది.

"నీ అందంగురించి నేనూ విన్నాను. చూసే అవకాశం ఇవాళ దొరికింది." అన్నాడు నవాబు

"మీరు ముందు దుస్తులు మార్చుకుని కూచోండి. కాఫీ తెప్పించనా?" అన్నదామె.

"తెప్పించు. సిగిరెట్టుకూడా తెప్పించు"

బాను అవతలికి వెళ్ళి తిరిగివచ్చి భర్తకు దగ్గిరగా కూర్చున్నది.

కాఫీ, సిగిరెట్లూ, హార్మోనియమూ వచ్చాయి నవాబు కాఫీతాగి హార్మోనియం మీద చెయ్యి వెయ్యగానే బాను అతన్ని వారిస్తూ, ఏవైనా కబుర్లు చెప్పమన్నది. ఆమె అతనితో _ అతని ఇతర భార్యలనుగురించి అడిగింది.

అతను జీనత్‌బేగమ్ గురించి, "మర్యాద తెలీదు. పొగరుబోతు. పెడకట్టె." అన్నాడు.

"పాండిత్యం గలదనీ, కవిత్వం చెబుతుందనీ, ఇంగ్లీషుకూడా వచ్చుననీ విన్నాను?" అన్నది బాను.

"ఏంచదివి ఏంలాభం?" మట్టిబుర్ర!" అన్నాడు నవాబు.

"ఒకసారి ఆమెను చూసి రావాలనుకుంటున్నాను. మీకుఅభ్యంతరం లేదుగద?"

"వెళ్ళు. కాని నీకు తృప్తి కలగదు," అంటూ నవాబు పాట లంకించుకున్నాడు. చెవులు బద్దలయే ఆ పాటను బాను సహించి విన్నది. తన భర్తతో తొలి సమాగమం ఇంత నీరసంగా ఉంటుందని ఆమె అనుకోలేదు. అతని పాటకు అంతేమీ లేనట్టు కనబడి, చివరకామె హార్మోనియంమీదినుంచి అతనిచెయ్యి లాగేసింది.

"ఇలా రాత్రంతా పాడగలను," అన్నాడు నవాబు.

"అద్భుతం! ఇక భోంచేయ్యండి."

"వడ్డించమను... నేను త్వరలోనే ఒకఫిల్మ్ ప్రొడ్యూస్ చేద్దామనుకుంటున్నాను. అందులో నేనే చాలా గొప్పగా నటిస్తాను. ఇప్పుడున్న నటుల్లో నవాబు పాత్రకు ఒకడూ తగడు. నేను అసలు నవాబునే గనక చలాగ్గా నటించగలను."

బాను నవ్వు ఆపుకోలేకుండా, "తప్పేమీలేదు. ఇప్పుడు సినిమాలకూ, సినిమా నటులకు ఎంతో గౌరవం!" అన్నది. ఈ మూర్ఖునితో జీవితమంతా గడపాలి!

ఆమె తన భర్తతోబాటే భోజనం చేసింది. తరవాత మళ్ళీ ఇద్దరూ బాతాఖానీ ప్రారంభించారు. నవాబు దుస్తులు విప్పలేదు సరేగదా, రాత్రి పన్నెండు కాగానే_ "వెళ్ళొస్తాను, బానూ," అని వెళ్ళిపోయాడు.



ఈ వింత ప్రవర్తనకు అర్థమేమిటో బాను ఊహించలేకపోయింది

మర్నాడే ఆమె జీనత్‌మహల్‌కు వెళ్ళింది మొదట జీనత్‌బేగమ్ కొంచెం బెట్టుగా ఉంది, కాని త్వరలోనే ఇద్దరికీ బాగా అతికింది.

"పెళ్ళికొడుకు నచ్చాడా?" అని జీనత్ అడిగింది.

"ఒకసారి చూశాక నచ్చకపోవటంకూడానా? ఆగుణగణాలు!" అన్నది బాను నవ్వుతూ.

"ఆయన పిచ్చి కనిపెట్టావన్నమాట!"

"చూస్తే జాలికూడా వేసింది"

"ఎంతసేపున్నారు?"

"పన్నెండుదాకా!— అక్కా అందులో రహస్యం ఏమిటి?"

"ఎందులో?"

"తెల్లవార్లూ ఉండలేదు ... దుస్తులు విప్పలేదు ... పరాయివారల్లే ఉండి వెళ్ళారు"

"అందులో ఉండే రహస్యం రేపైనా నీకు తెలియకపోతుందా? నరుకుకొన్నావు- చెడ్డదని తెలిసి పారేసుకోవుగదా!"

"అక్కకూడా మోసపోయిందా? మీరుకూడా దాన్ని పారెయ్యక, జాగ్రత్తగా ఉంచుకున్నారే?"

"బానూ, నీకింత తెలివి ఉంది, అందం ఉంది. ఇక్కడికెందుకొచ్చావు; ఇంత చదువు చదివి నీ యిష్టప్రకారం జరుపుకోలేక పోయావా?"

"ఎంత చదివినా ఆడదాన్ని, అదీగాక తాతయ్య ఉన్నారు..."

"ఈ సంపెంగపువ్వునుతెచ్చి ఒంటెతోకకు కట్టారా? నిన్నిక్కడ చూస్తుంటే నా గుండె తరుక్కుపోతున్నది, తల్లీ!"

"ఈర్ష్యా!"

"ఈర్ష్య పడేటంత అదృష్టంకూడానా నాకు?... నిజంచెబితే గుండె రాయిచేసుకుని వింటావా?"

"నా గుండె నా దగ్గిర లేదులే, అక్కా దాన్ని అక్కడే వదిలాను"

"అయితే నీలోనూ ఓ రహస్యం ఉందా? అదేమిటో చెప్పు."

"ఈ జన్మకు మీరుతప్ప నన్నాదుకునే దెవరు? నేను ఏమీ దాచను." బాను కళ్ళవెంట జలజలా నీళ్ళు కారాయి.

"నీ దురదృష్టంచూస్తే నాకు బాధగాఉంది," అన్నది జీనత్,

"నా దురదృష్టం మీకేం తెలుసు?"

"రత్నంలాటి పిల్లవు. నీకు ఇటువంటి భర్తకన్న వేరే దురదృష్టం ఏముంటుంది?"

"అంతే అయితే నేను అదృష్టవంతురాలినే!" అన్నది బాను.

"అయ్యో, పాపం. నీ రక్తంనిండా బాధలేనా ఏం?"

'బాధలుకాదు — సిగ్గు... అక్కా, ముందునువు చెప్పేదేదో చెప్పు."

"చెప్పటాని కేముందమ్మా? నాకు పెళ్ళిఅయి ఇరవై ఒక్కఏడు గడిచింది. ఆనాడు కన్యగా వచ్చాను ఇప్పటికింకా కన్యగానే ఉన్నాను."

బాను కళ్ళు పెద్దవిచేసి ఆశ్చర్యం ప్రకటించింది.

'అంటే... అంటే..."

"మొదట్లో నేనేమీ పట్టించుకోలేదు. తల్లిచాటు బిడ్డను; ఎప్పుడూ అమ్మను విడిచి ఉండలేదు. సరదాగా పెళ్ళి అయింది; సరదాగా భర్తవచ్చి కబుర్లు చెప్పి పోయేవాడు; కాని రాను రాను నాకు పరిస్థితి అర్థమై ఏడవనారంభించాను ఆఖరు కన్నీటిబొట్టున్నదాకా ఏడ్చాను. ఇప్పుడు నాకు ఏడుపంటే తగని అసహ్యం. మొగుడనే పదార్థం వట్టి రాయి... అయోగ్యపురుషుడు," అంటూ జీనత్ తల వంచుకున్నది.

"అంతేనా?" అన్నది బాను.



''అందుకే నవాబుగారు రాత్రులు భార్యలవద్ద ఉండరు. ఇంకో రహస్యం వారి శరీరంనిండా కుష్ఠుపొడలు. అందుకే వారు ఇతరులఎదట బట్టలు విప్పరు,' అన్నది జీనత్

హుస్న్‌బానుకు తల తిరుగుతున్నట్టయింది. ఆమె కాసిని మంచినీరు తాగి తేరుకుని, "నా పాపానికి తగినశిక్షే జరిగింది," అన్నది -ఆమె ఏడవసాగింది. జీనత్ ఆమెను తన గుండెలకు చేర్చుకుని, "ఇంత ఆనందం నేనెన్నడూ ఎరగను, ఇక నుంచీ నువు నా బిడ్డవు. మోడైన నా జీవితాన్ని చిగురించటానికి భగవంతుడే నిన్ను నా దగ్గిరికి పంపాడు," అన్నది.

"నా సంగతివింటే నీ మనసు మారుతుందేమో, అక్కా," అన్నది బాను

"నీ హృదయాన్ని ఎక్కడో వదిలివచ్చా నన్నావు. ఆ కథేనా?"

బాను జీనత్‌కు తన బిడ్డ గురించిన కథ అంతా చెప్పింది.

"నీ బిడ్డ ఇప్పు డెక్కడ?" అని అడిగింది జీనత్,

"ఆ మాట అడగకు అది రహస్యంగానే ఉండనీ - తప్పనిసరి అయితే నేనే చెబుతాను,'' అన్నది బాను

"భేష్! అదృష్టవంతురాలివి! సాహసివి! ఇకనుంచి మనిద్దరమూ ఒకటే' చూడూ, తాతగారు నీకిచ్చిన ఆస్తిమాట నవాబుగారికి తెలియనివ్వకు; నవాబుగారి చేతికందితే క్షణంలో హరించుకుపోతుంది," అన్నది జీనత్.

"నా కింక ఆ ఆస్తితో ఏంపని, అక్కా!" అన్నది బాను.

"పిచ్చిగా మాట్లాడకు. అక్క చెప్పినట్టు వినాలి!"

"వింటాను! అంటూ బాను జీనత్ చేతులు తీసుకుని కళ్ళకద్దుకుని, ముద్దుపెట్టు కున్నది జీనత్ ఆమెను గాఢంగా ఆలింగనంచేసుకున్నది.

* * * *

పదమూడేళ్లు దొర్లిపోయాయి. ఈ కాలంలో డాక్టరు అమృతరాయ్ ఇద్దరు కొడుకులనూ, ఒక కూతుర్నీ కన్నాడు. ఈ ముగ్గురికీ అన్న దిలీప్‌కుమార్. కాని అతని స్వరూపస్వభావాలు పూర్తిగా విలక్షణమైనవి పచ్చని శరీరచ్ఛాయా, బూడిద రంగు కళ్ళు గద్దముక్కు, వెడల్పయిన నుదురూ, రాగివర్ణం తలవెంట్రుకలూ, సన్నగా, ఎత్తుగా ఉండే శరీరమూ, ముక్కోపమూ, చురుకుదనమూ—దిలీప్ తన వ్యక్తిత్వాన్ని అనుక్షణమూ ప్రదర్శించేవాడు. డాక్టరుకుగాని, అరుణకుగాని అతని పట్ల సహజవాత్సల్యం తక్కువే; అతను ముస్లిమ్ సంతానమనీ, గొప్ప ఆస్తికి వారసుడనీ వారు మరిచిపోలేదు తనపట్ల తల్లిదండ్రులకున్న ఎడమే దిలీప్‌లో కూడా వారిపట్ల కొంచెంగా ఉండేది.

డాక్టరు సొంతకొడుకులు సుశీలకుమార్, శిశిరకుమార్; పిల్లపేరు కరుణ. శిశిరకుమార్ చురుకైనవాడు; తనది కూడా తీవ్రస్వభావమే అయినా దిలీప్ అలిగి నప్పుడు శిశిరకుమారే అలకతీర్చేవాడు. దిలీప్ అధికారం చలాయించినంతగా ప్రేమార్ద్రతలు ప్రదర్శించేవాడు కాడు.

డాక్టరు బాగా సంపాదిస్తూ, కాస్త దర్జాగానే బతుకుతున్నాడు—కారూ, గుర్రపుబండీ, నౌకర్లతో—దిలీప్ తాలూకు ఎస్టేటుమీది ఆదాయాన్ని డాక్టరు తాకలేదు. పెద్దనవాబు గారు దిలీప్ చదువుకు వేరే డబ్బు ఏర్పాటుచేశాడు. డాక్టరు దంపతులు దిలీప్‌పట్ల మరోవిధంగా ఉండటానికి కారణం, అతను పేరుకు తమ పిల్లల్లో ఒకడయినా, అతనికీ మిగిలిన పిల్లలకూమధ్య గొప్ప ఆస్తి అడ్డున్నది. అందులో మిగిలిన పిల్లలకు వాటా లేదు. అయితే ఈ గొడవలేవీ దిలీప్ ఎరగడు.

పెద్దనవాబు తిరిగి తన మనమణ్ణి చూడలేదు. అతన్ని గురించి ఒక్క ఉత్తరం ముక్కకూడా రాయలేదు. ఆయన కరాచీకి తిరిగిపోయి, అక్కడే చనిపోయాడు హుస్నబాను కూడా ఏనాడూ ఢిల్లీకి రాలేదు, తన బిడ్డను గురించి తెలుసుకోలేదు.

ఇంతలో ప్రపంచమే మారసాగింది. హిట్లరు, ముసోలినీ, స్టాలిన్‌లు ప్రపంచ రాజకీయాలను అధిష్ఠించారు. సామ్రాజ్యాలు మన్ను కరిచాయి. రక్తం ఏరులై పారింది. దేశాల, రాష్ట్రాలసరిహద్దులు మారాయి. ఈ మార్పుల ప్రభావం డాక్టరు

పిల్లలపైనా ప్రసరించింది. ఎమ్మే. ఎల్లెల్బీ చదివిన దిలీప్ రాష్ట్రీయ స్వయంసేవక సంఘంలో చేరాడు. మూఢవిశ్వాసి అయిన హిందువుగానూ, ముస్లిమ్ విద్వేషిగానూ తయారయాడు. సుశీల్‌కుమార్ కమ్యూనిస్టయాడు. అతను ఎమ్మే పూర్తి చేసి, అర్థశాస్త్రపు పీరుడై, కార్మికులకు నాయకత్వంవహించాడు. బియ్యే ఆఖరు సంవత్సరం చదువుతున్న శిశిరకుమార్ కాంగ్రెసువాది; ఖద్దఖద్దరు ధరిస్తాడు. మెడిసిన్‌చదువుతున్న కరుణ మానవతావాది, భేదభావాలకు అతీతంగా ఉండేది...

డాక్టరు బాగా డబ్బుగడించి ఆస్తిపరుడయాడు పేరు ప్రతిష్ఠలు తెచ్చుకున్నాడు. ప్రాక్టీసు దండిగా ఉంది. దిలీప్ ఏ గొప్ప లాయరుకిందనైనా పని చేస్తాడని డాక్టరు ఆశపడితే, అతను కాస్తా హిందూమహాసభ నాయకులలో ఒకడూ, స్వయంసేవకులకు జనరల్ సెక్రెటరీ అయికూర్చున్నాడు, మంచి వక్త; ఎప్పుడూ క్షణంతీరదు. "నాయకత్వం" అతని రక్తంలోనే ఉన్నది.

దిలీప్ ఇరవై ఆరేళ్ళవాడై ఉండగా అతని తల్లిదండ్రులు అతని పెళ్ళిగురించి ఆలోచించారు. ఆవేదనకూడా పడ్డారు. ముస్లిముకు హిందూ కన్యను ఎలా ఇచ్చి చెయ్యటం? వాళ్ళిద్దరికీ అలాటి పట్టింపుఉన్నది. పోనీ - అతను ముస్లిముఅన్నది బయటపెడదామా - అంటే మిగిలిన పిల్లలను సంఘం వెలివేస్తుంది, ముస్లిమును పెంచినందుకు తమకు తీరని అప్రతిష్ఠ చుట్టుకుంటుంది.

అదృష్టవశాత్తూ ఏచిక్కూలేని సంబంధం ఒకటి కనబడింది. డాక్టరుకు ఒక బారిష్టరు మిత్రుడున్నాడు. ఆయనకు ఇరవైరెండేళ్ళ వయసుగల అందమైన కుమార్తె ఉన్నది ఎమ్మే పాసయింది. బారిష్టరుగారికి రాస్తే ఆయన అభ్యంతరం చెప్పలేదు.

కాని దిలీప్ ఈ సంబంధాన్ని నిరాకరించాడు. "వాళ్ళు హిందూ మతాచారాలకు వెలి అయిన జాతిభ్రష్టులు," అన్నాడు.

డాక్టరు దిగ్భ్రాంతుడయాడు. తాను ఏకారణంచేత ఇది మంచిదనుకున్నాడో, ఆకారణంతోనే దిలీప్ ఈ సంబంధాన్ని కొట్టేశాడు. ఆయన బారిష్టరుగారికి మాట ఇచ్చాడు కూడా. ఈమాటతెలిసి దిలీప్ నొచ్చుకుని, "వారికి నా అభ్యంతరం తెలియజేయండి, ఆయన చాలా పెద్దమనిషి అర్థం చేసుకోగలరు," అన్నాడు.

తరువాత ఇద్దరూ కొంతసేపు వాదించుకున్నారు. ఈ కాలంలో గుడ్డి విశ్వాసాలకు తావులేదన్నాడు డాక్టరు. ఆదర్శాలున్నచోట పట్టుదల లేకపోతే ప్రయోజనం లేదనీ, మనదేశం దాస్యంనుంచి విముక్తి పొందాలంటే జాతీయత తప్ప వేరుమార్గం లేదనీ దిలీప్ వాదించాడు.

"ఒకసారి మీ అమ్మతోకూడా మాట్లాడు," అన్నాడు డాక్టరు. పూర్తిగా ముస్లిమ్‌రక్తం శరీరంలో ప్రవహించే దిలీప్ ఇంత దృఢంగా హిందూమత దీక్ష అవలంబించటం చూస్తే డాక్టరుకు నవ్వొచ్చింది.

దిలీప్ తల్లిని అంత తేలికగా ఓడించలేకపోయాడు.

"ఆ అమ్మాయి చాలా గుణవంతురాలు; విదేశీ దొరసానిలాటి పిల్ల." అన్నది అరుణ.

"విదేశీ దొరసానికి స్వదేశీసకలు... దేశం స్వతంత్ర మయేదాకా నేను పెళ్లాడను. పెళ్ళాడి బానిస సంతానాన్ని కసటందేనికి? అదీకాక నేను జైలుకుపోవచ్చు. ఉరి పడవచ్చు ఎప్పటికైనా పెళ్ళి చేసుకుంటే సీతా, సావిత్రిలవంటి వాళ్ళను చేసుకుంటాను. కోడలు నీకు రామాయణంచదివి వినిపించాలి. చీకటితోనే స్నానం చేసి, దేవుడి పూజచెయ్యాలి. గృహస్థ ధర్మాన్ని సాంగోపాంగంగా ఆచరించాలి," అన్నాడు దిలీప్.

"సాంగోపాంగ గృహస్థ ధర్మమంటే?"

"ధర్మ శాస్త్రాలలో చెప్పినట్టుగా పదహారు సంస్కారాలూ, పంచయజ్ఞాలూ, తీర్థాలూ, వ్రతాలూ, ఉపవాసాలూ, పుణ్యకథాశ్రవణం – వీటివల్లనే హిందూ ధర్మం, సజీవంగా ఉంటుంది."

అరుణ మండిపడి.

"నీప్రాచీన హిందూ ధర్మంలో ఆడదానిగతి చూడు. భర్తతో సహగమనం ఎనిమిదోఏట ముండమోసి మళ్ళీ పెళ్ళి కాకుండా ఉండటం! మగవాడు ఎన్ని పెళ్ళిళ్ళయినా చేసుకోవచ్చు! నీ పూర్వులు పెళ్లాలని వీధిలో అమ్మారు? జూదంలో పణంగాపెట్టారు! హరిశ్చంద్రుడి కథ, ధర్మరాజుకథా చదవలేదా? మనిషి కాస్త ఆలోచించాలి. యుగధర్మం తెలుసుకోవాలి. చదువుకున్నవాడివి, ఆ మాత్రం తెలుసుకోలేవా?" అన్నదామె.

దిలీప్ తనఒళ్ళోఉన్న తల్లిపాదాలు కళ్ళకద్దుకుని లేచిపోయాడు.

* * * *

బారిస్టరు రాధాకృష్ణరాయ్ కాన్పూరులో ప్రాక్టీసుచేస్తున్నాడు. ఆయన మంచి పలుకుబడి కలవాడు. ఇతని కుమార్తెనే డాక్టరు అమృతరాయ్ చేసుకుంటానంటూ మొదట ఉత్తరంరాసి, తరవాత తనకుమారుడు అంగీకరించలేదంటూ మరో ఉత్తరం రాశాడు.

ఈ రెండో ఉత్తరం చూశాక బారిస్టరుగారు ఒక నిశ్చయానికి వచ్చాడు. ఆయన




ామూర్తి మాయనుపిలిచి, "రేపు శనివారం మధ్యాహ్నం నుంచీ కోర్టు ఉండదు. రెండుగంటలబండికి ఢిల్లీపోదాం, సిద్ధంగాఉండు," అన్నాడు.

"ఢిల్లీలో పనేమిటి ?" అని మాయ అడిగింది.

"ఒకసారి డాక్టరుగారిని కలుసుకుందామని! _ ఆయన ఉత్తరం రాశారు." అంటూ ఆయన జేబులోనుంచి ఉత్తరంతీసి మాయచేతికిచ్చాడు.

మాయ ఉత్తరంచూసి, ముఖం చిట్లించి, "డాక్టరుగారిని అభినందించవలసిన పనే!" అన్నది.

"ఆడపిల్లను కన్నాక ఎంతమందినో అభినందించకుండా నిన్ను ఇంట్లోనుంచి పంపెయ్యగలనా, అమ్మా!"

"అయితే మీరువెళ్ళండి. నేనురాను."

"వచ్చి తమాషాచూడు, నువుచేసేదేమీ ఉండదులే," అంటూ బారిస్టరు నవ్వాడు. "డాక్టరు చాలా మంచివాడు. అతని ధోరణి ఏమిటో తెలుసుకోవాలని ఉంది. నువుకూడా దిలీప్‌తో మాట్లాడిచూడు. అతను చాలా 'ఆర్థడాక్స్'ట. ఏమంటాడో విందాం."

"అయితే అమ్మను తీసుకెళ్ళండి."

"జగడ మాడేందుకైనా నువ్వుంటే నయంగాని, అమ్మను తీసుకుపోయి ఏం లాభం ' దారిలో గుండెనొప్పివస్తే ఏంకాను ?"

"సరే ప్రయాణానికి అంతా సిద్ధంచేశాను. మళ్ళా ఎప్పుడు తిరిగివస్తాం?"

"ఆదివారం రాత్రికి."

బారిస్టరుగారు తానూ తనకుమార్తె బయలుదేరి వస్తున్నట్టు డాక్టరుకు ముందుగా టెలిగ్రాంకూడా పంపాడు.

మాయతల్లి కుముదేశ్వరీదేవి స్థూలకాయురాలు. కల్లా కపటమూ లేని మనిషి భర్తలాగా, కూతురులాగా కాక ఆమె హిందూ సంప్రదాయాలకు పూర్తిగా అంట పెట్టుకుని ఉన్నది. తీర్థాలూ, వ్రతాలూ, ఉపవాసాలూ, దానధర్మాలూ, పురా కాలక్షేపాలూ - సమస్తమూ పాటించేది. ప్రతిరోజూ పూజారివచ్చి తీర్థం ఇస్తే గాని భోజనంచేసేదికాదు. ఆమెకు మాయ ఒకతే సంతానం. అందుచేత భా భర్తలకు సమస్తమూ మాయే. అందుచేత వారికి మాయ వివాహసమస్య జా బాధిస్తున్నది.

తాను పాతకాలపు మనిషైనా కుముదేశ్వరీదేవి తనకుమార్తె స్వేచ్ఛను ఏనా వ్యతిరేకించలేదు. తండ్రి మాయతో ఢిల్లీ వెళుతున్నారంటే ఆమె ఎంతో స షించి, మాయతో, "పెళ్ళికాకముందు ఆడపిల్లలు అత్తారింటికి పోవటం అనవ కాదు. కాని అంతా మారిపోతున్నది. నువు కాస్త జాగ్రత్తగా మసులుకో. ది నేమూశాగా? మంచివాడు. ధర్మచింత గలవాడు. ఈ గడియారాన్ని నా సం అతనికిచ్చి, నాఆశీర్వాదాలు చెప్పు," అన్నది.

ఢిల్లీలో డాక్టరు బారిస్టరుగారి టెలిగ్రాం అందుకుని కంగారుపడ్డాడు. బారిస్టరు రాయ్ ముఖం ఎలా చూడటమో ఆయనకు తెలియలేదు.

కాని తీరా స్టేషనులో బారిస్టరుముఖం కనిపించాక డాక్టరు సంకోచాలన్నీ ఎగిరి పోయాయి. ఇద్దరూ కౌగలించుకున్నారు. మాయ డాక్టరుకు ప్రణామంచేసింది.

''మీ అబ్బాయిమీద ఏదో బలంగా పనిచేసినట్టున్నదే?" అన్నాడు బారిస్టరు.

"వాడి మొండిపట్టు మూలంగా నాకు తలవంపులయింది." అన్నాడు డాక్టరు.

"మధ్య మీ కెందుకు తలవంపులు? అతని పట్టు ఏమిటో తెలుసుకుందామనే నేనూ, మాయా వచ్చాం."

"అమ్మాయిని తీసుకురావటం మంచిపని అయింది." అంటూ డాక్టరు మాయ కేసి చూశాడు. ఆయనగుండె ఒక్కసారి గుబుక్కుమన్నది—ఈ బంగారు బొమ్మ లాటి పిల్లను, దిలీప్ జన్మరహస్యం దాచి, అతనికివ్వాలని తన యత్నం; తాను మోసం చేస్తున్నందుకు ఈ పెళ్ళి జరగకపోవచ్చునన్నది డాక్టరుకు కొంత ఊరట నిచ్చింది.

అందరూ ఇంటికి చేరుకున్నాక మాయను అరుణ తన దగ్గిరే కూర్చోబెట్టు కున్నది. కరుణ ఆనందం తో గంతులువేస్తూ, ''వదిన వచ్చింది!'' అంటూ దిలీప్ గదిలోకి వెళ్ళింది. దిలీప్ ఆమెను గదిలోనుంచి గెంటేశాడు. తరవాత ఆమె సుశీలదితో కూడా ఆ మాటే చెప్పింది.

డాక్టరు బారిస్టరుతో జరిగినదంతా చెప్పి, ''మాయలాటి కోడలు రావటం నాకూ, నా భార్యకూ ఎంతో సంతోషం. కాని దిలీప్ చేసుకోనంటుంటే ఎలా బలాత్కరించటం?" అన్నాడు.

బారిస్టరు రాయ్ దిలీప్‌తో స్వయంగా మాట్లాడాడు.

"నేను మాట్లాడేవిషయం నీకు తెలిసినదే నీ అభ్యంతరమేమిటో దాచకుండా చెప్పు," అన్నాడు బారిస్టరు.

"అది సిద్ధాంతసంబంధమైన విషయం. నేను హిందూమతవాదిని. హిందూధర్మ విరుద్ధమైన పనులేవీ నేను చేయలేను," అన్నాడు దిలీప్.

"మేమూ హిందువులమే! మతం, వంశం, కులం అంటే అభిమానం అందరికీ ఉండాలి,'' అన్నాడు బారిస్టరు.

"పాశ్చాత్య పద్ధతి, సభ్యతా అలవరుచుకున్న మనిషిని పెళ్ళాడటం నా కిష్టం లేదు.''

''పాశ్చాత్య సంస్కృతి పూర్తిగా చెడ్డదంటావా?"

''దాన్ని నేను పూర్తిగా ద్వేషిస్తాను. పాశ్చాత్యుల్ని అనుకరించే వారిని కూడా నేను ద్వేషిస్తాను."

"అలా ద్వేషించటం మంచిదికాదు, బాబూ! జీవితంలో మంచిచెడ్డలు సాంఘిక పరిస్థితిని బట్టి ఏర్పడతాయని చదువుకున్నవాడికి తెలిసినదే హిందూ సంస్కృతిలో కూడా అలాటి మంచిచెడ్డ లుంటాయి.''

"బాబూజీ, నాకు వాదించటం ఇష్టంలేదు."

"నువు కేవలమూ హిందూసంస్కృతిని అభిమానిస్తే వాదన అనవసరమే. కాని అకారణంగా నువు ఇతరులను– నిన్ను ప్రేమిస్తున్నవారిని సైతం– ద్వేషిస్తున్నప్పుడు వాదించక తప్పదు.''

"వాదంవల్ల ప్రయోజనం ఉండదు."

"ఎందుకుండదూ? నీకు వివేకం లేదా? విశాలదృష్టిలేదా? నీకు అభివృద్ధి అవసరంలేదా? పాశ్చాత్యసంస్కృతి అలవరుచుకున్నవారు తమ సంస్కృతిని గౌరవించవచ్చునే?"

"వాదించవని ముందే చెప్పాను."

"నువు వివాహమంటూ చేసుకుంటావు గదా ?"

"సీతా, సావిత్రిలాటి ఆదర్శస్త్రీని చేసుకుంటాను. పాశ్చాత్యసంస్కృతిలో పెరిగి, పాశ్చాత్య నాగరికతలో జీవించే మనిషితో నాకు పొత్తుకుదరదు. ఇద్దరికీ సుఖం ఉండదు."

"పాశ్చాత్యసంస్కృతిలో జీవించేవాళ్ళకు శీలమూ, గుణమూ, ప్రేమా, త్యాగ బుద్ధీ మొదలైన మానవలక్షణా లుండవనా ?"

"నా ఉద్దేశం అదే."

"పాశ్చాత్యసమాజంలో స్త్రీ లందరూ శూర్పణఖలూ, హిందూసమాజంలో వారంతా సీతలూ అంటావా ఏం ?" అన్నాడు బారిస్టరు. ఆయనకు కోపంవస్తున్నట్టు దిలీప్ కనిపెట్టాడు.

"నన్ను క్షమించండి. నా అభిప్రాయాలు మార్చుకోలేను," అన్నాడతను.

"వ్యక్తివిలువలు తోసిపారేయ్యలేం. మా మాయ పాశ్చాత్య వాతావరణంలో పెరిగినమాట నిజమేగాని, దాని గుణశీలాలుచూసి నేను గర్విస్తాను," అన్నాడు బారిసరురాయ్.

"ఇంకా ఇటివిషయాలు బోలెడుంటాయి."

"ఏమిటవి ?"

"సాంఘిక మర్యాద ప్రధానమైనది. నేను బంధుమిత్రులనూ, స్వజాతినీ వదులుకోలేను."

బారిస్టరుముఖం ఎర్రబడింది. "అదాసంగతి ?" అంటూ ఆయన గబగబా గదిలోనుంచి వెళ్ళిపోయాడు.

విదేశాలకు వెళ్ళినందుకు రాయ్‌గారిని బంధువులు వెలివేశారు. ఆసంగతి ఆయన ముఖానే అని, కోపం తెప్పించినందుకు దిలీప్ చాలా నొచ్చుకున్నాడు.

దిలీప్‌ది ఇంత సంకుచిత దృష్టిఅని రాయ్‌గారూ అనుకోలేదు. ఆయన తన కూతురితో ఈ సంభాషణ గురించి చెప్పాడు. దిలీప్‌కు చదువుండికూడా సభ్యత తెలియదని ఆమె అనుకున్నది, ఆమెకు జరిగిన అవమానం కూడా ఇందులో చాలా ఉన్నది. కరుణ తనను పదే పదే, "వదినా," అని పిలిచింది. మళ్ళీ పిలుస్తుందేమో కూడాను. ఎంత అవమానం ! అదేగాక అరుణాదేవికూడా తనను ఎత్తున కూర్చోబెట్టి, ఆదరించింది. తాను ఒక్కసారిగా కింద కూలిపోయింది. మాయకు అక్కడ ఒక్కక్షణంకూడా ఉండబుద్ధి కాలేదు, తండ్రికూడా ఎంతో అవమాన పడ్డట్టు ఆయనముఖం చూడగానే మాయకు తెలిసిపోయింది.



"మనం వెంటనే వెళ్ళిపోదాం, నాన్నగారూ !" అన్నదామె.

"అలిగి వెళ్ళితే డాక్టరుగా రేమనుకుంటారు ? తప్పుకాదూ ? చూద్దాం, మాట్లాడాలి." అన్నాడు బారిస్టరు.

ఆ అపరాహ్ణం దిలీప్ బయటికి వెళ్ళటానికి తయారవుతుండగా అతని గదిలోకి మాయవచ్చి, "మీరెటో బయలుదేరుతున్నట్టున్నారే ?" అన్నది.

ఆమెను చూస్తూనే దిలీప్ కొయ్యబారిపోయాడు. అతను అంత అందమైన ఆడదాన్ని అదివరకెన్నడూ చూడలేదు. అతనికి కటికచీకటినుంచి తీక్ష్ణమైన సూర్యకాంతిలోనికి వచ్చినట్టయింది. ఆమెను చూస్తూనే అతనిలో దృఢంగా

శిలలాగా ఉన్నదార్ఢ్యమూ, పౌరుషమూ, ధైర్యమూ ఒక్కసారిగా నీరుకారి పోయి నట్టయింది, అతను మాటలకు తడుముకుంటూ, "అవునండీ... లేదండీ... మీరు రావచ్చు." అన్నాడు.

మాయ కొంచెం ముందుకువచ్చి, "అమ్మ మీకివ్వమని ఈ గడియారం ఇచ్చింది," అంటూ గడియారాన్ని బల్లమీద ఉంచింది.

అతనినోట మాటలేదు. కంగారుగా ఆమెకేసి చూస్తూ ఉండిపోయాడు మాయ వెళ్ళిపోయింది.

"ఆగండి... ఒకమాట..." అన్నాడు దిలీప్;

"ఏమిటీ ?" అన్నది మాయ ఆగి.

"ఆగడియారాన్ని తీసుకుపొండి."

"మీకోసమనే అమ్మ పంపింది- మీకువద్దా ?"

"అమ్మగారితో చెప్పండి..."

"ఏమని ? ఇదిమీకు నచ్చలేదనా, ఇంకా ఖరీదైనది కావాలన్నారనీ చెప్పనా ?" మాయ వ్యంగ్యంగా నవ్వింది

"అబ్బే ! అదికాదు."

"మరేమని చెప్పను ?"

"నా నమస్కారాలు చెప్పండి- పాదాభివందనం చెయ్యండి."

మాయ నవ్వు ఆపుకుంటూ, "పాదాభివందనం మీరే ఎప్పుడైనావచ్చి చేద్దురు గాని. నమస్కారం చెప్పమన్నారని మటుకు చెబుతాను. శలవు !"

"మాట, మాట !" అని దిలీప్ మళ్ళీ పిలిచాడు.

"ఏమిటి మళ్ళీ ?"

"నాబదులు మీరే పాదాభివందనంచేసి, ఈ గడియారం వద్దన్నానని చెప్పండి."

"ఎందుకు వద్దన్నాడంటే ?"

"ఏదో ఒకటి చెప్పండి."

"అసలు కారణమేమిటీ ?"

"ఏమీలేదు."

"కారణం లేకపోతే నేను దీన్ని తీసుకుపోను."

"నన్నుమీరు అర్థం చేసుకోవటంలేదు."

"అంటే నేను మూర్ఖురాలి ననా ?"

"అదేం మాటండీ ?"

"అయితే, కారణం నాకర్థమయేటట్లు చెప్పవచ్చుగా ?"

"ఇది చాలా అనుచితం."

"అమ్మమీకు కానుక పంపితే మీరు స్వీకరించటానికి మీ హిందూ సంస్కృతి ఒప్పదా? . అమ్మ నాకీ అనుచితమైనపని చెప్పింది. చేశాను. మీరుదీన్ని ఉంచుకోండి- లేకపోతే మీరే స్వయంగావెళ్ళి ఆమె కివ్వండి; లేదా, మరేదన్నా చెయ్యండి. నేనుమాత్రం దీన్ని తీసుకుపోను." అని మాయ గదినుంచి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళగానే సూర్యుడు అస్తమించాడు. దిలీప్ ప్రాణాలు పైకెగిరాయి. ప్రపంచం మిథ్య అయిపోయింది. అంతటా శూన్యం ! అతను గడియారాన్ని తీసుకుని గుండెకు అదుముకున్నాడు. కళ్ళు చెమ్మగిల్లాయి. అతన్ని ప్రేమ బాగానే కాటువేసింది. గదిలో పచార్లుచేశాడు; మంచంమీద పడి పొర్లాడు. ఎన్నడూఎరగని దాహం ఒకటి అతన్ని మాడ్చిపారేస్తున్నది. అతని బుర్రంతటా మాయ విడిపోయి ప్రళయతాండవం చేస్తున్నది. అయినా ఆమె అందకుండా ఎక్కడికో వెళ్ళిపోయినట్టుకూడా ఉన్నది.

ఇప్పుడతనికి మాయను పెళ్ళాడటానికి ఎలాటి అభ్యంతరాలూలేవు. అరుణతో గాని, కరుణతోగాని, మాయతోనే గాని, ఆమె తండ్రితోనేగాని ఆమాట అనెయ్య వచ్చునని అతనికి తట్టలేదు. చీకటిపడి దీపాలుపెట్టాక, అతను యమునానదీ తీరానికివెళ్ళి, ఒంటరిగా కూర్చుని ఏడ్చాడు.

చిత్రమేమిటంటే- మాయకూడా అతనిలాటి స్థితిలోనే పడింది. నిజానికి ఆమె అతని గదికివెళ్ళింది అతన్ని అవమానించాలనే, ఏడిపించాలనే, గిల్లి కవ్వించా లనే, అతను హిందూ మతాభిమాని అయినంత మాత్రాన ఆమెకు అభ్యంతరంలేదు. ఆమెకు ద్వేషం మూఢ విశ్వాసాలంటేనే. కాని అతని ఆకారం తనను బలంగా ఆకర్షిస్తుందని ఆమె కలలోకూడా అనుకోలేదు. ఆమె అతనివద్దనుంచి వచ్చేశాక ప్రేమజనితమైన వేదనతో తీసుకోసాగింది.

సినిమాకురమ్మని పిలవటానికి కరుణవస్తే, మాయ కళ్ళు తుడుచుకుని, "నేనిప్పుడు రాలేను," అన్నది. ఆమెకళ్ళు వాచిఉండటం కరుణ గమనించింది కూడా. మాయస్థితిని డాక్టరూ, అరుణకూడా గమనించి, ఆమె బాధకు కారణం దిలీప్ అసభ్యవర్తనే అనుకున్నారు.

దిలీప్ మూలాన గాయపడిన మాయ మనస్సుకు ఊరటకలిగించి, ఆమెకు న్యాయంచెయ్యటం కోసం మాయను సుశీల్‌కు చేసుకుంటే అంతా సరిఅవుతుందనీ, అలాఅని బారిస్టరు రాయ్‌గారితో చెప్పమనీ అరుణ తనభర్తకు సూచనచేసింది.

"ఆ అమ్మాయి మనింటినుంచి ఆశాభంగం పొంది వెళ్ళిపోరాదు," అన్నదామె
"సుశీల్ ఒప్పుకుంటాడా ?" అని డాక్టరు సందేహించాడు.
ఒప్పుకుంటాడని అరుణ భరోసా ఇచ్చింది.
"సరే - ఉదయం నేను రాయ్‌గారితో మాట్లాడతాను."
"ఊరికే మాట్లాడటం కాదు, నిశ్చయ తాంబూలాలుకూడా అయిపోవాలి."
మర్నాడు ఉదయం బారిష్టరుగారు తిరుగు ప్రయాణానికి సిద్ధమవుతుండగా డాక్టరు, "మీరు ఇవాళ వెళ్ళటానికి వీల్లేదని సుశీల్‌తల్లి అంటున్నది," అన్నాడు ఆయన ఎందుకో తనభార్యను దిలీప్ తల్లి" అనలేదు.
"ఏమిటిసంగతి. నేను వెళ్ళితీరాలి. కేసులున్నాయి," అన్నాడు బారిస్టరు.
"ఇక్కడకేసు ముందు పరిష్కారం కానివ్వండి. నిశ్చయతాంబూలాలు జరగకుండా అమ్మాయి వెళ్ళిపోవటానికి వీల్లేదంటున్నది సుశీల్‌తల్లి."
"కాని, దిలీప్‌కు ___"
"దిలీప్ కిష్టం లేకపోతే అమ్మాయిని సుశీల్‌కు చేసుకుంటాను," అన్నాడు డాక్టరు.
"సుశీల్‌కా ? ఇది కొత్త సూచనగదా ? నేను ఆలోచించుకుని రాస్తాను," అన్నాడు బారిస్టరురాయ్. "బంధువర్గాన్ని వదులుకోం" అని దిలీప్ అన్నమాటలు జ్ఞాపకంవచ్చి, ఆయనకు రక్తం ఉడికిపోయింది.
"మీరిలా వెళ్ళిపోవటం మంచిదికాదు," అన్నాడు డాక్టరు.
"మంచిది కానిమాట నిజమేగాని, దాన్ని మీరలా మంచిగా చెయ్యాలనుకుంటున్నారా ? మీరేమీ లాంఛనాలు పాటించవద్దు. ఇందువల్ల మన స్నేహానికేమీ అంతరాయంరాదు," అన్నాడు బారిష్టరు. ఆయన డాక్టరును గాఢంగా ఆలింగనం చేసుకున్నాడు.
అరుణాదేవికూడా బారిష్టరుతో చెప్పిచూసింది. కాని ఆయనకంఠంలో పట్టుదల ధ్వనించింది. ఆడపిల్ల తండ్రి అయిఉండి ఇంత బెట్టుచేస్తాడా అని ఆమెకుకాస్త పౌరుషంకూడా వచ్చింది.
బయలుదేరేటప్పుడు కరుణ మాయను వాటేసుకుని, "మళ్ళీ ఎప్పుడు వస్తావు, వదినా ?" అని మళ్ళీ మళ్ళీ అడిగింది. మాయ తన మెడలోఉన్న నెక్లెస్‌తీసి కరుణమెడలో వేసింది. ఆమె తన పాదాలుతాకి వందనం చేసినప్పుడు అరుణ ఆమెను లేవదీసి తనగుండెకు హత్తుకున్నది.
బారిష్టరూ, మాయ బండిలో బయలుదేరేటప్పుడు అందరూ బయటికి వచ్చారు

డిలీప్ నేరస్థుడిలాగా అందరికీ వెనకగా నిలబడ్డాడు. అందరినీ చూస్తూ దిలీప్‌మీద చూపునిలిపి, బండిలోకి ఎక్కిపోయింది

మొత్తంమీద మాయ అందరి హృదయాలనూ గాయపరిచి మరీ వెళ్ళింది. ఒక్క శిశిరకుమార్‌మటుకు, "వదినెవచ్చి ఎందుకు వెళ్ళిపోయిందీ?" అని అందరినీ అయోమయంగా అడిగాడు.

డిలీప్, మాయా పరస్పరం ప్రేమించుకున్నారన్నది మాత్రం ఎవరూ గ్రహించ లేదు. ఇక దిలీప్ మనస్థితి ఎవరికీ పట్టలేదు. అతనంటే అందరికీ అసహ్యంగా ఉంది. తల్లి 'నువు నాకొడుకువేకాదు. నీఇష్టంవచ్చినట్టు ఏడ్చుకో' అనేసింది. ఆమె అన్నది అక్షరాలా నిజమేనని డిలీప్ ఎరగడు. ఎవరన్నా,ఎందుకిలా ఉన్నావని గాని, మాయను పెళ్ళిచేసుకోరాదా అనిగాని అడిగితే అతను తన మనసులోమాట బయటపెట్టేవాడే, కాని అతన్ని ఎవరూ అడగలేదు, అతను ఎవరికీ చెప్పనూలేదు. అతనికిప్పుడు రాష్ట్రీయసంఘం పనిలోకూడా ఆసక్తిలేదు. తన మనసులోమాట చెప్పుకోదగ్గ వ్యక్తి ప్రపంచంలో ఎవరూ లేరన్నది అతని కిప్పుడర్థ మయింది.

సుశీల్‌కు ప్రేమ గొడవలేమీతెలియవుగాని, మాయకూ తనకూ పెళ్ళి జరగుతుం దనీ, బయటతిరిగే సంస్కారంగల ఆమెతో తాను భుజాలు రాచుకుంటూ తిరిగి, ఉపన్యాసాలు దంచవచ్చుననీ అతను కలలు కన్నాడు.

సుశీల్‌కూ, మాయకూ పెళ్ళి అవుతుందని కరుణ సంబరపడింది. ఈ సంగతి కరుణద్వారావిని దిలీప్ సుశీల్‌ను ద్వేషించసాగాడు.

అరుణ సుశీల్‌లో లేనిపోని ఆశలులేపి, అందుకు పశ్చాత్తాపపడ నారంభించింది. బారిస్టరు ఆలోచించి రాస్తామన్న ఉత్తరం ఎంతకూ రాలేదు

బారిస్టరుగారు జరిగినదంతా తన భార్యకుచెప్పారు. డిలీప్‌చేసిన వంశదూషణ ఆమెకు ఆగ్రహం తెప్పించింది.

"డాక్టరుగారు అమ్మాయిని తన రెండోకొడుక్కి అడుగుతున్నారు. నిజానికి మన వంశాన్ని దూషించలేదుగద." అన్నాడు బారిష్టరు.

"ఇదేమన్నా చెప్పుల బేరమాఏం? అన్నకు పనికిరాని చెప్పులు తమ్ముడు తొడుక్కోవటానికి! ఈ సంబంధం మనకు వద్దేవద్దు," అన్నదామె.

ఆయన మాయను కదిలిస్తే, తనకు సుశీల్‌ను చేసుకోవటం ఎంతమాత్రమూ ఇష్టంలేదని కచ్చితంగా చెప్పేసింది. ఆమె అలా ఎందుకని అన్నదో వూహించలేక బారిష్టరుగారు ఈ సంబంధం వదులుకోవటానికే నిశ్చయించాడు. ఆయన డాక్టరుకు ఉత్తరం రాయనేలేదు.

ప్రపంచయుద్ధం ముమ్మరంగా సాగుతున్నది. బ్రిటిషు సామ్రాజ్యం ఇరుకున పడింది. భారత దేశంలో అశాంతి చెలరేగింది. సుభాష్‌బోస్ దేశంనుంచి ఎవరికీ తెలియకుండా వెళ్ళిపోయాడు. ఇంగ్లీషువాళ్ళు భారతదేశరక్షణ అనిచెప్పి ఆర్డినెన్సులు జారీచేశారు. జపానుకూడా యుద్ధంలో ప్రవేశించింది. దేశంనిండా అమెరికను, ఆస్ట్రేలియను, బ్రిటిషు సైనికులు ఉగారు. ఆహారపదార్థాలన్నీ వారికే పోతున్నాయి.

ఇంతలో ఆగస్టుఉద్యమం వచ్చింది. కాంగ్రెసుకమిటీ సమావేశంలో గాంధీజీ "క్విట్ ఇండియా" నినాదం పలికాడు. వెంటనే అధికారులు కాంగ్రెసు అగ్రనాయకులను అరెస్టుచేసి నిర్బంధంలో ఉంచారు. ఆగస్టు 9 న దేశమంతటా విప్లవ జ్వాలలు అంటుకున్నాయి. పోరాటంసాగింది. కొన్ని వేలమంది ప్రాణాలు బలి అయ్యాయి. లక్షకుపైగా జైళ్ళకు పోయారు.

ఈ ఉద్యమంలో డాక్టరు పిల్లలు జైళ్ళకు పోయారు. కాంగ్రెసువాది అయిన శిశిరకుమార్, తనచదువు పూర్తిఅయేదాకా రాజకీయాలలో అడుగు పెట్టనని మాట ఇచ్చినా, కాంగ్రెసు అగ్రనాయకులు జైళ్ళకు పోవటంతో విద్యార్థులు వారి స్థానాలు ఆక్రమించటం తప్పనిసరి అయింది. దిలీప్ చెప్పినా వినకుండా అతను ఉద్యమంలో చొరబడ్డాడు; ఆగస్టు 9 న ఢిల్లీలో హర్తాల్ జరిగినప్పుడు యాభై వేలమందితో కూడిన ఊరేగింపులో చేరి, ఘాటుగా ఉపన్యాసం చేశాడు. అతన్ని ప్రభుత్వం జైలులోకి తోసింది.

సుశీల్ కమ్యూనిస్టు అప్పటికి బ్రిటను రష్యాలు ఒకేపక్షం కావటాన అతను బ్రిటిషువారికి విరుద్ధంకాలేదు. దేశంలో కమ్యూనిస్టులంటే ద్వేషం ఏర్పడింది. సుశీల్ ఢిల్లీ కమ్యూనిస్టుపార్టీ జనరల్ సెక్రటరీ. అందుచేత అతనికి క్షణం తీరేదికాదు రెండు మూడు రోజులకొకసారి ఇంటికివచ్చేవాడు సుశీల్ దేశద్రోహి కాదు. అతను పార్టీ నిబంధనలను పాటించటం తప్పనిసరి. శిశిరుడు అరెస్టు కావటం అతన్ని బాధించింది, కాని అతని మూలానే శిశిరుడు అరెస్టయాడని అన్నారు. తల్లిదండ్రులు అతనితో మాట్లాడటం మానేశారు.

శిశిరుడి అరెస్టుకు మండిపోతున్న దిలీప్ రాష్ట్రీయ సంఘంతరపున ఒక మీటింగు ఏర్పాటుచేసి, అందులో తీవ్రమైన ఉపన్యాసం చేశాడు. అతనిని పోలీసులు లారీలో ఎక్కించుకుని తీసుకుపోయారు...

* * * *

జైలునుంచి తిరిగి వచ్చాక దిలీప్‌లోనూ, శిశిర్‌లోనూ చాలా మార్పువచ్చింది.

గాంభీర్యం హెచ్చింది. వారి రాకవల్ల ఇంట్లో ఉంటూవచ్చిన విచార వాతావరణంలో మార్పురాలేదు. ఇంట్లో ప్రతిఒక్కరూ విచార సముద్రంలో మునిగి ఉన్నట్లుగా ఉండేవారు



దిలీప్ మాయను మరిచిపోలేదు మరవటానికి అతను చేసిన ప్రయత్నాలు ఏవీ ఫలించలేదు జైలు జీవితంతో అతని సంకుచితత్వం కొంత సడలటంవల్ల మాయ పట్ల తాను చాలా అక్రమంగా ప్రవర్తించినట్టు స్పష్టంగా తెలిసి అతనివేదన మరింత హెచ్చింది అతనిబాధను ఎవరికీ చెప్పుకోలేదు తల్లితో చెప్పుకోవాలనిపించింది, కాని చేతకాలేదు.

సుశీల్‌మీద ఇంట్లో ఎవరికీ అంత గౌరవంలేదు అతనుకూడా వారితో కర్కశంగా ప్రవర్తించుతూ, తన ఆత్మగౌరవం నిలబెట్టుకుంటున్నాడు. అతనంటే ఇంట్లోవాళ్ళకు కాస్త బెదురుకూడా ఉండేది.

శిశిర్‌కు జైలుజీవితం ఆత్మసంతృప్తి చేకూరిచింది అతను చదువుకు పూర్తిగా స్వస్తిచెప్పి దేశంకోసంమహత్కార్యాలు చేద్దామనే ఆలోచనలలో ఉన్నాడు. స్థానిక కాంగ్రెసు కమిటీలో సభ్యుడయాడు

కరుణ మెడిసిన్ చదువింకా పూర్తికాలేదు ఆమెతో మాట్లాడేవాళ్ళులేరు. ఏమీతోచదు. ఎప్పుడన్నా సితార్ వాయించేది. అప్పుడప్పుడూ సహాధ్యాయినులు వచ్చి కబుర్లు చెపేవాళ్ళు

అరుణాదేవికి ఇప్పుడు ఒకటేవిచారం : పిల్లలెవరికీ ఇంకా పెళ్ళిళ్లుకాలేదు ఈ సమస్య తీరేదారికూడా ఆమెకు కనిపించలేదు

ఈ సమస్య డాక్టరును కూడా బాధిస్తున్నది : పిల్లలు జీవితంలో స్థిరపడలేదు. వాళ్లు ఉద్యోగాలుచేసి డబ్బు గడించటంలేదే అని కాదు – ఆయనకు డబ్బుగురించి ఎలాటి సమస్యాలేదు. తనపిల్లలు గాలికి తిరుగుతూంటే, వాళ్లు పనికి మాలినవాళ్ళని నలుగురూ అనుకుని పోతారేమోననీ, తనకున్న పరువుకు భంగం కలుగుతుందనీ ఆయనభయం.

వీటికితోడు దలీప్ జన్మరహస్యం జ్ఞాపకం వచ్చినప్పుడూ గుండెలో ఖలుక్కుమంటుందాయనకు

ఉండి ఉండి కరుణ మాయకు ఒక ఉత్తరం రాసింది; అందులో ఆమె మాయను 'వదినా' అని సంబోధించి, "త్వరగారా, వదినా" అన్న వాక్యంతో ఉత్తరం ముగించింది. అందులో దిలీప్ జైలుకు వెళ్ళిరావటమూ, అతను ఎప్పుడూ ఎవరితోనూ ఏమీ మాట్లాడకపోవటమూ, రాత్రిపూట డాబామీద పడుకుని నక్షత్రాలకేసి చూస్తూ ఉండటమూరాసి, "ఎవరిని చూస్తాడో తెలుసా, వదినా? నీకేసి–నువువస్తే గాని పెద్దన్నయ్య నవ్వేటట్టులేదు. ఎప్పుడు వస్తున్నావో చెప్పు, వదినా?" అని రాసింది.

ఈ ఉత్తరానికి మాయ సమాధానం రాసింది – ఒకేఒక వాక్యం : "మీ అన్నయ్యను వచ్చి నన్ను తీసుకువెళ్ళమని చెప్పు."

"ఈ జవాబుకు కరుణ ఎగిరి గంతేసి, దిలీప్ దగ్గిరికి పరిగెత్తి," నాచేతులో ఏముందో చెప్పుకో, అన్నయ్యా ?" అన్నది.

"నాకెలా తెలుస్తుంది ?" అన్నాడు దిలీప్.

"తెలుసుకోవాలి."

"ఏమిటా బలవంతం "

"అవును, బలవంతమే."

దిలీప్ పిల్లిఅనీ, నక్కఅనీ వెటకారం చేశాడు.

"సరిగాచెప్పు, లేదా ఓడిపోయానను," అన్నది కరుణ.

"ఓడిపోయాను – ఇక దయచెయ్యి."

కరుణ చిన్నబుచ్చుకుని, నాచేతిలో ఏముందో చూడవా ?' అన్నది

"నాకక్కర్లేదు, నువ్వే చూసుకో."

"తరవాత అడిగితే ఇవ్వను !"

"ఇంతకూ ఏమిటని ?"

"చెప్పను."

"చెప్పకపోతే తంతాను."

"నువుకాదు తన్నేది."

"ఇంకెవరు !"

"వదిన," కరుణకళ్ళు మెరిశాయి. ఆమె చెయ్యిచాచి అతనికి ఉత్తరం చూపి, "వదిన రాసింది," అన్నది.

"ఏదీ ? ఇలాతే !"

"నేనివ్వను పో !"

"నీవన్నీ అబద్దాలు."

"అబద్ధాలా ? చూసుకో !" అంటూ కరుణ ఉత్తరాన్ని దిలీప్ కిచ్చింది.

దిలీప్ దాన్నిచదివి, "నువ్వామెకు ఉత్తరం రాశావా ఏం ? ఏమనిరాశావు ?" అని అడిగాడు

"అంతా రాశాను – నువు రాత్రిళ్ళు ఆకాశంలో వదిన్ని చూస్తున్నావనీ, నవ్వటం మానేశావనీ, వదిన్ని త్వరగా రమ్మనీ..."

"అదంతా ఎందుకురాశావూ ?"

"ఏం? అబద్ధమా? అన్నయ్యా, నువ్వెళ్ళి వెంటనే వదిన్ని తీసుకురా నాకు చూడాలని మహా తొందరగా ఉంది"

"సరేలే, నువువెళ్ళు" అన్నాడు దిలీప్.

"ఎప్పుడు వెళతావన్నయ్యా?"

"ఇప్పుడే బయలుదేరుతున్నా"

"నేను అమ్మతో చెబుతా!" అంటూ కరుణ పరిగెత్తిపోయింది.

దిలీప్ గుండె రేస్ చేస్తున్నది

* * * *

ఇరవై ఎనిమిది సంవత్సరాల అనంతరం హుస్నాబాను మళ్ళీ ఢిల్లీకి వచ్చింది ఆనాడు ఆమె సంపెంగపూవులాటి కోమల శరీరంగలది. తన ప్రేమనూ, ఆశలనూ, ఆనందాన్నీ త్యజించి, వెర్రివాడూ, నపుంసకుడూ, కుష్ఠురోగి అయిన వయసు మళ్ళిన భర్తకు నాలుగోభార్యగా వెళ్ళి, తన సవతుల ఈర్ష్యలకు గురిఅయింది. జీవితం ఆమెకు చితిజ్వాల అయింది. తేడాఏమంటే జీవితజ్వాలలు ఆమెను బూడిద చేసెయ్యలేదు. ఆమె పెద్దసవతి ముందుపోయింది ఆమెకు అండగాఉండిన జీనత్ బేగమ్ తరవాత పోయింది ఆమెవివాహం అయినఎనిమిదేళ్ళకు ఆమెభర్త పోయాడు. నవాబు మూడోభార్య అందినంత నగానట్రా చేజిక్కించుకుని తన ప్రియుడితో లేచి పోయింది అవిఘంగా బాను తనభర్త ఎస్టేటుకు సర్వాధికారిణి అయింది, ఇప్పుడామె శరీరం కొద్దిగా లావెక్కింది. జుట్టునెరిసి, వెండిబంగారు మిశ్రమవర్ణంలో తయారయింది. శరీరఛాయ ఏమాత్రమూ మారలేదు.

ఆమె వచ్చేసరికి రంగ్ మహల్ పాడుపడినట్టుగా ఉంది. అందులో ఎవరూ ఉండటంలేదు దానికి మరమ్మతులుకూడాలేవు. దాన్ని బాగుచేయించాలంటే చాలా మంది మనుషులను పెట్టాలి. బాను తనవెంట ఒక ముసలిదానిని మాత్రమే తెచ్చుకున్నది. మనుషులను మాట్లాడటానికి ఎవరైనా కావాలి. ముసలి నవాబుదగ్గర దర్వానుగా పనిచేసిన రహ్మత్ మియా ఢిల్లీలోనే ఉంటాడు. ముసలిదానిని రిక్షాలో పంపి, బాను రహ్మత్ మియాను పిలిపించింది! డెబ్బైఏళ్ళ రహ్మత్ నెరసిన గడ్డంతోనూ, లావుపాటి అద్దాల పాత కళ్ళజోడుతోనూ వచ్చి, బానుకు సలాముచేశాడు

పెద్దనవాబు పోయినాక అతను మరెక్కడా నౌకరీ చెయ్యలేదని తెలుసుకుని బాను అతనికి అప్పటినుంచీ జీతం పూర్తిగా ఇచ్చి తిరిగి పనిలో పెట్టుకున్నది. ఆమె ఢిల్లీలోనే కొంతకాలం ఉండ నిశ్చయించింది. భవనం మరమ్మతులూ, కొద్ది మంది నౌకర్లు వియోగించటమూ రహ్మతే చేయించాడు.

ఒకనాటి మధ్యాహ్నం ఒంటిగంటవేళ రహ్మత్ డాక్టరు డిస్పెన్సరీకి వచ్చాడు. ఎవరో ముసలి ముసల్మాన్ ఆ వేళప్పుడు లోపలికి వస్తూండటం చూడగానే డాక్టరు మనసు ఒక్కసారిగా ఇరవై ఎనిమిదేళ్ళు వెనక్కివెళ్ళి, బురఖానుంచి కనపడిన రెండు వేళ్ళను, సంపెంగపువులాటి వాటిని, జ్ఞాపకం తెచ్చుకున్నది.

రహ్మత్ డాక్టరుకు వంగి సలాముచేసి, "బేగమ్‌గారు తమకోసం రంగ్ మహల్ నుంచి కారు పంపారు;" అన్నాడు.

"రంగ్ మహలా ? ఏ బేగమ్ ?" అన్నాడు డాక్టరు అయోమయంగా.

"హుస్నబానూ బేగమ్."

వారు ఢిల్లీలో ఉన్నారా ? ఎప్పుడొచ్చారు ?"

"వారంరోజులయింది "

డాక్టరు తనలో, "ఒకవారానికి గుర్తొచ్చానా ?... కాదు ఇరవై ఎనిమిదేళ్ళకు!" అనుకున్నాడు.

"బేగంవెంట ఇంకెవరున్నారు ?"

"ఎవరూ లేరు. వా రొక్కరే ఉన్నారు."

"నవాబుగారు ?"

"ఏ నవాబుగారు ?"

"బేగమ్‌గారి భర్త."

"అయ్యో. వారుపోయి ఇరవై సంవత్సరా లయింది."

డాక్టరు ఆశ్చర్యపోతూ వెళ్ళి కారులో కూర్చున్నాడు.

ఆయన మళ్ళీ ఇంత కాలానికి బానును చూసి కొయ్యబారిపోయాడు.

బాను నవ్వుతూ, "చాలా కాలానికి మళ్ళీ కలుసుకున్నాం, అన్నగారూ! నన్ను గుర్తుపట్టారా ?" అని అడిగింది.

డాక్టరుకు ఒకంతట గొంతు పెగల్లేదు.

"నా కిదంతా ఏమిటో కలలాగా ఉంది." అన్నాడాయన.

"కాని నేను హుస్నబానునే!"

"కావచ్చు."

బాను కిలకిలా నవ్వుతూ, "ఇంత కాలానికి మీరు నాకు నవ్వు తెప్పించారు." అన్నది

"అదేం ?"

"జరిగినది తరిచి ఏం లాభం ? కాని నవాబుగారు—"

"ఇప్పుడే తెలిసింది."

"ఇప్పుడేనా ?"

"నువ్వేనాడైనా ఉత్తరం రాశావు గనకనా?"

"చాలా రాశాను; కాని వాటిని హృదయంలోనే పోస్టు చేసుకున్నాను."

"వీది ఎంత పెద్ద హృదయం!"

"మీరు రాసి చించి పారేశారేమో ?"

"నేనేమీ రాయలేదు."

"రాయబుద్ధి కాలేదా ?"

''కాదు - శక్తి చాలక ... నవాబుగారు పోయి చాలాకాలమయిందిట. ఉత్తరం ముక్క రాసి ఉండవలసింది.''

"రాస్తే ఏమవుతుంది ? మీ ప్రగాఢ సంతాపాన్ని తెలుపుతూ జవాబు రాస్తారు "

డాక్టరు ఏమీ అనక కంట తడి పెట్టుకున్నాడు.

''పెద్దవా రయారు. ఏమిటో మూఢత్వం ?''

''నాకు అరవై దాటాయి. కాని నిన్ను తలుచుకున్నప్పుడల్లా నేను యువకుణ్ణి అవుతూనే ఉంటాను. మా దొడ్లో సంపెంగ వేశాను. అందులోకి చూస్తే నీ వేళ్ళు కనిపిస్తుంటాయి.''

''మీకేమన్నా పిచ్చా ఏం ?''

"అలా జరిగినా బాగుండేది - అంతా మరిచేవాణ్ణి.''

బాను కాస్సేపు ఆలోచించి, "ఎందరి రోగాలో కుదిర్చారుగాని, మీకు మీరు చికిత్స చేసుకోలేక పోయారు,'' అన్నది.

"ఇది నయంకాని రోగం ... బానూ, ఒక్కటి చెప్పు. నవాబుగారు బతికున్నంతకాలమైనా సుఖపడ్డావా ?

"అడిగి ఏం లాభం ?''

"స్త్రీ శక్తి ఎంతటిదో తెలుసుకుందామని.''

"ఇరవై ఎనిమిదేళ్ళక్రితం ఉన్నట్టే ఉన్నాను.''

"ఎందుకని ? నవాబు అంత పశుప్రాయుడా ?''

"పశుప్రాయుడైనా సంతోషించేదాన్ని, అన్నగారూ! ఆయన ఒకశవం! శవాన్ని పెళ్ళాడాను.''

డాక్టరు గుండె పగిలిపోతున్నది. "ఆ శవం చావటానికి ఎనిమిదేళ్ళు పట్టిందా ? ఎనిమిదేళ్ళు దాని భారం వహించావా ?" అన్నాడు.




"ఆగ్రహించి లాభంలేదు, అన్నగారూ, ఆబరువు నలుగురం మోశాం. ఏమైనా నేను చివరి రోజుల్లో ఆయన్ను చూసి జాలిపడ్డాను."

"చనిపోయే లోపుగా నువ్వాయన్ను క్షమించావన్నమాట."

"ఆయన్ను మొదటిసారి చూస్తూనే క్షమించాను. అంత నిస్సహాయుడూ, శూన్యుడూ అయిన మనిషిని ఏ స్త్రీ అయినా క్షమిస్తుంది పైగా ఆయన నా భర్త!"

"ఆ తరవాత?"

"తరవాత నిప్పు చల్లారింది. బూడిదమిగిలింది. బూడిదలో జీవించటం అంత కష్టం కాదుగా?"

"ఎనిమిదేళ్ల శవంతోనూ, ఇరవయ్యేళ్లు బూడిదలోనూ జీవించివచ్చావా? దేవీ!" అంటూ డాక్టరు బాను కాళ్ళమీద పడ్డాడు.

బాను కంగారుగా వెనక్కు జరిగింది.

"హిందువులం రాళ్ళను దేవతలుగా పూజించి, వాటిఎదట నవ్వుతాం, ఏడుస్తాం, పారవశ్యం చెందుతాం. వాటికి మొక్కుకుంటాం. కానుక లర్పిస్తాం. అయినా ఆ దేవతలు ప్రత్యక్షమై, భక్తుల కోరికలు తీర్చటమన్నది ఎక్కడా చూడలేదు. ఇవాళ నాకు దేవత సాక్షాత్కరించింది. నా అపరాధాలను క్షమించు,' అన్నాడు డాక్టరు.

"అపరాధమా?"

"అవును, ఈ క్షణందాకా నేను అపరాధినే."

"అదంతా పోనివ్వండి. అన్నగారూ ఇంట్లో అంతా కులాసాగా ఉన్నారా?"

"నువే వచ్చి చూడు — దిలీప్‌ను కూడా చూడు."

బాను గుండె క్షణం ఆగిపోయింది. దిలీప్ అన్న పేరు ఆమె వినటం ఇదే మొదటిసారి.

"ఎమ్మే ఎల్లెల్బి పాసయాడు. మహా మొండి!" అన్నాడు డాక్టరు.

"మొండా?"

"ఏమిటనుకున్నావు? హిందూ మతవాది. ధర్మశాస్త్రాలు చదివాడు కార్య క్రమాలతోనూ, తగాదాలతోనూ తీరదు."

"ఆరోగ్యంగా ఉంటాడా?"

"బాగా ఆరోగ్యంగా ఉంటాడు. వచ్చి చూడరాదూ?"

"చూడను."

ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. పెదవులు వొణికాయి. ఆమె తన ఉద్రేకాన్ని సంబాళించుకుని, "సంగతులేమైనా అతనికి తెలిశాయా?" అన్నది

"ఏమీతెలీదు మాకో పెద్దచిక్కు వచ్చి పడింది. మరేమీ లేదు; పెళ్ళికి సంబంధించిన చిక్కే. లోకం దృష్టిలోవాడు మా కొడుకే. గొప్పింటి సంబంధం తెచ్చి చేద్దామంటే వాళ్ళను మోసగించడ మవుతుంది. మాలో కులం పట్టింపులూ మతం పట్టింపులూ నీకు తెలిసినవేగా?

"పట్టింపులులేని సంబంధం చేస్తే?'

"అలాటి సంబంధం వచ్చింది కులభ్రష్టులని వాడు నిరాకరించాడు వాడి పెళ్ళికాని కారణంచేత మిగిలినపిల్లల పెళ్ళిళ్ళు నిలిచిపోయాయి. ఏం చెయ్యాలో నాకేమీ పాలు పోవటంలేదు"

"పోనీ—అతనితో ఉన్నమాట చెప్పెయ్యండి, లేదా, మరేదైనా కల్పించి చెప్పండి. నా పేరుమాత్రం చెప్పవద్దు."

"అది నావల్లకాదు. ధర్మంలో మూఢనమ్మకం గలవాడు; నిజం తెలిస్తే గుండె పగిలి చచ్చిపోతాడు; లేదా దిక్కులేనివాడై పోతాడు.

"అయితే అతన్ని ఉన్నట్టే ఉండనిచ్చి, మీ మిగిలినపిల్లల పెళ్ళిళ్ళు చేసెయ్యండి. దిలీప్ మా కుమారుడే అన్నభావం మనస్పూర్తిగా తెచ్చుకోండి; నాకు ఒకసారి అరుణను పంపండి," అన్నది బాను.

''చెబుతాను, ఒకసారి దిలీప్ ఆస్తికి సంబంధించిన లెక్కలూ అవీ చూస్తావా? దాన్ని ఇంతవరకు తాకలేదు. బాగా వృద్ధి అయింది.''

''దానితో నా కేమీ సంబంధంలేదు అది దిలీప్ ఒక్కడిదే కాదు, పిల్ల లందరి దీనూ - అదేకాదు, ఇంక నాకున్న ఆస్తులన్నీకూడా వాళ్ళవే... రేపు బండి పంపు తాను వదినెగారిని పంపండి.''

మర్నాడు అరుణ వెళ్ళి బానును కలిసింది. ఇద్దరూ బాగా ఏడ్చారు. ఇద్దరూ చాలాసేపు మాట్లాడుకున్నారు. దిలీప్‌ను చూడమని అరుణ అడిగితే బాను అది జరగదని ఆమెతోకూడా చెప్పేసింది కిందటిసారిలాగే ఒకరినోట్లో ఒకరు ఫలహారాలు పెట్టుకున్నారు. తరువాత అరుణ ఇంటికి వెళ్ళిపోయింది.

* * * *

కరుణ రాసిన ఉత్తరం అందుకున్నాక మాయకు ఆత్మ నిగ్రహంపోయింది. ఆమె తనతండ్రితో, ''నాన్నగారూ, ఒకసారి ఢిల్లీ పోదామా?'' అన్నది.

బారిస్టరుగారు ఉలిక్కిపడి, ''ఎందుకు? ఏంపని? ఢిల్లీమీదికి బుద్ధిపోయిం దేం?'' అన్నాడు.

మాయ ఏమీదాచక, 'నన్ను రమ్మని కరుణ ఉత్తరం రాసింది; నాకూ్కడా ఆమెను చూడాలని ఉంది. వాళ్ళమ్మగారి ఆరోగ్యం బాగాలేదట'' అన్నది.

"మనం వెళ్ళటం అంత బాగుండదేమో?'' అన్నాడు తండ్రి

"దాని కేమిటి, నాన్నగారూ? వాళ్ళు తెలీనివాళ్ళా?" అన్నది మాయ. ఆమె ముఖం ఎర్రబడటం తండ్రి గమనించాడు.

''ఇక్కడికి రమ్మని కరుణకే రాయగూడదూ?'' అన్నా డాయన.

''వద్దు మనమేపోదాం. కిందటిసారి వెళ్ళినప్పుడు ఢిల్లీచూడేలేదు. ఈసారి వారంరోజులుండి, అంతా చూద్దాం,'' అన్నది మాయ

''చూతాంలే! మీ అమ్మనుకూడా అడగాలిగా? ప్రస్తుతం రెండు పెద్దకేసుల్లో మునిగి ఉన్నాను

''ఇంకో వారానికి దసరా శలవులు వస్తున్నాయి.''

''అవును. మీ అమ్మ ఏమంటుందో కనుక్కొని-''

మాయ ఢిల్లీ వెళ్ళటానికి ఆమె తల్లి ఏంతమాత్రమూ ఒప్పలేదు

ఆమె ఒకేవాక్యం జవాబు రాసింది కరుణకు...

దిలీప్ ఆ ఉత్తరాన్ని గట్టిగా పట్టుకుని ఏం చెయ్యటానికీ నిర్ణయించుకో లేక పోయాడు

కరుణ అతనివద్దనుంచి తల్లి దగ్గిరికి పరిగెత్తుకుంటూ వెళ్ళి. "అమ్మా, వదిన వస్తున్నది!" అన్నది.

"ఏ వదిన?" అన్నది తల్లి.

"కాన్పూరు వదిన; తీసుకురావటానికి అన్నయ్య వెళ్ళుతున్నాడు."

"ఏ అన్నయ్య?" పెద్దన్నయ్యే? "వెళ్లుతున్నానని నీతో అన్నాడా?"

"అన్నాడు. అన్నయ్యను రమ్మని వదిన రాసింది"

"ఆమెకు అన్నయ్య ఉత్తరం రాశాడా ఏం?"

"లేదు. నేనే రాశాను — ఒకసారి వచ్చిపొమ్మని"

"నాతో ఎందుకు చెప్పలేదూ? ఏదీ ఉత్తరం?"

"అన్నయ్య దగ్గిరే ఉంది."

ఆ రాత్రి అరుణ దిలీప్‌తో, "నాయనా, నీ ఉద్దేశం ఏమిటి? నీ మనసు విప్పి నాకు చెప్పు." అన్నది.

"ఏ సంగతమ్మా?"

"నీకు మరోసంబంధం చూడమంటావా?"

"ఇప్పు డేం తొందరొచ్చిం దమ్మా?"

"నీకు తొందరలేకపోతే సరా? మిగిలినవాళ్ళ పెళ్ళిళ్ళు జరగొద్దూ?"

"వాళ్ళ పెళ్ళిళ్ళు చేసెయ్యి. నాకోసం ఆపవద్దు."

"నీ పెళ్ళి కాకుండానా?"

"నేను భీష్ముడల్లే బ్రహ్మచారిగా ఉంటాను; ఆయన తమ్ముల పెళ్ళిళ్లు జరిగి పోలేదూ?"

"నా దగ్గిరకూడా నీ మనసు దాస్తావా— నాయనా?"

"ఏం దాచానమ్మా?"

"మాయ దగ్గిరనుంచి ఉత్తరం వచ్చిందిటగా— నువు ఆమెను తీసుకురావటానికి పోతున్నావుట?"

"ఎవరన్నారు?"

"కరుణతో అన్నావుటగా!"

"అదా? ఏదో నవ్వులాటకన్నాను. నువు నిజమనుకుంటున్నావా?"

"నే నేమీ అనుకోవటంలేదు. నువు కావాలంటే ఆ బారిష్టరుగారికి ఉత్తరం రాయమని నాన్నగారితో చెబుతాను."

దిలీప్, "సరే." అని ఉండవచ్చు. కాని అతనినోట ఏమాటా రాలేదు

యుద్ధం ముగిసేసరికి బ్రిటిషుసామ్రాజ్యం బీటలుపడింది. బ్రిటిషువారు భారతీయులచేత గెంటించుకోబడకుండా తమంతట తామేదేశాన్ని విభజించి, వెళ్ళిపోయారు. అటు పాకిస్తానులో ప్రారంభమైనమతమారణహోమం భారతదేశానికికూడా పాకింది.

దరియాగంజిలో ఒకముస్లిముల ప్రెస్ ఉన్నది. అందులో ఒకకంపోజిటరు దిలీప్‌కు గూఢచారి. అతను చూడటానికి వెర్రిబాగులవాడు లాగుండేవాడు. ఆ ప్రెస్‌కు ఒకకరపత్రం అచ్చుకు వచ్చింది. ఆగస్టు 21న ముస్లిములు ఢిల్లీలో హత్యాకాండ సాగించనున్నట్టు ఆ కరపత్రంలో ఉన్నది. దిలీప్ గూఢచారి దాన్ని చూసి, ప్రెస్‌నుంచి గోడదూకి పారిపోయి, దాన్ని దిలీప్‌కు అందించాడు.

మర్నాడే ఆగస్టు 21 ఆ రోజు శరణార్థుల మీటింగులో దిలీప్ మాట్లాడవలసి ఉన్నది దిలీప్ వేగంగా అక్కడికి వెళ్ళి, ఇంకా వేళకాకపోయినా ఉన్నవాళ్ళతోనే ఉపన్యాసం ప్రారంభించాడు అతను ముస్లిముల కరపత్రాన్ని సభికులకు చూపి మాటలతో వారిని రెచ్చగొట్టి "కరో యా మరో" అనే నినాదాన్ని ఇచ్చాడు.

అసలే అష్టకష్టాలూ అనుభవించివున్న శరణార్థులు రెచ్చిపోయారు.

ఢిల్లీ స్టేషనునిండా శరణార్థులున్నారు అక్కడసంఘర్షణ ఆరంభమయింది కత్తులూ, తుపాకులూ విజృంభించాయి జనం చచ్చారు. స్టేషనులో ఒక రైలుపెట్టె పేలిపోయింది. ఆ పెట్టెలో ముస్లిములున్నారు. వారివద్ద చాలా ఆయుధాలూ మందుగుండు సామానూ దొరికాయి.

ముసల్మానులు ప్రార్థనలు చేసుకుంటున్న ఒక మసీదులో చేతిబాంబు పేలింది.

మర్నాడుశుక్రవారం జుమ్మామసీదునుంచి ముస్లిముల "ప్రత్యక్షచర్య" ప్రారంభం కానున్నది. జాని పోలీసులకు దిలీప్‌ద్వారా ఈ సంగతి తెలిసి, మసీదును చుట్టుముట్టి పదేసిమంది చొప్పున మసీదునుంచి బయటికి రమ్మని ఆదేశించారు. చాలామందివద్ద ఆయుధాలున్నాయి—చేతిబాంబులు, కత్తులు, పిస్తోళ్లు! అన్నీ పెద్దగుట్ట అయాయి. ఆయుధాలున్నవాళ్ళను లారీలలో జైళ్ళకు తీసుకుపోయారు.

మూడురోజులపాటు ఢిల్లీ వీధులలో ఎడతెగని హత్యాకాండ జరిగింది. ఏడు వందల ఏళ్ళపాటు ఢిల్లీ కోటద్వారం దగ్గిర సలాములుచేస్తూ, అర్థంలేని జీవితాలు గడిపిన హిందువులు ఇప్పుడు గర్వంగా తలలెత్తుకుని తిరగసాగారు...

ఒకరోజు డాక్టరు తెల్లమొహం వేసుకుని తన భార్యతో, "దిలీప్ రౌడీమూకను వెంటబెట్టుకుని రంగ్‌మహల్ తగలబెట్టటానికి బయలుదేరాడు!" అన్నాడు.

అరుణ బెదిరిపోయి, "పాపం, బాను!...ఆమెను మీరు ఇక్కడికి తెచ్చి ఉండవలసింది. దిలీప్ మనసు ఎలాగైనా మార్చి చూడండి," అన్నది.

"వాడు పిచ్చెక్కి తిరుగుతున్నాడు. నేను వాణ్ణి చూసి వారం అయింది "

"నేను వెళ్ళి బానును తీసుకొస్తాను. బండి ఏమైనా దొరుకుతుందా?"

"ఇంకానయం! పట్టణమంతా ఎలా ఉందనుకున్నావు?"

"అయితే అయింది!" అంటూ ఒక దుప్పటం తీసి కప్పుకుని అరుణ బయలు దేరింది. చేసేదిలేక డాక్టరు తాను కూడా భార్యవెంట బయలుదేరాడు.

వీధులు భీభత్సంగా ఉన్నాయి సందులు నిర్జనంగా ఉన్నాయి వాళ్లు ముస్లిము ఇళ్లున్న వీధులవెంట కూడా నడిచి రంగ్‌మహల్ చేరేసరికి, అక్కడ దిలీప్ బృందంవాళ్ళు కార్యక్రమం తేలక కొట్టుకుంటున్నారు—లోపలివాళ్ళను చంపి, భవనం తగలబెట్టటమా? లేక భవనం అంటించి, లోపలివాళ్ళను మంటల్లో చావనివ్వటమా ?

డాక్టరూ, అరుణా ఆ గుంపులో ఎవరితోనూ మాట్లాడక, తిన్నగా లోపల ప్రవేశించారు వాళ్లు దిలీప్ తల్లిదండ్రులని గుర్తించినవాళ్ళు మాత్రం దిలీప్‌కేసి ప్రశ్నార్థకంగా చూశారు.

దిలీప్ తన తల్లిదండ్రుల వెనకగా వెళ్ళి, "నాన్నగారూ, ఆగండి ఇక్కడి కెందుకొచ్చారు? వెనక్కి తిరిగి వెళ్ళిపొండి-దయచేసి!" అన్నాడు.

"ఇంతమందిని వెంటబెట్టుకుని ఇక్కడి కెందుకు వచ్చావని, తండ్రినై ఉండి కూడా, నేను నిన్ను అడగలేదే! కొడుకువైన నువు నన్ను నిలదీసి అడుగుతున్నావా? ఎవరి ఆశయాలు వారివి! నీ ఆశయాలూ నావీ వేరువేరు. అందుచేత నేను నీకేమీ చెప్పను, నువు నా కేమీ చెప్పవద్దు," అన్నాడు డాక్టరు.

"మీరు సరిగా గ్రహించలేదు. మేము రంగ్‌మహల్ తగలబెట్టబోతున్నాము మీరు వెళ్ళిపొండి," అన్నాడు దిలీప్.

"తెలుసు, తెలుసు. విన్నాదోపూనింది; నీ పాపంలో మేమూ భాగం పంచుకోక తప్పదు. ఇక్కడ బాను అనే ఆమె ఉన్నది; చేతనైతే ఆమెను కాపాడతాం; లేదా ఆమెతో బాటు మేమూ కాలిపోతాం"

"మీరు చేసేది మహాపాపం, నాన్నగారూ!"

"నిన్ను పాలిచ్చి పెంచి పెద్దచేసినదే మహాపాపం. ఆ పాపాన్ని ఇలా కడిగేసుకుంటాం."

తండ్రికి చెప్పి లాభంలేదని, దిలీప్ తల్లి కాళ్ళు పట్టుకుని, "వెళ్ళిపో, అమ్మా! వెళ్ళిపో!" అని ప్రాధేయపడ్డాడు.

"ఛ్ఛాపీ, నన్ను తాకకు! పో అవతలికి," అన్నది అరుణ కర్కశంగా.

డిలీప్ నిర్ఘాంతపోయాడు. తల్లి తనతో అలా ఎన్నడూ మాట్లాడలేదు;

ఇంతలో బాను అక్కడికి వచ్చింది. ఆమె ముఖం పాలిపోయి, రక్తహీనంగా ఉన్నది. ఆమె చప్పున అరుణను సమీపించి "ఇదేమిటి, వదినా? ఇప్పుడిక్కడికి ఎందుకు వచ్చావు?" అన్నది

అరుణ ఆమెను గాఢంగా కౌగలించుకున్నది.

''బానూ, తుపాకీ ఎక్కడ?'' అని అడిగాడు డాక్టర్. అంటూనే ఆయన లోపలికి పరుగెత్తి తుపాకీతో తిరిగివచ్చి, తుపాకీని డిలీప్ వేపు గురిచేశాడు.

వాళ్ళు చాలామంది ఉన్నారు. మీరీ తుపాకీతో ఎంతమందిని చంపగలరు?" అని బాను అడిగింది.

"మిగిలినవాళ్ళ మాట నాకెందుకు? ఈ సైతానుకొడుకును చంపేస్తాను.'' అన్నాడు డాక్టరు.

డిలీప్ రొమ్ము అప్పగించి ఆయన కెదురుగా నిలబడ్డాడు.

బాను డిలీప్‌కేసి పెద్దకళ్ళు చేసి, ''డిలీప్!'' అన్నది అస్పష్టంగా.

అరుణ ఆమెతో, ''అవును, వాడే డిలీప్! మొదటిసారీ, చివరిసారీ వాణ్ణి బాగా చూసుకో...కాల్చండి!'' అన్నదామె భర్తతో.

బాను చప్పున తుపాకికి అడ్డంవచ్చి నిలిచి, "అతన్ని అడ్డకండి, అన్నయ్యా. ఇష్టంవచ్చినట్టు చెయ్యనివ్వండి - దైవసాక్షిగా చెబుతున్నాను!'' అన్నది. ఆమె డాక్టరు చేతిలోని తుపాకీ లాగేసుకున్నది.

డిలీప్ బానుతో, ''కావలిస్తే మీరు బయటికి వెళ్ళండి. మేము రంగ్‌మహల్ విధిగా తగలబెడతాం,'' అన్నాడు

బానూ మాట్లాడలేదుగాని డాక్టరు డిలీప్‌తో, ''మేమిక్కడే ఉంటాం. నువు చేసేది చేసుకో; ఈ ఇంట్లో మేము ముగ్గురం కాక ఇంకా ఇద్దరు వృద్ధులు—ముసలిదాసీ, రహ్మత్‌మియా—ఉన్నారు,'' అన్నాడు

"డిలీప్! ఆ ముసలివాళ్ళను వెళ్ళనీ, దేవుడు నీకు మేలుచేస్తాడు,'' అన్నది బాను

ముసలివాళ్ళు బయటికి పోవటానికి ఒప్పుకోక, 'మీతోపాటే చస్తాం,' అన్నారు.

కాని అన్ని నిర్ణయాలూ డిలీప్ చెయ్యిదాటి పోయాయి. అతనివెంట వచ్చిన వాళ్ళు అప్పటికే రంగ్‌మహల్‌కు నిప్పంటించారు. అది కార్చిచ్చులాగా ఆ భవనాన్ని చుట్టుముట్టుకుంటూ రాసాగింది.

ఆ సమయానికి పోలీసులూ, మిలిటరీవాళ్ళూ అక్కడికి వచ్చారు.

డిలీప్‌కు చైతన్యం వచ్చింది. అతను ఎక్కడినుంచో పెద్ద తాడుతెచ్చి, వెనక వైపు కిటికీకి కట్టి, దాని వెంబడి దిగిపొమ్మని తల్లితో అన్నాడు.

"బానుకో చెప్పు," అన్నది అరుణ.

దిలీప్ బానుతో, "జ్వాలలు ఇక్కడిదాకా రాకముందే మీరుదిగిపోండి," అన్నాడు.

బాను మాట్లాడ లేదు.

"మీరు వెళ్ళకపోతే నేను కూడా మీతోపాటే చస్తాను." అన్నా డతను.

ఆ మాట విని బానూ ఆందోళనగా, "దిలీప్, నువు ముందు బయటికి వెళ్ళిపో," అన్నది. అమె మాతృహృదయం - స్పష్టంగా తెలియవచ్చింది ఆమాటల్లో.



''మీరు వెళ్ళితేగాని అమ్మా, నాన్నా వెళ్ళరు. నేనూ వెళ్ళను,'' అన్నాడు దిలీప్.

బాను మనసుమారింది. ఆమె అరుణనూ, డాక్టరునూ దిగమని హెచ్చరించింది

ముందు ఎవరు దిగాలని అరుణా బానూ తర్జనపడుతుంటే దిలీప్ కాలహరణం చెయ్యవద్దని హెచ్చరించాడు

డాక్టరు కిందికి దిగివెళ్ళి తాడును లాగి పట్టుకున్నాడు. తరవాత ముసలిదాసి దిగింది బానూ అరుణా "ముందు నువు'' అని రెట్టించుకోవటంచూసి, దిలీప్ బానుపట్టుకుని జాగ్రత్తగా కిందకిదించాడు ఆమెవెనక అరుణా, రహ్మాత్‌దిగారు.

ఆఖరుకు దిలీప్ దిగిపోదామని తాడు పట్టుకున్నాడు. అంతలోనే పైభాగాన జ్వాలలు వ్యాపించి, కిటికీదాకా వచ్చేశాయి; తాడు కాలిపోయింది. దిలీప్ కింద పడ్డాడు; అతనితల పగిలింది అతనికి స్పృహ తప్పింది బాను చప్పునవచ్చి అతనిమీద పడిపోయింది.

అక్కడ జనం చాలామంది పోగయారు కాలిపోతున్న భవనంనుంచి అందరినీ కాపాడినందుకు వాళ్లు దిలీప్‌ను మెచ్చుకున్నారు. జరిగినదేమిటో వారికి తెలీదు.

* * *

దిలీప్‌కు తెలివివచ్చింది. అతను కళ్ళుతెరిచి చూశాడు. తన మంచంపక్కన కుర్చీలో కూర్చుని తనకేసే చూస్తున్న మాయను అతను గుర్తించలేదు. "ఎవరు మీరు?" అని అడగాలనుకున్నాడు పెదవులు కదిలాయి గాని, నోటమాట రాలేదు. అతనికళ్ళు మళ్ళీ మూతలు పడ్డాయి.

మాయ అతనినోట చంచాతో కాపినీళ్ళు పోసింది. అతనుమళ్ళీ కళ్ళు తెరిచి, "ఎవరు మీరు?'' అని అడిగాడు.

మాయ చిన్నగా నవ్వింది, కాని జవాబు చెప్పలేదు. అతను మళ్ళీ కళ్ళుతెరిచి, అదేప్రశ్న వేశాడు.

"గుర్తుపట్టలేదా? పోనివ్వండి.'' అంటూ మాయ లేచి వెళ్ళిపోయింది.

తరవాత కొద్దిసేపటికి ఇంట్లోవారంతా అతనిదగ్గిరికి వచ్చారు. వాళ్ళవెనక బానుకూడా వచ్చింది.

తాను నాలుగురోజులుగా స్పృహలేకుండా పడిఉన్నట్టు దిలీప్ అరుణద్వారా తెలుసుకున్నాడు. బానువచ్చి అతనితల దగ్గిర కూర్చొని, తల నిమిరింది.

''మీరునన్ను క్షమించారు!'' అన్నాడు దిలీప్. బాను కళ్ళలో నీరు చూసి అతనికికూడా కన్నీరు వచ్చింది. అతను మాయ ముఖంకోసం కళ్ళతోనే వెతికాడు. ఆ ముఖం కనిపించలేదు, ఆమె గుర్తుకూడా రాలేదు.

డాక్టరువచ్చి ఆతని కట్లుమార్చి, ఆతనికి విశ్రాంతి కావాలని చెప్పి, వెళ్ళిపోయాడు.

ఆతను చాలాసేపు నిద్రపోయి కళ్లుతెరిచి చూసేసరికి మళ్ళా కళ్ళఎదట మాయ ముఖంకనబడింది. ఈసారి ఆతనామెను గుర్తించి, "మీరా !" అన్నాడు ఆశ్చర్యంతో.

"గుర్తించారా ?" అన్నదామె నవ్వుతూ, ఆతను తనచేతిని తీసుకుంటే ఆమె తీసుకోనిచ్చింది

"మీరువచ్చి ఎంతకాల మయింది ?" అన్నాడతను.

"అయిదురోజు లయింది "

"నాన్నగారుకూడా వచ్చారా ?"

"వచ్చి వెళిపోయారు; ఖూనీకేసు లున్నాయిట. నేను వెడతానంటే కరుణ ఉంచేసింది."

"నా జబ్బుసంగతి ఎలా తెలిసింది ?"

"కరుణ టెలిగ్రాం ఇచ్చింది, నేను రావటం నాన్నగారి కిష్టంలేదు; నేనిక్కడ ఉండిపోవటంకూడా ఆయన కిష్టంలేదు, నేనే ఉండిపోయాను "

"ఏం ?"

"కరుణ ప్రోద్బలం ?"

"ఇంకేమీ లేదా ?... మీకు ఉండాలనిపించలేదా ?"

"అనిపించింది."

మాయ నవ్వుతూండటంచూసి, "ఎందుకనిపించింది ?" అని దిలీప్ అడిగాడు.

"ఒకపని పూర్తిచేద్దామని ఉండిపోయాను."

"ఏమిటది ?"

"కిందటిసారి ఇక్కడ ఒకరికి ఒక గడియారం ఇచ్చాను. అది సరిగా పని చేస్తున్నదా అని అడగాలనుకున్నాను," అన్నది మాయ.

"నువే చూడు, గడియారం ఆడుతున్నదో, ఆగిపోయిందో," అంటూ ఆమె చేతిని దిలీప్ తన గుండెమీద పెట్టుకున్నాడు.

మాయ నెమ్మదిగా తన చేతిని లాగేసుకుని అక్కడినుంచి వెళ్ళిపోయింది. దిలీప్‌కు ప్రపంచమంతా తనదే అయిన ట్టనిపించింది...

కరుణ ఒక ట్రేలో టీ, రొట్టె, వెన్నా, తెచ్చింది.

"నేను టీ తాగను," అన్నాడు దిలీప్.

"ఎందుకు తాగవూ ?" అన్నది కరుణ.

"నా యిష్టం", అన్నాడు దిలీప్.

"అమ్మతో చెబుతాను '' అన్నది కరుణ.

"గవర్నరుతో చెప్పినా నేను తాగను.''

"సరే గవర్నరునే పంపుతాను.'' అంటూ కరుణ వెళ్ళిపోయింది.

"పిలిచారా ?'' అంటూ మాయ వచ్చింది.

"లేదే.'' అన్నాడు దిలీప్. కాని ఆమె తిరిగివెళ్ళిపోతుంటే చెయ్యిపట్టుకు ఆపాడు.

"టీ కలపవద్దా ?'' అన్నదామె

"కలపు ''

''కరుణ కలుపుతానంటే తరిమేశారుట ?''

"నే తరిమెయ్యలేదు. గవర్నరును పంపిస్తానని వెళ్ళింది. గవర్నరంటే నువేనా?

మాయ నవ్వింది. ఆమె టీ కలిపి చేతికిచ్చేటప్పుడు దిలీప్ ఆమె చెయ్యి పట్టుకుని మంచంమీద కుదేశాడు, ఆమెను దగ్గిరికి లాక్కుని కౌగలించుకున్నాడు. "మాయా, నువు నిజంగానే నన్ను క్షమించావా ? నేను నీకూ, మీ నాన్నగారికీ తీరని అపచారం చేశాను," అన్నాడు.

"ఇప్పుడదంతా దేనికి ?'' అన్నది మాయ.

"కాదు, మాయా ! నా ప్రాణాలు నీ చేతిలో ఉన్నాయి. నన్ను సందిగ్ధంలో పెట్టక చెప్పు–నన్ను స్వీకరిస్తావా ?"

"ఈ సంగతి ఆనాడు మీ కళ్ళల్లోనే కనబడింది. మీ నోటిభాషకూ, కళ్ళభాషకూ అతకలేదు. '

"నా తెలివితక్కువతోబాటు నా బాధను కూడా అప్పుడే అర్థం చేసుకున్నావన్న మాట !''

"అవును అందుకేగా–?''

"మరి మీ నాన్నగారు ?''

"ఆయనదేముంది ? ఆడపిల్లతండ్రి. మర్యాదలకుపోతే ఆడపిల్ల నెలా వదిలించుకుంటారు ? మీరేమో హిందూమతాన్ని ఉద్ధరించేవారైతిరి. హిందూకుటుంబాలలో పెళ్ళికావిపిల్ల తండ్రికి రొమ్ములకుంపటేగా ?" అన్నది మాయ ఎత్తిపొడుస్తూ.

దిలీప్ హతాశుడై వెనక్కు వాలిపోయి, "నా మాటలకు కోపంవచ్చింది ! కాని అందుకేదైనా ప్రాయశ్చిత్తం చేసుకుంటాను, మాయా; మీ నాన్నగారు నన్నెలాగైనా క్షమించేట్టు చెయ్యి.'' అన్నాడు.

"నా కోపానికి ఏమి ఉపశాంతిచేస్తారు ? అని మాయ అడిగింది.

"అందుకు కావలిసిన ధనం నా దగ్గిర ఉన్నది."

"అయితే నాన్నగారితో కూడా మీరే బేరం కుదుర్చుకోండి."

"నేనాయన ముఖం ఎలా చూసేది?"

"ఆయన మీ ముఖం మూడురోజులపాటు పగలూ, రాత్రీ కూడా చూశారు!"

దిలీప్ జుట్టు పీక్కుని, "నేనాయనను ఎంత అవమానించాను! క్షమించరాని అపచారం!... మాయా, నేను చచ్చిపోతాను" అన్నాడు.

"అలాగే. కాస్సేపు నిద్రపోండి." అంటూ ఆమెలేచింది దిలీప్ ఆమెను తన మీదికి లాక్కుని: "మాయా, నాలో మూర్ఖత్వమూ, బాధాతప్త ఇంకేమీ చూడలేదా?" అని అడిగాడు.

"ఇంకా ఏదైనా ఉందా?"

"ఉంది గర్వం. నీకోపానికి పరిహారం ఇచ్చుకుంటానన్నానే, అదేమిటి? దిక్కుమాలిన గర్వం?"

"దానికేం? వాయిదాలమీద చెల్లించవచ్చు- లేదా దివాలాఎత్తి తేసరి!

"దివాలా తీస్తాను, మాయా. పరిహారం చెల్లించుకోలేను."

"పరిహారం ముట్టినట్టు రసీదివ్వనా పోనీ?.. నిద్రపోండి."

మాయ ఉపాయంగా అతని కౌగిలి విడిపించుకుని, నలిగినబట్టలు సరిచేసుకుని, "ఎల్లుండి నాన్నగారు వస్తున్నారు," అన్నది. ఆమె అతనివెంట్రుకలు సరిచేస్తూ చాలా సేపు కూర్చున్నది..."

చివరకు అరుణ దిలీప్‌తో అతని జన్మవృత్తాంతం చెప్పనేచెప్పింది. అతను అంతా నిశ్చలంగా విన్నాడు; ఉద్రేకం తెచ్చుకోలేదు, అరుణ వెళ్ళిపోయాక అతను కొయ్యబొమ్మలాగా చాల సేపు నిశ్చలంగా పడుకున్నాడు. తన గదిలోకి అందరూ వచ్చి పోతున్నారు, కాని అతను ఎవరితోనూ మాట్లాడలేదు. బానుమాత్రం అతని దగ్గిరికి రాలేదు

నిజం బయటికిపొక్కాక అందరూ బాధపడ్డారు. అందరూ అతనిగురించే ఎక్కువగా బాధపడ్డారు

మూడురోజులయాక దిలీప్ బానువద్దకు తప్పటడుగులువేస్తూవచ్చి, "అమ్మా!" అంటూ ఆమె పాదాలమీదపడి, ఆపాదాలను ముద్దు పెట్టుకున్నాడు.

బాను ఆతన్ని లేవనెత్తి కౌగలించుకున్నది. అప్పుడతనికంట అశ్రుప్రవాహం వెలువడింది. బాను కళ్ళలోమాత్రం తడిలేదు.

"నాయనా! నేను చాలా దురదృష్ట వంతురాలిని; నన్ను అమ్మా! అని పిలిచి, ఎంతోపుణ్యం కట్టుకున్నావు; నువునన్ను తల్లిగా స్వీకరిస్తావనిఏనాడూ అనుకోలేదు. ఈజన్మకు నీకూనాకూ సంబంధం ఉండదనే అనుకున్నాను. దూరంగా ఉండి పోయాను," అన్నది బాను.

"ఈ అధముణ్ణి కొడుకుగా స్వీకరించావా, అమ్మా? పద, ఎవరూ ఎరుగని చోటికి ఎక్కడికైనా వెళ్ళిపోదాం," అన్నాడు దిలీప్.

"అదేం. నాయనా?"

"నాకీ ప్రపంచంలో చోటు ఎక్కడుందమ్మా?"

"ఎక్కడుందో అరుణవదిన నడుగు. ఆమె నీతల్లి కాదా?"

"తల్లే: కాని, నేను వెళ్ళిపోవటమే వాళ్ళకుమంచిది. మనం వెళ్ళకతప్పదు."

"నిన్ను ఆమెనుంచి దూరంచేసేశక్తి నాకులేదు, నాయనా? మనకు ఆమెతప్ప మరో ఆశ్రయంలేదు. మనకు మార్గంచూపగలది ఆమే '

"అమ్మా, వాళ్ళకు పిల్లలున్నారు; వాళ్ళకు పెళ్ళిళ్ళుకావాలి; మనం ఇక్కడుంటే ఎన్నిచిక్కులు! హిందువుల ఆచారవ్యవహారాలు చాలా కఠినమైనవి"

"మనం ఏదిచేసినా నాకభ్యంతరంలేదు - కాని అందుకుముందు వాళ్ళు అనుమతించాలి."

"సరే, నేను వాళ్ళతో మాట్లాడతాను," అన్నాడు దిలీప్

అరుణ దగ్గరకూడా దిలీప్ వెళ్ళిపోతానని పట్టుబట్టాడు. అరుణకు ఆగ్రహం వచ్చి, "సరే, నీకంత మూర్ఖంగాఉంటే నీ తల్లిదండ్రులను ముందు హత్యచేసి ఆ తరవాత వెళ్ళిపో... మాయసంగతి ఆలోచించావా?'' అన్నది

"ఈగొడవలన్నీ మాయకేం అర్థమవుతాయి? కొద్దికాలానికి ఆమె అంతా మరిచిపోతుందన్నాడు దిలీప్.

అతను బానును రమ్మని గబగబా బయటికివెళ్ళి బండిలో ఎక్కబోయాడు అందులో అదివరకే మాయఎక్కి కూర్చునిఉన్నది.

"బండిలో ఎక్కావేమిటి?'' అన్నాడు దిలీప్

"నాయిష్టం!'' అన్నది మాయ.

"మాయా మేము చాలాదూరం వెళుతున్నాం ''

''వెళ్ళండి, ఎవరు వద్దన్నారు?''

''నువ్వు రావటానికి వీలుపడదు.''

''మహారాజుగా వీలుపడుతుంది. నాకూ చేతులూ, కాళ్ళూ, కళ్ళూ ఉన్నాయి.''

''మాయా, నేను క్షమించటానిక్కూడా పనికిరాను నామీద నీకెందుకూ కోపం?''

''రోడ్డుమీద ఇలా మాట్లాడుతుంటే ఏం బాగుంది? మీరుకూడా లోపలికివచ్చి కూర్చోండి. లేదా, ఇంట్లోకిపోదాం, మీరేంచెబుతారో అక్కడ చెబుదురుగాని.''

ఇద్దరూ ఇంట్లోకివచ్చారు. అందరూ వాళ్ళను వింతగాచూస్తున్నారు గదిలోకివెళ్ళి తాక తలుపు గడియపెట్టి దిలీప్ ఏదో చెప్పబోయాడు

"ఆగండి. ఇలా వెళ్ళిపోదలిచానని ముందు నాకెందుకు చెప్పలేదు. ముందుగా నన్నెందుకు కలుసుకోలేదు ?'' అని మాయ అడిగింది.

"అన్నీ తెలిసి ఎందుకడుగుతావు, మాయా ? నీ జీవితాన్ని ఎలా పాడుచెయ్యను ? నాకోసం నిన్ను త్యాగంచెయ్యమని ఎలా అడగను ? అంతస్వార్థం నాలో లేదు.''

''పారిపోవటం స్వార్థంకాదు కాబోలు ?''

"నాకు మరోమార్గం లేదుగద.''

''అందరినీ వదిలి పారిపోయినట్టే నన్నూవదిలి పోదామనా ?''

దిలీప్ చేతులుచాచి, "ఏం చెయ్యమంటావో ఆజ్ఞాపించు మాయా ?'' అన్నాడు.

''మీరూ, నేనూ వేరు వేరని నాకుతెలియదు; చివరకు నన్ను బజారు కెక్కించారు !''

"ప్రాణాలు నీవీ, మాయా ! పద, ఇద్దరమూ అమ్మకాళ్ళకు నమస్కరించుదాం!"

ఇద్దరూవచ్చి భాను పాదాలకు నమస్కరించారు. దిలీప్ డాక్టరు కాళ్ళకూ, బారిస్టరుగారి కాళ్ళకూ నమస్కరించాడు.

ఆరోజు సాయంకాలమే దిలీప్‌కూ, మాయకూ వైభవంగా వివాహం జరిగిపోయింది. భాను అక్షతలమధ్య కూర్చుని, తనచుట్టూ ఉన్నవాళ్ళు వధూవరులను ప్రశంసించటం విన్నది,







# కోరల్ బీచిలో కొన్ని క్షణాలు

మాదిరెడ్డి సులోచన

ఆనంద్ ఎంతో ఉత్సాహంగా లేచి తన సామానులు సర్దుకుంటున్నాడు. అతను బాహరిన్ కు ఉద్యోగరీత్యా వచ్చినప్పటినుండీ అందమైన టెహరాను పట్టణము, పర్ష్యాస్త్రీల అందము, బేరూట్ లోని కోరల్ బీచ్ చూడాలని అనుకుంటున్నాడు. వీలుపడందే! ఒకటి రెండు సంవత్సరాలు టేప్ రికార్డు, కెమెరా వగైరాలు కొంటూ డబ్బు ఆదా చేయలేకపోయాడు. ఈసారి క్రొత్తగా వచ్చిన ఆదిల్ షాయూ అనే ముస్లిమ్ కూడా కోరల్ బీచ్ చూస్తా ననటముతో ప్రయాణమై మొదట పర్ష్యాకు రాజధానియైన టెహరాన్

చేరుకున్నారు జేబులోనుండి కింగ్ సైజ్ సిగరెట్టుతీసి వెలిగించాడు. పొగ వదులుతూంటే, అందమైన పర్షియన్ యువతి టీ తెచ్చి బల్లపై పెట్టింది కొన్ని ఇంటర్‌కాంటినెంటల్ హోటల్లలో అందమైన అమ్మాయిలు సర్వ్ చేస్తారు. టీ తెచ్చిన అమ్మాయివంక చూచాడు. ఏపిల్ పళ్ళూ, గులాబీ పువ్వులు కలబోసి చేసినట్టున్న శరీరము, దానిపై నారింజరంగు పైజమా, ఎరుపు రంగు గౌను వింతగా మెరుస్తున్నాయి. రాగిరంగు జుట్టును జడలుగా అల్లి వదిలింది. అవి తొడలను తాకి గిలిగింతలు పెడుతున్నాయి తలకు గులాబీరంగు రుమాలు చుట్టుకుంది. అమ్మాయికి అతని చూపులు వింతగా తోచాయికాబోలు! చిన్నగా నవ్వింది.

"లేచావా భాయ్?" ఆదిల్ వచ్చాడు.

"ఆహా, నా సామానులుకూడా సర్దుకున్నాను," ఆనంద్ జవాబు వినిపించుకునే స్థితిలో లేడు. అతను పర్షియా సుందరిని చూస్తున్నాడు.

"నిజంగా ఈ అమ్మాయి సౌందర్యము అద్భుతమురా: వెంటనే ఆమె చేతిని నోటిదగ్గర పెట్టుకుని చుంబించాడు.

"ఆదిల్" అదిరిపడి చూచాడు.

"ఉండరా తాతయ్యా. అందాల బొమ్మ ఎదురుగా ఉంటే గుడ్లు వెళ్ళబెట్టి చూచే నీలాంటివారినేం అనాలి" అంటూనే ఆ అమ్మాయితో బయటికి వెళ్ళి మరో పదినిమిషాల్లో తిరిగి వచ్చాడు

"ఆ అమ్మాయి ఏం అనలేదుట్రా!"

"ఎందుకురా! వారు ఇలాంటివేం పట్టించుకోరు. నీతి, ప్రాతివత్యము అంటూ మనవారే పిచ్చిగంతులేస్తారు."

"తప్పంటావా?"

"ఎవడి అభిప్రాయము వాడిది. మనకు దొరకనప్పుడు మడికట్టుకుని కూర్చోవచ్చు. అందము, ఆనందము సమృద్ధిగా దొరికేటప్పుడు ఎందుకనుభవించకూడదు? రాత్రి నా గదికొచ్చిన అమ్మాయి ఇంత అందంగా లేదురా." ఇరువురూ కలిసి మరోసారి టీ తెప్పించుకున్నారు. ఆదిల్ వంక చిత్రంగా చూచాడు అతను చాలా స్వతంత్రంగా ప్రవర్తిస్తాడు తను చేసిన విషయాలు దాచిపెట్టాలని అసలు చూడడు. అతని ముందు తాను అల్పుడుగా ఫీలయ్యాడు. వారి ప్రయాణములో ఆదిల్ ఎప్పుడూ నవ్వుతూ, మధువుకోసమూ, మగువకోసమూ డబ్బు విరివిగా ఖర్చుపెట్టేవాడు. అతన్ని చూస్తుంటే ఆనంద్‌కు అసూయలాంటి దేదో పొడసూపింది అతనికన్నా తను దేంట్లో తక్కువ? జీతము ఇరువురికీ సమానమే సర్వీసుఆనంద్‌కేఎక్కువఉంది. తనకున్న లోపమల్లా పిరికితనమని గ్రహించాడు.




"నా సామానులు ఆ అమ్మాయి సర్దుతుంది." ఆదిల్ లేచాడు ఆనంద్ మిగిలినవి సర్దేశు. టాక్సీ తెప్పించి ఇరువురూ సామాన్లు పెట్టించారు. పర్షియన్ అమ్మాయి ప్రేమనంతా కళ్ళతో కురిపిస్తూ, ఆదిల్ చేయి ముద్దిడుకుంది. ఆనంద్ మరో దిక్కు తన చూపులు మళ్ళించాడు తిరిగి అతనామె బుగ్గను సున్నితంగా తన పెదవులతో స్పృశించేడు. బజార్లో ఏమిటి, ఎబ్బెట్టుగా! అనుకున్నాడు – కాని అలాంటి దృశ్యాలు బోలెడు కనిపించాయి. ఇరువురూ ఏరోడ్రోమ్ చేరినారు. ఆనంద్ ప్లేన్‌లో కూర్చున్నా, అతనేమో ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో బాధపడసాగేడు. ఏర్‌హోస్టెస్ పానీయాలు పట్టుకువచ్చింది. ఆమెను చూస్తూ మధురంగా నవ్వేడు ఆడిల్. ఆమె మనోహరమైన చిరునవ్వు విసిరి వెళ్ళిపోయింది. ఆనంద్‌కు మండిపోయింది. నేను అంత దద్దమ్మనా! ఏదో మంచీ-మర్యాద అని ప్రాకులాడుతాను గాని విచ్చలివిడిగా ప్రవర్తించటమే నాగరికత అయితే, నేనెందుకు వెనుకంజ వేయాలి?" అనుకున్నాడు

"ఏం భాయ్! బేరూట్‌లో యెలా ఎంజాయ్ చేయాలని ఆలోచనా?" ఉలిక్కిపడ్డాడు మనసులోని మాట ఇతనికెలా తెలుసా ?– అని.

"అలా చూస్తావేం? నే నమ్మాయిని కాను," మండిపోయింది తనొక్కడే అమ్మాయిలవంక చూచేవాడూనా!

ఇరువురూ, లెబనాన్‌కు ముఖ్యపట్టణమైన బేరూట్‌లో దిగారు ఏదో

తిన్నామనిపించి, సైట్ సీయింగ్‌కి బయలుదేరేరు. కారిడార్‌లో నిల బడి హోటల్ వెనకవైపు చూచాడు ఆనంద్. స్విమ్మింగ్ పూల్ ఉంది. స్త్రీ పురుషులంతా స్విమ్మింగ్ కాస్ట్యూమ్‌లో అతిసహజంగా తిరుగుతున్నారు

"అక్కడ అమ్మాయిలతో ఈదుతావా?"

"ఛీ! అంతమందిలో అమ్మాయిలతో ఏకాంత మెలా లభిస్తుంది?" ఆనంద్ మాటలకు ఆదిల్ నవ్వాడు, పకపకా, పడిపడి నవ్వాడు.

"యెందుకా నవ్వు?" చిరాకుగా చూచాడు

"నీ తెలివికి? నువ్వేదో చక్రవర్తి వయినా బావుండేది. ఒక రోజంతా ఏకాంతము కలిగించేవారు."అన్నాడు. అందమైన బేరూట్ పట్నం చూచారు. ఫ్రీ పోర్టుంది. అన్నిటికన్నా సౌకర్యమేమిటంటే - ఏ దేశపు నాణ్యమైనా అక్కడ చెల్లుతుంది. షాపింగ్ కూడా చేశారు.

"తరువాత కొనవచ్చు. కోరల్ బీచ్ చూద్దాము రా" ఆనంద్ తొందర చేశాడు.

"అలసటగా ఉంది, రేపు" ఇరువురూ హోటల్‌కు తిరిగివస్తుండగా పుస్తకా లమ్మే అబ్బాయి కనిపించాడు. అన్నీ చదివిన పుస్తకాలే కనిపించాయి. వెతికి, వెతికి రెండుపుస్తకాలు తీసుకున్నారు. విల్కీ కాలిన్స్ రచించిన 'మూన్ స్టోన్' 'ఘోస్ట్స్' అని మార్టిన్ ఎబోన్ చే సేకరించబడిన నిజమైన అనుభవాలు. మరో పుస్తకము కొన్నారు. భోజనముచేసి గదులకు వెడుతుండగా ఆదిల్ మరో బాణము విసిరాడు.

"ఘోస్ట్స్ చదవకు బాబూ, భయపడుతావు"

ఒళ్ళు మండిపోయింది. "ఫరవా లేదు. అదే చదవాలి." తెచ్చి రాత్రంతా చదివాడు. అమెరికన్, బ్రిటిష్‌వారు అందరూ ఒకే అభిప్రాయము వెలిబుచ్చారు దయ్యాలున్నాయి. వాటిని తాము మరో రూపములో చూచామని. మూడు గంటలకు పుస్తకం మూసి నిద్ర పోయాడు. మర్నాడుదయమే లేచి బీచ్ కెళ్దామంటే ఆదిల్ స్విమ్మింగ్ పూలులో దూకాడు. అతను బయటికి వచ్చాక, ఇరువురూ కోరల్ బీచ్ కెళ్ళారు. ఆనంద్ కనులపండువుగా చూచాడు.

"ఎప్పుడూ పచ్చని వృక్షాలనే కాంచాము గాని, శ్వేతవృక్షాలను చూడలేదోయ్ నిజంగా తెల్లగా ఎంత బావున్నాయి!" కోరల్స్‌ని పట్టుకు చూచాడు.

"అవి ప్రాణమున్నవని తెలుసా?"

"నాకేం తెలియదు నీకే తెలుసు." ఉడుక్కున్నాడు. జంటలు, జంటలుగా

జనము తిరుగుతున్నారు. కొందరు కూర్చుని చల్లని పానీయాలు త్రాగుతున్నారు ఇరువురు ఓ చోట కూర్చుని వింతగా చూస్తున్నారు ఏం గుర్తు కొచ్చిందో- ఆదిల్ లేచాడు.

"ఇప్పుడేవస్తాను." త్వరగా మరో దిక్కు వెళ్ళిపోయాడు జనసంచారానికి దూరంగా ఆనంద్ కూర్చున్నాడు. సన్నని మృదువైన నవ్వు వినిపించింది వెనుతిరిగాడు. మొదట రబ్బరుబొమ్మ అని భ్రమపడినాడు. కాని చిన్ననోరు విచ్చుకుని, సన్నని నవ్వు విసిరింది కళ్ళు తాటించి చూచాడాసుందరి వంక; గులాబిరంగు వర్ణముతో, వొత్తయిన జుట్టు జడలురెండు చెంపలమీదుగా జారి,వక్షస్థలాన్ని గిలిగింతలు పెడుతున్నాయి. బిగుతుగా ఉన్న నల్లరంగు పైజామా చమ్కీలు కుట్టినది వేసుకుంది. లేతపసుపురంగు చొక్కా తొడిగింది. చిన్ననోరు, సన్నని నాసిక, మొనతేలిన గడ్డము, మానవకాంత కాదనిపించింది.

"చూపులతోనే తిని వేస్తారా?" గండుకోయిలలు కూశాయా అన్నట్టుంది. లేచి మర్యాదగా చెయ్యి అందిచ్చాడు. ఆమె తన మృదువైన హస్తము అతని చేతిలో ఉంచింది. తన చర్యను ఎవరైనా చూస్తూ ఉండవచ్చునని సంకోచంగా నలుదిక్కులా చూచాడు. చూస్తే చూశారులే- అనిమొండి ధైర్యము తెచ్చుకున్నాడు. కిలకిలనవ్వింది. దూరమునుండి వెస్టర్న్ మ్యూసిక్ వినిపించింది. ఆమెను మరీ దగ్గరకు లాక్కున్నాడు. ఆమె చొరవగా తన చేతులు అతని భుజాలమీద వేసి, అధరామృతము అందించింది అతను, సర్వము మరిచిపోయాడు. తనులతను తన బలమైన బాహులలో బంధించాడు. మోటుగా ప్రవర్తిస్తే ఆమెకందిపోతుందేమోనన్నంత మృదువుగా ఆమె బుగ్గలు చుంబించాడు. పట్టులా మెత్తగా ఉన్న ఆమె జుట్టును పిడికిలిలో బిగించాడు.

"నీ పేరేమిటి?"

"ఫరహా. బావుందా?"

"నీకంటె అందంగా లేదు."

"థాంక్స్.ఫర్ ది కాంప్లిమెంట్స్:" నవ్వింది - తళతళలాడుతూ, తెల్లగా మెరిశాయి పళ్ళు.

"ఈ కొరల్సుకంటె తెల్లగా ఉన్నాయి నీ పళ్లు.

"ఊఁ మీ జుట్టు చాలా అందంగా ఉంది. నాకు నల్లని జుట్టంటే చాలా ఇష్టము"

"వద్దు. నీ అందము ఇనుమడిస్తుంది. దృష్టి పడుతుంది." పక, పక నవ్వింది. చుట్టూ పువ్వులవాన కురిసినట్టు ఫీలయ్యాడు.

"మీ రిలాంటివి నమ్ముతారా?" అతని ఛాతిపై తల ఆన్చి అడిగింది.

"అదే-దృష్టి, గిష్టి," అతన్ని పచ్చిక పైకి నెట్టింది.

"నేను నమ్మే దేమిటి? శాస్త్ర వేత్తలుకూడా నమ్మారు. దయ్యాలు, భూతాలు ఉన్నాయని "

"ఎవ రా శాస్త్రవేత్తలు." కిలకిల నవ్వింది.ఆ నవ్వుకు ముగ్ధుడై చూచాడు. ఆమెనుమరింతదగ్గరకు లాక్కున్నాడు.

"పోనియ్, ఇప్పు డా విషయా లెందుకు!" ఆమె మెడపై గిలిగింతలు పెట్టాడు. నిజంగా ఆమెతో స్వర్గపు చివరిమెట్టువరకు పయనించాడు యౌవ్వనాన్నిసార్థక పరుచుకున్నాడు. దూరముగా పదముల సవ్వడి అయినది

"మీ కళ్లు చాలాసలుపు అవంటే నా కెంతో ఇష్టం," అతనిపైకి వంగి రెప్పలు మూసి, మృదువుగా ముద్దు పెట్టుకుంది. తన్మయత్వముతో అలాగే కళ్లు మూసుకున్నాడు.

"ఫరహా...డార్లింగ్..." కాస్సే పాగి పిలిచాడు

"అరె భాయ్! అయిద నిమిషాలు సిగరెట్టు లేకుంటే ప్రాణంపోతుంది." హుస్సురంటూ కూలబడినాడు- ఆదిల్ పాయి. ఆనంద్ కళ్ళువిప్పి ఫరహా కోసము చుట్టూ చూశాడు.

"ఏమిటలా చూస్తున్నావు?" ఆదిల్ సిగరెట్టు వెలిగించాడు.

"అరే...ఏది ఫరహా .." ఆత్రంగా చూశాడు.

"ఎవ రా ఫరహా?"

"ఎవరని చెప్పేది? అందాల బొమ్మ, ఆనందానికి నెలవు. ఒహో! ఏమని వర్ణించేదా అందము."

"ఆనంద్! కలగాని వచ్చిందా?" భుజాలు కుదిపాడు

"నేను నిదురబోయానని అనుకున్నా వేమిటి?"

"మరి నీ మాటలు అలాగే ఉన్నాయి. నేను అంతదూరమునుండి చూస్తు న్నాను కళ్లుమూసుకుని పడుకు న్నావు "

"అయితే నువ్వు రావటము చూచి ఆ అమ్మాయి వెళ్ళిపోయి ఉంటుంది ఆదిల్ భాయీ!" ఆ అమ్మాయి ఎలా వచ్చిందో, యెలా తనను ఆనంద పరిచిందో చెప్పాడు. జాగ్రత్తగా విని, పడిపడి నవ్వాడు ఆదిల్ .

"బావుందోయ్ నీ ఊహాగానము. ఓపిక చేసుకుని పేపరుమీద పెట్టి, ఏ పత్రికకో పంపు."

"ఆదిల్!" గట్టిగా అరిచాడు. "నామాట నమ్మవేం?" నేను చెప్పింది నిజము ఉండు ఆ అమ్మాయి ఎక్కడో ఉంటుంది," త్వరగా లేచి చుట్టు ప్రక్కల గాలించాడు. ఎక్కడా కని పించ లేదు.

"నేను అలా తిరుగుతుంటే పట్ట నట్టు కూర్చుంటా వేం?"

"నువ్వు చెప్పేవి నమ్మటంలేదు.




ఆఁ, నేనో అరగంట అలా వెళ్ళితే, నువ్వు చెప్పినవన్నీ నమ్మేవాడిని. అయిదంటే, అయిదునిమిషాలే వెళ్లాను."

"అబద్ధము, ఆమె నాతో యెన్నో కబుర్లు చెప్పింది."

"కావాలంటే టైమ్ చూడు. మనముహోటల్ నుండి వెళ్ళికూడాఅర గంట కాలేదు." ఆనంద్ వాచీవంక చూచుకున్నాడు. అతనిమతిపోయింది.

"అంతా మాయగా ఉందే!" ఆనంద్ ముఖము వెల వెలబోయింది. అయితే తానా అందాలసుందరితో గడిపింది కొన్నిక్షణాలేనా? కొన్ని గంటల్లా యెందుకు ఫీలయ్యాడు?

"రాత్రి మేలుకుని 'ఘోస్ట్సు' చదివావు. దాని ప్రభావమే."

"కాదు - ముమ్మాటికి కాదు," అరిచాడు.

"అభిమాన మెందుకోయ్? ఎంతటి వారికైనా - అలాంటి అనుభవాలు కలుగుతాయి. టాగూర్ వ్రాసిన 'హంగ్రీ స్టోన్స్' చదువలేదూ?"

"అది వేరు. నేను ప్రత్యక్షంగా చూశాను. ఆ అమ్మాయి అందించిన అనుభూతి, ఇంకా నా హృదయంలో సజీవంగా ఉంది?"

"అయితే ఆ అమ్మాయి ఏ భాషలో మాట్లాడింది?''

"ఎందుకు? తెలుగులో," ఆనంద్ మాటలకు విచిత్రంగా నవ్వాడు ఆదిల్.

"బావుంది భాయి నీ కల్పన! పర్షియా దేశపు అమ్మాయికి తెలుగు వచ్చునా?" ఈసారి ఆనంద్ ముఖము మరీ పాలిపోయింది.

''నిజము ఆదిల్ నన్ను నమ్ము."

"సరే నా స్నేహితుడివి కాబట్టి నేను నమ్ముతాను. కానిమ రెవరితో చెప్పకు. ఇక నువ్వు చూచిన ఏ విష యము చెప్పినా యెవరూ నమ్మరు. పోనీ ఆమె యెవరో చెప్పిందా?"

"నేను అడగందే! ఆ అమ్మాయి యెప్పుడైనా మన ఆంధ్రలో ఉండి వచ్చిందేమో..."

"ఇక నీ ఇష్టము వచ్చినట్టు అనున యించుకో. నీ ముఖం అప్పుడే పది లంఖణాలు చేసినట్టుంది., పద కాస్త బీర్ తీసుకుందాము" ఆదిల్ ముందుకు నడిచాడు. ఆనంద్ నిస్పృహగా అతన్ని అనుసరించాడు. అతని మనసులో రొన్నో ప్రశ్నలు ఉవ్వెత్తువ లేస్తు న్నాయి. ఒక్కదానికీ జవాబు లభించ లేదు. తను నిజంగా కలకన్నాడా? తన మనసు బలహీనతకు లోనై అలా ఊహిం చిందా?- ఎటూ తేలటములేదు తాను అనుభవించినది వాస్తవమని చెప్పడా నికి సాహసించలేక పోతున్నారు. కోరల్ హోటలు క్రింది భాగములో కూర్చుని, రెండుగ్లాసుల బీర్ పట్టిం చారు.

"ఆ విషయము మరిచిపో భాయి. సినిమా చూద్దామా! అరబ్ సినిమాలు కూడా చాలా బావుంటాయి. కిస్సింగ్, వగైరాలు, ఇంగ్లీషు సినిమాలను మించి ఉంటాయి," ఆదిల్ ప్రస్తావ నకు యాంత్రికంగా తలూపాడు. బిల్లు చెల్లించి బయటకు వచ్చారు. డ్రై ఫ్రూట్స్ కొన్ని పేక్ చేయించారు బీచిని వదులుతుంటే యేదో పోగొట్టు కున్నట్టు బాధపడ్డాడు ఆనంద్. మ రెవరో ఇంగ్లీష్ స్త్రీ ఆదిల్‌ను ఏదో ఇన్ఫర్మేషన్ అడుగుతూంది. దూరంగా నిల్చుని ఫ్రూట్స్ అమ్ముతున్న ఓ పెద్ద తను ఉర్దూలో మాట్లాడటము చూశాడు, అతను మర్యాదస్తుడిలా కనిపించాడు. అతని దగ్గరగా వెళ్ళి, వినయంగా సలామ్‌కొట్టి, తనను, ఆనంద డోలి కలో ఊగించిన అమ్మాయిని వర్ణించి వివరాలు అడిగాడు. అతను చిత్రంగా ఆనంద్‌వంక చూశాడు.

"ఆమె వివరాలు మీ రెలా సేక రించారు. పదేళ్ళ క్రితము చనిపో యింది..." ఆనంద్ అతనివంక చూడ లేక పోయాడు, నిలువెల్లా వణికి పోతూ ఆదిల్ దగ్గరకొచ్చాడు;ఆదిల్ కా విషయము చెప్పవద్దనే అనుకున్నాడు.

"ఏం భాయ్! అలా వణుకుతు న్నావు?"

"చలిగా ఉంది," తన భావాలను కప్పిపెట్టే ప్రయత్నము చేశాడు.

"నా కయితే మహా ఉక్కగా ఉంది,"ఇరువురూ రూమ్ చేరారు. ఆదిల్ టాయిలెట్ మొదలుపెట్టాడు. ఆనంద్ కోరల్ బీచ్‌లో గడిపిన కొన్నిక్షణా లను మననము చేసుకుంటూ కళ్ళు మూసుకొన్నాడు.






# నెలవుకొన్న కలలు!

కె. రామలక్ష్మి

ఉదయం లేచింది మొదలు ఒకటే హడావిడిపడుతూంది పార్వతి - పన్నెండుగంటలలోపల అమ్మ రాదేమోనని.

"ఆవిడ రాకపోతే నే చూసుకుంటా లేవోయ్. ఏమిటా ఖంగారు?" గెడ్డం గీసుకుంటూ అడిగాడు కృష్ణమూర్తి.

"ఏ లేదు. ఈరోజు మేం కలుసుకోకపోతే మళ్ళీ ఎప్పుడు కలుసుకుంటామో కప్పు ఊరికి వెళ్ళిపోతుంది ఉప సెలవులు కూడా అయిపోతాయి. బీరకాయలు చెక్కుతీస్తూనే అంది పార్వతి.

"పోనీ నువ్వు ఫ్రీగా ఉన్నావుగా? ఓసారి ఆవిడనీ ఓసారి యీవిడనీ చూసేసివద్దువుగాని" తేలికగా అన్న కృష్ణమూర్తిని కొరకొర చూసింది పార్వతి ఆమె చూపు తిప్పుకొనేలోపల సన్నగా కన్నుకొట్టి ఊరుకున్నాడు- కృష్ణమూర్తి.

"చూస్తున్నాంగా- ఈ యింట్లో ఓ అరగంట ఎక్కడైనా వెళ్ళిరావాలంటే ఎంత ప్లానింగుచేయాలో?" కోపంగానే అంది పార్వతి

"అందుకే ప్లానింగో అంటే విన్నావా ఏమిటి నువ్వు? కాలెండరు పాపల్లాంటి పిల్లలో అంటూ...మాట పూర్తి కానివ్వకుండా బాత్‌రూము

తలుపులు జేరవేసి చక్కాపోయింది పార్వతి. సిగ్గుతో ఆమె బుగ్గలు ఎరుపెక్కి ముఖం జేవురించింది. ఉదయం నుంచీ పొయ్యిదగ్గరే ఉందేమో ముఖం చిరుచెమటలతో తడిసి మెరుస్తూంది చీరకొంగుతో ముఖం అద్దుకుని కూరని పొయ్యెక్కించేపని ప్రారంభించి కృష్ణమూర్తి మాటలకి నవ్వుకుంది...

అప్పుడే వంటగదిలోకి వస్తూన్న కృష్ణమూర్తి, ఆ నవ్వుచూసి భార్య దగ్గరకి చేరాడు.

"ఏమిటాజోరు ? చెప్పు" అంటూ నిలదీశాడు – కృష్ణమూర్తి. టిఫిను ప్లేట్లోసర్ది బల్లమీద పెట్టింది.

'నువ్వు ఎందుకు నవ్వావో చెప్తేగాని టిఫిను ముట్టుకోను' భీష్మించాడు.

"ఏంలేదు. ఉట్టినేనే. ఏం నవ్వకో కూడదా ఏం?" అంటూ ఎదురుప్రశ్న వేసినా పార్వతి ముఖం వింతగా వెల్గుతూ దాగనంటూన్న ఏదో రహస్యాన్ని రహస్యంగానే తెలియ చేసేస్తూంది.

చెప్తేనేనూ నవ్వుతానుగా ? భర్తకి టిఫిను పెట్టి తమ్మిల్లో పొద్దుపోలిన ముఖంతో భారతనారి పక్కన నిలబడాలని ఏ కే.రా. ఏనా రాసిందా ఏం కొంపతీసి !" అడిగాడు.

"మధ్యాహ్నం భోజనం నుంచి వచ్చాక చెప్తానులే."అనేసింది పార్వతి.

"ఇందాకా షేవ్ చేసుకుంటూఉంటే నాకో ఆలోచన వచ్చింది పార్వతీ. ఇన్నేసి ఉత్తరాలు రాసుకుంటారు. అవకాశం దొరికినప్పుడల్లా కలుసుకుంటారు. ఈపూటభోజనం ప్రోగ్రాం కోసం ఎందుకంత ఆత్రపడుతున్నావో అన్నదే– ఆలోచన. చెప్పు, ఎందుకు ? ఈ భోజనానికీ నా యిప్పటి సగం స్వగతం నవ్వుకీ లింకుఉంది– అవునా ? సానునయంగా అడిగాడుకృష్ణమూర్తి.

"ఏంలేదు కృష్ణా–అసలుపిల్ల లేవిటి నాన్సెన్స్ – అనే ఉప ప్రసవించడానికి సిద్ధంగాఉంది. వన్ మినిమమ్, టు మేక్సిమమ్ – అనే కల్పకం మూడోసారి ముచ్చటగా కదుపుతోంది సరి కదా ఈసారి ఆడపిల్ల కావాలంటూ అందరిదేవుళ్ళకీ మొక్కుతోంది. ఇదంతా జ్ఞాపకంవచ్చి..." పార్వతి మాటని మధ్యలోనే ఆపి.

"మరి నీసంగతి" అంటూ ఆమెని దగ్గరకి తీసుకున్నాడు–కృష్ణమూర్తి.

"అది సాయంత్రంగాని..." అంటూ అతని కౌగిలి విడిపించుకుని వంటమీదకి ధ్యాస మళ్ళించిందిపార్వతి.

అమ్మరావడం కృష్ణమూర్తి ఆఫీసుకువెళ్ళడం ఒకేసారి జరిగాయి.

"సాయంత్రం త్వరగా వస్తాను. యిల్ బ్రయినల్ కత్తిపోటు సినిమాకి టికెట్లుకూడా తెస్తాను. అక్కడే ఉండిపోకు" అంటూ పార్వతిని హెచ్చరించి




మరి వెళ్ళాడు. కృష్ణమూర్తికి ఒక భయం ఉంది - పార్వతి స్నేహితురాళ్ళంటే వాళ్ళు అలాంటివాళ్ళు. బొమ్మల చేత కూడా మాట్లాడించే రకాలు!

కృష్ణమూర్తిని సాగనంపి తల్లితో కబుర్లుచెప్తూ అద్దంముందు కూర్చుంది. 'ద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకుంటూంటే ఏమేమిటో జ్ఞాపకం రాసాగాయి పార్వతికి.

"అదేమిటే అలా పరధ్యాన్నంగా కూర్చుండిపోయావు త్వరగా తెమిలి వెళ్ళు," అంటూ వంటిల్లు సర్దుతూ హెచ్చరించారు పార్వతి తల్లి.

"ఏం లేదమ్మా - ఉష చదువుకునే రోజులకన్నా అందంగా హుందాగా తయారైంది కప్పుకూడా సందుగా తీపిగా కన్పిస్తుంది. నేనుమటుకు ఇలా ఎందుకయ్యాను?" తనని తానే ప్రశ్నించుకున్నట్టు తల్లిని అడిగింది పార్వతి

"పిచ్చి! నీకు మటుకు ఏంలోటు? చదువుకునేటప్పటి నీకూ, ఇప్పటి నీకూ ఏం తేడా లేదు; కావలిస్తే నీ స్నేహితులనే అడుగు. కొంచెం బొద్దుగా తయారయ్యావు అంతే లేవే. త్వరగా తెమిలి వెళ్ళు. నేను వెళ్ళేక తలుపు తాళం వేసి బాబిగాణ్ణి

స్కూలునుంచి తీసుకువస్తాను," అన్నదామె.

తన రహస్యం తల్లికి చెప్పాలా? అప్పుడే చెప్పకూడదా? అన్న సందిగ్ధంలో పడిపోయిన పార్వతి యాంత్రికంగా అలంకరించుకుని చెప్పుల్లో కాళ్లు దూర్చింది

"అదేమిటే? ఎంతో సరదాగా వెళ్ళవలసినది - అలా దిగులుపడి వెడుతున్నావు? వెళ్ళి హాయిగా నాలుగ్గంటల దాకా వాళ్ళతో గడిపి రా," అంటూ కూతుర్ని సాగనంపారు

కల్పకం ఇంటికి అట్టే దూరంలేదు. అయినా రిక్షా ఎందుకని టాక్సీ ఆపి ఎక్కింది పార్వతి. అంతులేని ఆలోచనలు ఒక కొలిక్కి రాకముందే టాక్సీ కల్పకం యింటిముందు ఆగింది వాణ్ణి పంపి గుమ్మంలో అడుగెట్టిందో లేదో-అమాంతం స్నేహితురాళ్ళిద్దరూ మీద పడ్డారు-'ఇంత లేటా?' అంటూ-'ఏదీ-తెమిలేసరికింత అయింది - లోపలికి రానిస్తారా?' అంటూ హాల్లోకి నడిచి కుర్చీలో కూలబడింది

అదిమొదలు కాలం స్తంభించిందో! రాకెట్ వేగంతో పయనించిందో - ఆ ముగ్గురిలో ఎవరూ గమనించే స్థితిలో లేరు; ఒకటే కబుర్లు, ఒకటే నవ్వులు, ఒకటే గోల.

ఆఖరికి కల్పకం అమ్మగారు అన్నారు.

"మీ పిచ్చికూలా, ఒకళ్ళ తరవాత ఒకళ్లు మాట్లాడకూడద్రా," అంటూ.

"మీ కర్థం అవుతుందండీ,'' అంది కూర్చోలేకుండా లేవలేకుండా అవస్థ పడుతున్న ఉష. నిండుగా వర్షించడానికి సిద్ధంగావున్న మేఘంలాగా, పండినపండు చివరికొమ్మన వేలాడుతూ ఎప్పుడు రాలుతుందా-అన్నట్టు ఉంది ఉష అయినా అలసటగాని ఉత్సాహంలేమిగాని లేవు అదీ చూడ ముచ్చటగా ఉన్నసంగతి.

"పిల్ల లేవిటి నాన్సెన్స్ అన్నావే?" అంటూ వేళాకోళం చేసింది పార్వతి.

"నా కేంతెలుసు నువ్వు నానిగుడ్డ ఇచ్చి ఉంటే ఈ అవస్థ తప్పేది నాకు" అంది ఉష. పిల్లలూ, ముచ్చట్లూ ప్రసవాలూ ఇవి తప్పించి వేరేమాటలే రావడంలేదు మహావక్త్రీ ఖర్తలగొడవ-ఆశ్చర్యం వేసింది పార్వతికి.

"కాలేజిలో హాక్సలీ, మెకాలే అంటూ కాకిగోల చేసే మేమేనా ఇలా మాట్లాడుతున్నది" - అనుకుంది

"ఏమిటే వచ్చిన దగ్గరనుంచి చూస్తున్నాను-ఏదోలా ఉన్నావ్?" కల్పకం పార్వతిని నిలదీసింది.

"అప్పుడే మూడుదాటుతోంది - నే వెళ్ళాలి." అంటూ లేవబోయింది పార్వతి.

"నే నడిగినదానికి బదులుచెప్తేగాని



వెళ్ళనీయను," కూర్చోపెట్టేసింది కల్పకం.

"ఏం లేదే. మనం కాలేజీలో చదివే రోజుల్లో ఎలామాట్లాడే వాళ్ళమో - ఇప్పుడూ అలాగే మాట్లాడుతున్నాం - కాని వాటికీ ఇప్పటివాటికీ ఎంత తేడా!" అంది పార్వతి -

"మై గాడ్ ! అవునుసుమా - ఉట్టి వెజిటబుల్స్‌లాగా తయారైపోయినట్టుంది. ఏం పార్వతీ!"

"అవునే. ఇంటలెక్చువల్ కంపెనీ

లేకపోతే ఇలా తయారవక తప్పదు, అంది కల్పకం.

"ఇంటిదగ్గరలేను పోనీ మనం కలిసినప్పుడేనా ఏం మాట్లాడాం?" అంది పార్వతి

"ఇదా-ఆలోచిస్తున్నావు? నీకేం? హాయిగా పిల్లలిద్దరూ స్కూలుకి వెళ్ళిపోతారు. ఆయన ఆఫీసు. ఇంట్లో కూర్చుని మెదడికి పదును పడ్తూ ఉంటావు." అంది కల్పకం.

పేలవంగా నవ్వింది పార్వతి. తన సంగతిచెప్తే నవ్వుతారేమోఅని భయం ఒకపక్క;చెప్పకుండా ఎలా? అని ఓ పక్క -

"నే వెళ్ళేముందో వార్త చెప్పి వెళ్ళాలి నువ్వు. ఉష్ - నన్నూ మీ జాబితాలో చేర్చండి" అంటూ లేచి నిలబడి చీర సద్దుకుంది.

ఓ క్షణంపట్టింది పార్వతి మాటలుకు అర్థం చేసుకుందుకు - స్నేహితురాలిద్దరికీ

'మై గాడ్! ఇంత మంచివార్త ఎలాదాచగలిగావు పార్వతీ?" అంటూ ఉష అమాంతం కౌగలించుకుంది. కల్పకం మళ్ళీ కూర్చోపెట్టేసింది.

"మీరు నవ్వుతారేమోనని భయం వేసింది," అంది నెమ్మదిగా.

"నవ్వడమా? ఎందుకూ?" అర్థం కాలేదు కల్పకానికి.

మనం ఎంతెంత ఆదర్శాలు వల్లించే వాళ్ళమే నా మటుకు నేను..." నసిగింది పార్వతి సిగ్గుతో ఆమెముఖం కందిపోయింది. సిల్లీగా ఆలోచిస్తావేంటి పార్వతీ? కాలేజీ జీవితానికీ సబంధంఏమిటి? దానిదారి దానిది దీనిదారి దీంది - కొట్టి పారేసింది కల్పకం,

"అది గాదే - ఇద్దరితో చాలనీ, మళ్ళీ చదివి - ఇంకా చదివి..."

"ఇఘోరించావులే, ఇటువంటి ఎదురుచూడని తీయని సంఘటనలే హాయిమనిపిస్తాయి." అంటూ యీ సువార్త చెప్పడానికి లోపలికి వెళ్ళింది కల్పకం.

"అయితే ఈసారి అమ్మాయితప్పదు" అంది ఉష

చూడాలిమరి - నా కెంతపిరికితనం తోచిందో తెలుసా ఉషా? మీరు నన్ను వేళాకోళం చేస్తారనీ. ఓ ఆట పట్టిస్తారనీ భయపడ్డాను అంది

"ఆటపట్టించడానికి నీ లో ఏం ఏమిటి పార్వతీ? ప్రసవవేదన కష్టం తల్చుకున్నప్పు డెందుకొచ్చిన పీక ఇది అనిపించినా నీ పిల్లల్ని చూసి - అది మరిచిపోతున్నాను నేను అలాంటిది నువ్వు కనీ బాధపడికూడా మరిచి మాతృత్వం అమృతంలాగా స్వీకరిస్తున్నావు. కుచేలసంతతివద్దుగాని ముచ్చటగా ముగ్గురుండడానికేం?'' పార్వతి భుజంమీద చెయ్యివేసి కూర్చుంది ఉష.



మిఠాయి. రవికెలబట్టా, పళ్లూ. తాంబూలము పెట్టి కల్పకం తాంబూలం అందించారు.

"మళ్ళీ ఉషకు పుట్టబోయే పాపకి పేరు పెట్టినప్పుడు అది పిలుస్తే కలిసి ప్రోగ్రెస్ చర్చిద్దాంలే పార్వతీ - ఈలోగా చిన్నచొక్కాలు నట్టుకు నేను కుట్టాలి-" అంటూ స్నేహితురాల్ని సాగనంపింది కల్పకం ఉషని కూడా అదే టాక్సీలో ఎక్కించి దారిలో దింపి, పార్వతి ఇల్లు చేరేసరికి ఏడుగంటలు దాటిపోయింది.

హాల్లో కూర్చుని పేపర్లు తిరగేస్తున్న కృష్ణమూర్తి పార్వతి రాకతో పేపరు టేబిలుమీద పడేసి లేచాడు

నే చెప్పలేదూ-మీ ముగ్గురూ చేరితే అంతే'' అన్నాడు నవ్వుతూ.

'అవునే అమ్మాయి! సినిమాకన్నాడుటగా - త్వరగా రాకపోయావూ," నిష్ఠురంగా అన్నారు పార్వతితల్లి.

"లేదమ్మా-ఆకబురూ ఈకబురుతో ఆలస్యం అయిపోయింది. ఈరోజు

ఎక్కడికీ కదలలేను కృష్ణా!" అంది దీనంగా.

'పోనీలేవోయ్, మళ్ళీ ఆదివారం వెడదాం నేను అత్తయ్యని దింపేసి వస్తాను-' అన్నాడు కృష్ణమూర్తి. అమ్మయ్య! అనుకుంది పార్వతి.

ఆ రాత్రి పిల్లలు నిద్రపోయాక కృష్ణమూర్తి కౌగిట సర్దుకుంటూ అంది "మేం ముగ్గురం ఒకే పడవలో ప్రయాణం చేస్తున్నాం-కృష్ణా" అని.

"అంటే" ముఖంమీద పడుతున్న జుట్టు సవరిస్తూఅడిగాడు-కృష్ణమూర్తి.

"అంటే అంతేమరి కల్పకానికి ఆరో నెల. ఉష నేడో రేపో-అంటూంది నేనేమో."

"అమ్మదొంగా చెప్పలేదేం? ఇలాంటివి నాకు కదా ముందుచెప్పాలి?" అంటూ పార్వతిని ఆవేశంతో ముద్దు పెట్టుకుని ఆనందం వెలిబుచ్చాడు.

"నీ కొత్తకారు ప్లాను తలక్రిందు లవుతుందని విసుక్కుంటావని చెప్ప లేదు కృష్ణా - మళ్ళీ ఐదువేలు డిపాజిట్" నవ్వుతూనే అంది పార్వతి.

"ఈపటికీకలస్పృష్టించుకున్నాంగా! వచ్చేపడు కొందాం కారు. మరేం మునిగిపోలేదు - మనమేం ముసలా ళ్ళమా ఏమిటి?'' చిలిపిగా నవ్వుతూ అన్నాడు కృష్ణమూర్తి.

"వాళ్ళు నవ్వుతారేమో అని ఎంతో బెంగ అనిపించింది. నా ఆనందంకంటే వాళ్ళదే ఎక్కువగా తోచింది తరవాత. గుండెలమీంచి బరువు దించినట్టు అనిపించింది. అంతే కాదు-నాకూ ఇప్పుడు ఎంతో ఉత్సాహంగాఉంది.'' కృష్ణమూర్తి జుట్టు నిమురుతూ తనఊహలు పైకిచెప్తూంది పార్వతి...

"అయితే వచ్చే వారం వెస్టర్న్ వద్దు అలాంటివి చూసే నానిగాడిలాంటి రౌడీని కన్నావు. ఈ సారేనా?" "పతివ్రతల కథలు చూద్దాం-సరేనా?" అంటూ బెడ్ లైట్ పెట్టడానికి లేచాడు కృష్ణమూర్తి.

'అయితే సినిమా చూడ్డమేపడదు' అంది పార్వతి నవ్వుతూ.

"ఏం?''

"రంభా ఊర్వశిల్లాంటివారిపక్కనే శూర్పణఖల్ని తెచ్చి పెడతారుగా? అవీ ఇవీ విడిగా ఉండడం లేదుగా మరి ఎలా?" సర్దుకు పడుకుంటూ అడిగింది పార్వతి.

"అయితే పడుకోబోయేముందు కుమారీశతకం చదివి విన్పిస్తూ ఉంటాను" అన్నాడు కృష్ణమూర్తి చిలిపిగా -

"పోదురూ! మీరు మరీనీ!" అన్నది పార్వతి అలకనవ్వుతో






సాయంకాలం అవుతోంది.

సూర్యుడు పడమటికొండమీద ఎర్ర ముగ్గులు దిద్దుతున్నాడు.

బారులుతీరి పక్షులు గూళ్ళకి చేరుతున్నాయి; దారితప్పిన కొంగ రోదిస్తూ మళ్ళీ తన బారులో చేరుతోంది.

గాలి చల్లగా కదులుతోంది; కార్తీక సంధ్యాకాంతులలో వచ్చే చల్లగాలికి తలలూపే కొతిమీర మొక్కలు సువాసన లీనుతున్నాయి. పక్కనే సిగ్గునిండిన పెళ్ళికూతురు బుగ్గలా గులాబీ వికసించే ప్రయత్నంలో ఉంది. కొంచెం ఎడంగా ఉన్న మందారం విరబూసి సంధ్యారాగారుణకాంతులను పరిహసిస్తోంది.

నవ్వుతూన్న మందారాన్నీ, నవ్వబోయే గులాబీ మొగ్గను చూస్తూ, కొతిమీర

మడి మీదనుండి వచ్చే వాసనల మత్తుతో ఆలోచనా నిమగ్నుడై కూర్చున్నాడు ఆనందరావు. పడకకుర్చీ ఊగిస లాడిస్తూ, ఆ ఊపుల ఊయెలలో ఉరకలు వేసే ఊహలకు రూపకల్పనచేసి కాగితం మీది కెక్కించడానికి యత్నిస్తోంది, అతని మనస్సు. సుమారుగా రెండేళ్ళయింది. కలంపట్టి రెండు సంవత్సరాల క్రితం...

* * *

ఆరోజున — యిటువంటి సాయం సంధ్యారుణరోచులు జిమ్మేసమయంలో, ఎలమావితోటలో, నెలవంక కాంతిలో, బంగారు లతవోలె, సింగారముగ నిల్చి సిగ్గుచూపులతోడ, బుగ్గజేర్చినభామ...

పులకించింది ఆనందరావు శరీరం, ఈ ఊహతో...అలా ప్రకాశించి, తన జీవిత భాగస్వామినియై, హృదయేశ్వరిగా నిలిచిన మంజుల....

అంతవరకూ ఊహాసాగరంతో కలం అందుకుని కాగితంమీదికి నడిపించాడు. ఎదురుగా, నందివర్ధనం దగ్గర, కనకాంబరాలు కోసుకుంటున్న మంజుల. ఆయన ఆలోచనలకు అంతరాయం కలిగించకూడ దనుకుంటూ, కొతిమీర మడిమీది వాసనలకు తన్మయంగా ఆస్వాదిస్తూ, ఓరగా చూస్తోంది.

ఆనందరావు కలం కదలడం ఆరంభించింది.

* * *

సాహితీ సదన భవనం కిటకిటలాడుతోంది

నిన్నమొన్న కలంపట్టి వచన పద్యాలు రాసే యువకవులనుండి, తమ మొదటికథపడ్డ పత్రిక చేత్తో పట్టుకుని పదిమందికీ చూసే నవకథకుని వరకూ, ఖండకావ్య రచనలో తలలు పండిన వృద్ధులనుండి, కథా, నవలారచనలో గడితేరిన ప్రముఖులవరకూ సాహితీ ప్రియంభావులందరూ భవనంలోని ఆసనాలు అలంకరిస్తున్నారు. పరస్పర కరస్పర్శలూ, వ్యంగ్య సంభాషణలతో భవనం ప్రతిధ్వనిస్తోంది.

ఆరు గంటలయేసరికి, భవనం అంతా నిండిపోయింది. ఆ భవనంలో జరిగే సమావేశానికి అంతమంది జనం రావడం ఈమధ్య అయిదరేళ్ళ కాలంలో జరగలేదు. ఎనిమిదేళ్ళ అనంతరం సాహితీ సదనంవారు నిర్వహించిన కథానికల పోటీలో అత్యుత్తమ కథానికగా ఎన్నికయిన 'అమృతవర్షం' రాసిన సుందరరామారావుకి రెండువేల రూపాయలు బహుమతి ప్రధానం చెయ్యడానికి ఏర్పాటయిన సభ అది. పదేళ్ళుగా చక్కని సంసారిక కథలూ, సాంఘిక నవలలూ, ఒకటి - రెండు నాటికలూ రాసి అనేకుల అభినందన లందుకొన్న సుందరరామారావుకి బహుమతి రావడం అందరికీ ఆనందాన్నే కలిగించింది.

సాహితీ రంగంలో ఉన్న వాదాలతో,

రీతులతో ఏ విధమయిన పేచీ రాకుండా తన మనసుకు నచ్చినవాటిని ప్రశంసించి, నచ్చకపోతే మౌనం వహించే ధోరణికలవాడు కావడంవల్ల రచయితలందరికీ అతనంటే గౌరవం. ఏవర్గంతోనూ చెయ్యి కలపకుండా, ఏ బృందంతోనూ సభ్యత్వం తీసుకోకుండా, తన ఉద్యోగధర్మం నిర్వహించుకుంటూ, హృదయం స్పందించే సంఘటన ఏదైనా తటస్థపడినపుడు, ఆ జీవత్ కథకు అక్షరరూపం కల్పించుకుంటూ, రచనా వ్యాసంగం సాగించేవాడు. అటువంటి సుందరరామారావు కథలపోటీలో పాల్గొంటాడని ఎవరూ ఊహించలేదు. పైగా, ఇటువంటి పోటీలకు అతను విముఖుడని కూడా అందరికీ తెలుసు అయినా అతను పాల్గొని బహుమతిపొందడం అందరికీ ఆశ్చర్యమేకాదు; ఆనందమునూ, కలిగించింది. రెండువేల రూపాయలు చేదా? అని ఇద్దరు, ముగ్గురు హేళన చేసినవారున్నా లేకపోలేదు.

ఆరుగంట లవుతూండగా సుందరరామారావుని కారుమీద సాహితీసదనం కార్యదర్శిగారు తీసుకొచ్చారు అతను లోపల అడుగుపెడుతూండగానే హర్షధ్వానాలతో కరతాళాలు శ్రుతికలిపాయి

భవనం మెట్లెక్కుతూ అతను నలువంకలా చూశాడు, పరిశీలనగా చూశాడు. తనను పెద్ద పెద్దలే పలకరించి అభినందిస్తున్నా అతని చూపులు మాత్రం ఎవరినో వెతుకుతూనే ఉన్నాయి. పలకరింపులకు ప్రతిసమాధానాలూ, అభినందనలకు చిరునవ్వుతో కృతజ్ఞతలూ తెలుపుతూ భవనంలోపలకునడిచాడు. అతనికన్నులు ఆసీనులను చూస్తున్నాయి. ఆ కన్నులకు కనబడవలసినవ్యక్తి మాత్రం కనబడడం లేదు ఎంతో ఆదుర్దాగా చూస్తున్నాడు

వేదిక ఎక్కవలసినసమయం ఆసన్నమయింది అప్పటికీ అతని చూపులు వెదుకుతూనే ఉన్నాయి. ఆశతో నిండిన ఆ దృష్టిలో ఆనందం అంకురించడం లేదు బహుమతిగా వచ్చే రెండువేల కంటె కూడా సాహితీసదనంవారు ఎన్నిక చేయడంవల్ల కలగవలసిన ఆనందం అతని ముఖంలో లేదు పెదవులు నవ్వుతున్నా ఆ నవ్వులో నవ్వులేదు; కళ్ళల్లో కాంతిలేదు.

వేదిక ఎక్కడమూ అధ్యక్షులపక్క నిలబడుతూండగానే పుష్పమాలాలంకృతుడు కావడమూ జరుగుతున్నా. అతనిదృష్టి ప్రేక్షకులలో ఎవరినో అన్వేషిస్తూనే ఉంది అతని కన్నులు, మనస్సూ కేంద్రీకృతమయి ఉన్నాయి. ఆ సమయంలో అధ్యక్షులు అతనివైపు చూస్తూ చేసిన అభినందన ప్రసంగం కానీ పోటీలో న్యాయనిర్ణేతలుగా వ్యవహరించిన వారి ఉపన్యాసాలు కాని అతని మనసు కెక్కలేదు. కార్యదర్శి లేచి దుశ్శాలువలు కప్పి, బహుమతి మొత్తం అందిస్తుంటే కూడా అతను పరధ్యానంలో ఉన్నాడు.

అధ్యక్షులు నవ్వుతూ, హెచ్చరించాక ఆ బహుమతి అందుకుని మౌనంగా కూర్చున్నాడు. రెండు, మూడు క్షణాలు సభాస్థలి నిశ్శబ్దంగా ఉంది, అతని ఉపన్యాసం వినడానికి జరిగిన సన్మానికి కృతజ్ఞత తెలపాలనికూడా తోచలేదు. మళ్ళీ అధ్యక్షులు హెచ్చరించారు. అప్పుడు పూలమాల, శాలువలు తీసి, కుర్చీ చేతిమీద ఉంచి లేచి నిలబడి మరో రెండు మూడు నిమిషాలు సభవయిపే కలయజూశాడు. అతని కన్నులలో ఆశ సన్న గిల్లలేదు, ఆనందం వెల్లివిరియలేదు. అంతటి సన్మానం జరుగుతున్నప్పుడుండవలసిన సంతోషంతో అతని హృదయం ఉప్పొంగకపోగా, ఏదో ఆందోళనతోనే ఉంది

అలానే ఏవో రెండుముక్కలు కృతజ్ఞతా సూచకంగా పలికేసి, మొక్కుబడి తీర్చుకున్నాడు, వేదిక దిగుతూండగా ఎందరో పలకరించారు, మరెందరో అభినందించారు, ఇంకెందరో ప్రశంసించారు.

సుందరరామారావు కివేమీ చెవికెక్కడం లేదు ద్వారం ఈవలకు వచ్చి నిలబడ్డాడు. నెమ్మది, నెమ్మదిగా ఒకొక్కరే నిష్క్రమిస్తున్నారు. సాహితీ సదనం కార్యవర్గసభ్యులు కొందరు, ఇద్దరు ముగ్గురు స్త్రీలూ మిగిలారు.

"కారు తెప్పించమంటారా ఆడిగాడు కార్యదర్శి

"ఏమిటంటున్నారూ ..." అని దూరంగా నిలబడ్డ స్త్రీలవయిపే చూస్తూ-

"కారుకదూ ... వద్దులెండి. ఒక్కసారి మా తాతయ్యగారింటి కెళ్ళి అక్కడ మా గురువుగారిని చూసి వెడతా" అని, స్త్రీలకేసి అడుగుకదిపాడు. కార్యవర్గంలో నూతనంగా సభ్యత్వం పొందిన మాజీ మంత్రిగారి మేనల్లుడు, హేళనగా నవ్వుతూ,

"కథకులు కాదండీ, కాస్త యువతుల పరిచయం అవసరం," అంటూ మెట్లు దిగేశాడు.

సుందరరామారావుకి వినపడ్డా, అది తెలిసేస్థితిలో కాక, ఆ స్త్రీలను సమీపించి,

"ఏం లలితా, లత రాలేదా " అన్నాడు ఆతురతతో.

"ఎలా వస్తుంది, మేష్టారూ...రెండు వేలుకాదు, అయిదువేలయినా మీరు పోటీకి కథ రాయరని మాతో వాదించి, మీ దగ్గరకు వచ్చింది మీచేత కథ రాయించింది. మీరేమో బహుమతికూడా కొట్టేశారు. మరి మాతో పందెంలో ఓడిపోయింది కదా, ఇప్పుడిక్కడకు వస్తే మేమంతా చప్పట్లుకొట్టం'' అని నవ్వుతూ వెళ్ళిపోయారు వాళ్ళు.

"ఎంతపనిచేసింది లత" అని, నుదుట చెయ్యి వేసుకున్నాడు . !

కుర్చీ వెనకాల నిలబడి, రాస్తున్న కథంతా చదివిన మంజుల, ఫకాలుననవ్వి.

"రెండేళ్ళు పట్టిందా, మన కథ రాయడానికి?" అంది, సిగ్గునిండిన బుగ్గలలో సుడులు తిరిగాయి.

---

# మాయ

చుట్టూతా చీకటి...

చీకట్లోగూడా తలెత్తిన ఎత్తైన ప్రహరీలు...

"నిజానికి నేను దొంగనికాదు...అట్లాగని ఆబద్ధానికీ దొంగనుకాదు ..నా ఖర్మ కొద్దీ ఇక్కడికీ వొచ్చాను..."

"మొదట అందరూ అంతేలేభాయ్! ఇప్పటికి నాతలమీద ఉన్న వెంట్రుకలున్నన్ని మార్లు వొచ్చా నిక్కడికి ... ఇప్పటికీ నువ్వన్నమాటే నేనంటాను! మనం నిజంగా దొంగలంకాదు ... ఈ దొంగనాయాళ్ళ ప్రపంచంలో మటుకు దొంగలం! కావాలనిపించింది తీసుకోటం దొంగతనం మరి-ఈశ్వర దృష్టిలో! .. ఇంతకీ నీ పేరుకి చెప్పలేదు..."

"నారాయణ! రెండేళ్ళ క్రితం 'డిగ్రీ' పుచ్చుకున్నా! ఈరోజున 'దొంగ' నని బిరుదు పుచ్చుకున్నా నిజమాలోచిస్తే 'డిగ్రీ' పుచ్చుకున్న నారాయణని ఎవరూ తలెత్తి చూడనివాళ్ళు. ఈ 'బిరుదు' పుచ్చుకున్న నారాయణని మాత్రం నోళ్లు తెరిచి, గుడ్లప్పగించి మెదడుకు పని కల్పించి మరీ చూస్తున్నారు ఏంటో అంతా మాయ! ఈ ప్రపంచంలో అంతా మాయ రాజ్యమేలుతోంది...మరి నీపేరు ఏమిటి?" అడిగాడు నారాయణ

"నాపేరు కేశవులు అంటారు... కొందరు కేశవరావ్ . ఇంకొందరు కేసవా... అనీ అంటారు...అవునుగానీ నువ్ చేసిన మాయపని ఏమిటి గురూ!" కేశవులు ఆసక్తిగా అడిగాడు

"అనాదిగా భూమి పుట్టినప్పట్నుంచీ జరుగుతున్న మామూలే!...

"ఇవాళ సాయంత్రం నాకు గుర్తొచ్చింది - 'నా ఆకలితోడు యింట్లో నాతల్లీ చెల్లీ కూడా మూడ్రోజులుగా అండగా వుంటున్నారని! జీవితం అంటే ఏమిటో మొదటిసారిగా అర్థమయ్యింది. గానీ ఈ లోకంలో మాయ ఎలా రాజ్యమేలుతోందో మటుకు అర్థంకాలేదు ఎలాగయినా కనీసం గంజికయినా సరిపడ డబ్బులు సంపాదించాలని అనుకున్నా. కూలికి ఓపికకూడా లేకుండా పోయింది ..." నారాయణ ఆగాడు. చిన్నగా నవ్వాడు.

"హుం! చూశావా? ఈ విషయాలన్నీ చెబుతూంటే కనీసం నాకు కన్నీళ్ళయినా రావటంలేదు... అసలు యిప్పుడు ప్రాణమంటూ ఉంటేగదా కన్నీ ళ్ళొచ్చేందుకు?"

"అనలుకథ చెప్పుగురో?" బట్టతల మీదున్న పాతిక వెంట్రుకల్నీ వేళ్ళతో దువ్వుకుంటూ విసుక్కున్నాడు కేశవులు

"ఉండుమరీ! చెబుతున్నా... మరీ కొత్తగదా ఈ విషయాలకి. అందులో

మొదటిసారాయె! అం!! సాయంత్రమన్నాగదూ."

"సాయంత్రం స్టేషనుకేసి వెళ్లాను... కూలీకి ప్రయత్నిస్తే లైసెన్సున్నవాళ్ళు గొడవ పెడతారని భయం వుంది... గానీ ప్రయత్నించాలనుకున్నా! ప్లాట్ ఫారమ్మీద ఉత్తగా అటూ ఇటూ తిరిగా... గానీ లాభం లేకపోయింది... ఎర్ర డ్రెస్సుల్లో లైసెన్సు వాళ్ళందరూ కప్పలూ, పాములూ తిన్న సైనికుల్లా, దసరా సందాలకి మైసూర్లో అలంకరించిన ఏనుగుల్లా అనిపించారు. వాళ్ళలో బక్కగా ఉన్న ఏ ఒక్కరయినా చిన్న గుద్దు గుద్దితే ప్రాణం పోతుందేమోనని పించింది. రైలు కదులుతూండగా దున్నపోతులా వున్నొకడు నల్లకోటులో పరిగెత్తుతూ వచ్చి నన్ను గుద్దాడు చాపచుట్టలా క్రిందకు విరుచుపడిపోయాను. లేచి నుంచునేంతలోనే వాడు నన్నూ, నా మొహాన్నీ తిట్టుకుంటూ, తిరిగి తిరిగి చూసుకుంటూ దాటిపోయాడు. మోకాలి చిప్ప రుద్దుకుందామని తొంగున్నవాణ్ణి మళ్ళీ తలెత్తి పైకి లేవాలనిపించలేదు. చటుక్కున చేయిచాచి పర్సు నందుకని జనంలోకి కలిసిపోయాను...

"ప్రపంచమంతా తగలబడిపోతూంటే భయంతో పరిగెత్తే ప్రజల్లాగా సందడిగా వున్నచోట పర్సుతెరిచి చూస్తే వందరూపాయల కట్టలున్నాయి. నాకప్పుడు ఒళ్ళంతా గడ్డకట్టుకుపోయి చలికి వణికిపోతున్న వాడిలా వొణికాను. కానీ గమ్మత్తు! అంత చలివణుకులోనూ స్నానం చేసినంతగా చెమటపట్టింది. గబుక్కున పర్సు పారేసి నోట్లు పాంటు జేబులోకి కుక్కుకుని గేటుకేసి పరిగెత్తా అక్కడా." నారాయణ ఆయాసంగా కాస్సేపాగి

"అక్కడ నల్లకోటు దున్నపోతు గాడు 'అడుగో, వాడేనండి సార్. వాడే! దొంగవెధవ పట్టుకోండి అన్నాడు. వెధవలు నాజేబు సోదాచేస్తే మటుకు అందులోంచి... ఆశ్చర్యం. నాకర్థంకాలా ఒకటో రెండో వంద రూపాయల నోట్లొచ్చాయి. 'మిగతావి ఏవన్నారు? ఇన్నాళ్ళ నాచదువూ, వెధవ డిగ్రీధర్మమా అని నిజంచెప్పినా బోడిముండావాళ్ళు నమ్మలా అందుకని ఇక్కడికి, ఈ కొట్లోకి నన్ను రవాణా చేశారు. కాని. అదేం మాయోగానీ మిగతా నోట్లేమయ్యాయో తెలీదు..." నారాయణ తలని అడ్డంగా విదిలిస్తూ చెప్పటం ఆపాడు

"గంజి మాకు పెడతారు గావాల్ను: గంటకొట్టారు పదపద! అయినా నాకేం తెలుసుగురూ నీ జేబులోవి దొంగ వంద రూపాయల నోట్లనీ!! వాటిని మారుస్తూంటే మాయ ముండాకొడుకులు నన్ను పట్టేశారు మరి!" చీకట్లోకి నడుస్తూ అన్నాడు కేశవులు.

ఇది విన్న నారాయణ మెదడునిండా చీకటి నిండుకుపోయింది.



# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గతసంచిక తరువాయి)

"వస్తున్నా అక్కడపెట్టు" అన్నాడు.

రాజేశ్వరి, నేను తిరిగి వేపచెట్టుదగ్గిరికి వచ్చాం. నేను ఆ గట్టుమీదనే, క్యారియర్ ప్రక్కగా కూర్చున్నా. రాజేశ్వరివెళ్ళి లేతగావున్న అరిటాకు ఒకటితీసి కడిగితెచ్చి క్యారియర్‌దగ్గర పెట్టింది.

పాకలోకివెళ్ళి గ్లాసుతో నీళ్ళుతెచ్చింది. ఈలోపల కృష్ణ కాళ్ళూచేతులూ కడుక్కుని వచ్చాడు.

ఎంత నిర్లక్ష్యంగా కూర్చోవాలని అనుకున్నా, నేనక్కడ కూర్చోలేకపోయాను. లేచివెళ్ళి రాజేశ్వరి దగ్గరగా నిలబడ్డా. కానీ రాజేశ్వరి నేను నిల్చున్నట్టు నా ప్రక్కనే నిలబడలేదు. వెళ్ళి క్యారియర్‌విప్పి అతనికి వడ్డించింది. కృష్ణ భోంచేస్తున్నంతసేపూ అక్కడే నిలబడింది.

కృష్ణకి కొద్దిగా వెనకగా నిలబడివున్న నేను అతన్ని పరీక్షగా చూడసాగాను. వెనకనుంచి చూస్తే అతని భుజాలు, ఆ వంపు చాలా అందంగా వుంటాయి. ఎంత నిర్లక్ష్యంగా, ఎంత గబగబా భోజనం చేసేస్తున్నాడో!

అతనికి కావల్సింది అన్నం. అది ఎందులో తింటున్నాను, ఎక్కడకూర్చుని తింటున్నాను అనే ధ్యాసే వున్నట్టులేదు.

డైనింగ్ టేబిల్‌లేదు. కుర్చీలులేవు. తళతళ మెరిసే గాజుపళ్ళాలులేవు. మా కవి

భోజనంలో ఒకభాగంగా కన్పిస్తాయి. డైనింగ్ టేబిల్‌మీదగుడ్డ శుభ్రంగావుంచకుండా మాకు డిన్నర్ సర్వ్‌చేసాడని ఒక వంటవాడిని మా అమ్మ వుద్యోగంలోంచి తీసిపారేసిన సన్నివేశం నాకు గుర్తుకువచ్చింది.

"యిక వెడదామా ?" పరధ్యాసగా ఆలోచిస్తున్న నా దగ్గిరికివస్తూ అంది, రాజేశ్వరి

వులిక్కిపడి చుట్టూ చూశాను.

కృష్ణ భోజనం ముగించుకుని వెళ్ళిపోతున్నాడు. తోటలోకివచ్చి యింత సేపయింది. అతను కన్నెత్తి నావైపు చూడలేదు. పన్నెత్తి పలకరించలేదు. అసలు నా వునికినే గుర్తించనివాడిలా ఊరుకుండిపోయాడు. ఇది గుర్తుకువచ్చేసరికి నాకు ఒళ్ళుమండింది యింకెవరైనా అయినట్టయితే ఎంతచక్కగా తోటంతా తిప్పి చూపించేవాళ్ళేమో !

రాజేశ్వరి 'అరె మర్చిపోయా. యిప్పుడే వస్తాను-వుండు వదినా' అంటూ కృష్ణ వెళ్ళినవైపు పరుగెత్తింది.

పది నిముషాల తర్వాత చెంగులో ఏవిటో మూటకట్టుకుని వచ్చింది.

"ఏమిటవి ?" అన్నాను.

"సన్నజాజి మొగ్గలు'' అంది.

యిద్దరం కలిసి బైటికి వచ్చాం.

రాజేశ్వరి దోవపొడుగునా ఏదో అడుగుతూనే వుంది. నేను వచ్చేటప్పుడు చెప్పినంత వుత్సాహంగా జవాబులు చెప్పలేదు.

"అదుగో కాలవ వస్తోంది. విప్పువిప్పు నీ పాదరక్షలు" అంది రాజేశ్వరి నవ్వుతూ నేను నవ్వలేదు చెప్పులువిప్పి చేత పట్టుకున్నా - చీర కుచ్చీలు ఎత్తి పైకి పట్టుకున్నా కాలవ దాటుతుండగా హఠాత్తుగా అడిగా. "రాజూ ! మీ అన్నయ్యకి నేను రావటం యిష్టంలేదా ? నిజం చెప్పు ! అన్నా. నడుస్తున్న రాజేశ్వరి హఠాత్తుగా ఆగిపోతూ, "అదేమిటి ?" అంది.

"నేను వచ్చినప్పటినుంచి చూస్తూనేవున్నా. మీ రంతా యింత ఆప్యాయంగా మాట్లాడుతున్నారు. నేను మీకు కొత్తనిగాని, నాకు మీరు కొత్తవిగాని అన్పించటంలేదు ఇప్పుడు చూడు నేను తోటకి వచ్చానా ? కనీసం మర్యాదకైనా ఒక చిన్నమాట మాట్లాడలేదు. మాలో ఎంత కోపం గాని, ద్వేషం గాని వుంటే తప్ప అలా మాట్లాడటం మానేయం."

"వదినా !" రాజేశ్వరి నా చెయ్యి పట్టుకుంది.

నేనుకూడా ఆగిపోయాను, యిద్దరం గలగలమని పారుతున్న ఆ నీళ్ళ కాలవలో ముఖాముఖి నిలబడ్డాం. రాజేశ్వరి ముఖం ఎర్రబడింది; దెబ్బతిన్నదానిలా చూస్తూ అంది. "అదేం కాదు వదినా? అన్నయ్యకి మొహమాటం చాలా ఎక్కువ. అంత కంటే యింకేం లేదు"

"మొహమాటమా? లేక గర్వపోతుతనమా!" అన్నాను మధ్యలోనే.

"నువ్వు రెండు రోజులుండు; మా అందరికంటే వాడే బాగా మాట్లాడతాడని నువ్వే ఒప్పుకుంటావు." బంగారుగా గబగబా అంది.

"అవసరం లేదు; నన్ను ఒకసారి నిర్లక్ష్యపరచినవాళ్ళని నేను మళ్ళీ జీవితంలో కన్నెత్తి చూడను. రాజూ! నువ్వు నా బలహీనత అను. ఇంకేదయినా అను; నాకు చాలామంది విషయంలో మొదటి చూపుతోనే స్థిరమైన అభిప్రాయం ఏర్పడుతుంది. అది ఓ పట్టాన మారటం అంటూ జరగదు. నిజం చెప్పాలంటే - మీ అన్నయ్య నాకు నచ్చలేదు." "పద వెడదాం, ఇక యీ మాట మనం ఎత్తొద్దు" అనేసాను.

ఆరోజు వుదయం పదిగంటలవేళ.

రాజేశ్వరీ నేనూ స్నానాలవీ ముగించుకుని, భోజనాలకి కూర్చోబోతుండగా, "ఏమలమ్మా! వున్నావుటమ్మా యింట్లో?" అంటూ వాకిట్లోంచి కేక వినిపించింది.

అత్తయ్యా రాజేశ్వరీ లోపల వున్నారు. ముందుగదిలో వున్న నేను బైటకి తొంగిచూశాను.

వచ్చినావిడకి దాదాపు 50, 60 సంవత్సరా లుంటాయి.

జుట్టంతా నెరిసి వెండిలా తళతళా మెరుస్తోంది.

మధ్యపాపిడి తీసుకుని నుదురుమీద క్రిందకి దువ్వుకుని, చెవుల వెనకనుంచి గట్టిగా, బిఱ్ఱు బిళ్ళచుట్ట చుట్టుకుంది. ఒకముక్కుకి పెద్ద అడ్డబేసరి వుంది.

ముక్కుక్రింద ముత్యంలా మెరుస్తున్న వంటిరాయితో బులాకీ వుంది.

మెడలో పేర్చినట్టున్న 5 వరసల చంద్రహారం, యింకా వో రెండుమూడు గొలుసులు పచ్చటి రంగులోవున్న ఆవిడ ఒంటిఛాయలో కలిసిపోతున్నాయి.

ఒంగపండురంగు పట్టుచీర కాసీ బోసి కట్టుకుని, వెడల్పాటి జరీ అంచున్న పయిటకొంగు విశదంగా, వెడల్పుగా కన్పించేలా ముందుకుతిప్పి దోపుకుంది. పండు ముత్తయిదువులా, కర్నూ కవలు వరించే లక్ష్మీదేవిలా వున్న ఆవిడని నేను

"హనుమంతరావు కూతురివి నువ్వేనా? మీ అత్తయ్య వుందిచే పిల్లా?" అని అడుగుతూనే ఆవిడ లోపలకు వచ్చింది.

"వుంది. రండి. కూర్చోండి" అంటూ ఎంతో మర్యాదగా ఆవిడని ఆహ్వానించి లోపలివైపుకి తిరిగి 'అత్తయ్యా! ఎవరో వచ్చారు' అన్నాను.

"ఎవరది? వస్తున్నా కూర్చోమను." అత్తయ్య విసుగుధ్వనిస్తున్న గొంతుతో కేక పెట్టింది. సరిగ్గా భోజనాలవేళ యీ టైమ్‌లో ఎవరైనా వస్తే కూర్చోమనటానికి వీలుండదు. వెళ్ళమనటం బాగుండదు. పనివేళ పైవాళ్ళెవరైనా వస్తే అత్తయ్యకి విసుగు కలగటం యిప్పటికే నేను ఒకటిరెండుసార్లు చూశాను.

వచ్చినావిడ నన్ను చూస్తూ పట్టెమంచం అంచున కూర్చుంటూ, "మీ అమ్మా నాన్నా అంతా బాగున్నారుటే అమ్మాయి," అని ఎన్నోరోజులనుంచి పరిచయమున్నదానిలా నన్ను అడిగింది.

నేను బాగానే వున్నారన్నట్టు తలూపాను.

"యెవరు వదినా వచ్చింది?" అంటూ రాజూ, రాజువెనక అత్తయ్య యివతలకి వచ్చారు.

"అయ్యో. మీరా! నేనింకా ఎవరో అనుకున్నాను." ఆవిడని చూడగానే అత్తయ్య బంగారుగా దగ్గరగా వస్తూ, నమ్రతగా, మర్యాదగా, 'మీరని అనుకోనేలేదు సుమండీ!' అంది. తను ఆలస్యం చేసినదానికి చాలా నొచ్చుకుంటున్నదానిలా కన్పించింది.

నేనేనే అమ్మాయి సాయంత్రం అమ్మదుకి పసుపు, కుంకుమ యిప్పిస్తున్నా. వూరంతా పిలవటానికి పిల్లలు వెళ్ళారు. మన హనుమంతు కూతురు వచ్చిందని తెలిస్తేనూ, చూసినట్టూవుంటుంది. పిలిచినట్టూవుంటుందని బొట్టు పుచ్చుకుని నేనే చక్కావచ్చాను. సాయంత్రం పేరంటానికి రాజుతోపాటు ఆ అమ్మాయిని కూడా పంపు," అంది.

అత్తయ్య అలాగే నన్నట్టు తలూపింది.

ఆవిడ ఎక్కువసేపు కూర్చోలేదు

కూర్చున్న కొద్దిసేపటిలోనే ప్రసంగం అంతా ఎక్కువ రాజేశ్వరి పెళ్ళి గురించే జరిగింది.

"చూస్తున్నారా ఎక్కడైనా సంబంధాలు," అంది ఆవిడ.

"చూడకేం పిన్నీ. కానీ మనలాటివాళ్ళ యిళ్ళలో పిల్లమెడలో ముడిపడాలంటే మాటలా?" అంది అత్తయ్య.

పెళ్ళి ప్రసంగం వచ్చేసరికి రాజు మెల్లగా అక్కడనుంచి జారుకుంది.

అత్తయ్య ముఖంలో ఆవేదన బాధ, దిగులు గూడుకట్టుకోవటం గమనించాను కాను ఆవిడ వెళ్ళిపోయిన తర్వాత రాజేశ్వరీ, నేను భోజనాలు చేస్తుండగా అత్తయ్య చెప్పింది యింతక్రితం వచ్చిన మహాలక్ష్మమ్మగారు అనబడే యీవిడ భర్తకి నాన్నగార్కి గురుశిష్యుల సంబంధంలాటిది వుండేదట. యిద్దరిమధ్యా వయసు తేడా ఎలావున్నా ఎంతో స్నేహంగా వుండేవారుట యీవిడని వదినా అని, ఆయన్ని అన్నా అని పిలిచేవారుట. యీవిడదగ్గర నాన్నగార్కి చాలా చనువు వుండేదిట"

అత్తయ్య చెప్పినవన్నీ ఓ చెవితో శ్రద్ధగా నే వింటున్న నేను మధ్యలో రాజేశ్వరిని "రాజూ! నేను ఆవిడ ఫొటో తీసుకుంటానికి వీలవుతుందా?'' అని అడిగాను

"ఫొటోనా? ఆవిడదా? ఏంచేసుకుంటావు?" అంది రాజు ఆశ్చర్యంగా.

"ఏంచేసుకోవట మేమిటి? దగ్గరుంచుకుంటాను ఎక్కడ ఏ కొత్త అందంగా, అద్భుతంగా, తమాషాగా ఏది కన్పించినా దానిని మంచి యాంగిల్‌లో ఫొటో తీసుకోవటం నాకు చాలా యిష్టం. అదవాటుకూడా. అదీకాకుండా యీవిడ ఫొటో దేనికైనా పోటీకి పంపవచ్చు" అన్నాను.

'పోటీనా? ఏంపోటీ?'

"ఇలస్ట్రేటెడ్ వీక్లీ లాటి మాగ్‌జైన్స్ అప్పుడప్పుడూ ఫొటో పోటీలు నిర్వహిస్తూ వుంటాయి. అలాటి పోటీలలో పాల్గొనటమే గాకుండా, మామూలుగా కూడా అందమైన దృశ్యాలు తీసి వాటిక్రింద అద్భుతమైన భావం స్ఫురించేలా ఒకటి రెండులైన్లు వ్రాసి పత్రికలకి పంపటం నాకు సరదా. యీ సరదా నాన్నే నేర్పారు నాకు." అన్నాను.

ఒకసారి ఒక పత్రిక నిర్వహించిన పోటీలో సూర్యాస్తమయం అన్న నా ఫొటోకి ప్రథమ బహుమతి వచ్చిన వైనం, విశ్వాసం అన్న విషయంమీద కుక్కలతో తీసినదానికి, ప్రత్యేక బహుమతి వచ్చిన సందర్భం నేను అత్తయ్యకి, రాజుకి వివరంగా చెప్పాను

సాయంత్రం అయింది చిన్నపిల్లలంతా మూడుగంటలనుంచే ముస్తాబుకావటం ప్రారంభించారు. రాజేశ్వరి వాళ్ళకి తలలు దువ్వి, ముఖాలు కడిగి, బట్టలువేసి తయారుచేసింది.

5 గంటలు అవుతుండగా నేను కూడా ముఖం కడుక్కుని చకచకా తయారయాను. జడ వేసుకుని, బొట్టు, కాటుక దిద్దిదిద్దినట్టు పెట్టుకున్న నేను పెట్టె తెరిచి రెండుచీరలు తీశాను.



# ఫోస్ఫోమిన్

శక్తిని పెంపొందించును.



ఆకలిని అధికము చేయును.

సహనశక్తిని

హెచ్చించును.



శరీరముయొక్క రోగనిరోధక శక్తిని

ఎక్కువ చేయును.




అవును — కుటుంబము
అంతటికి ఫోస్ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్ఫోమిన్. బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్ఫేట్లుగల అనుపచ్చని పండ్ల రుచిగల టానిక్

SQUIBB® ® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్కుకు చిహ్నం దీని లైసెన్సు
ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

SARABHAI CHEMICALS

Shilpi SC 50 A/67 Tel

ఒకటి గోధుమరంగుమీద నల్లటి చుక్కలున్న మెత్తటి కాశ్మీర్ సిల్క్‌చీర. రెండోది పింక్‌కలర్‌లో ఫారెన్ నైలాన్‌జార్జెట్‌మీద చెమ్కీతో అందంగా కుట్టు పూలు కట్టబడివున్న చీర.

రెండూ తీసుకుని చేతిమీద వేసుకుని రాజేశ్వరి దగ్గరకి వెళ్ళి 'నీ కేది కావాలో తీసుకో' అన్నాను.

రాజేశ్వరి విస్మయంగా చూసింది. కళ్ళు పెద్దవిచేసి చూస్తూ 'ఎందుకు?' అంది

'ఎందుకేమిటి? పేరంటానికి వెళ్ళటానికి. ఒకటి నువ్వు తీసుకుంటే, రెండోది నేను కట్టుకుంటా.'

'నువ్వు వస్తున్నావా పేరంటానికి!'

ఈసారి ఆశ్చర్యపోవటం నా వంతయింది.

వెనక్కి తగ్గుతూ, ఔను. ఏం? రాకూడదా నేను' అన్నాను సందేహంగా. రాజేశ్వరి కళ్ళు వుత్సాహంతో మెరిశాయి.

'ఎందుకు రాకూడదూ! నువ్వు రావేమో-యిలాటివి నీకు నచ్చవేమో అనుకున్నాను. వుండు-ఒక్క ఐదునిముషాల్లో నేను తయారయి వస్తాను.' మెరుపులా అక్కడినుంచి పరిగెత్తబోయిన రాజేశ్వరిని నేను జబ్బపట్టుకుని ఆపేస్తూ. 'ముందు వీటిల్లో ఏదికావాలో చెప్పు మరి' అన్నాను.

రాజేశ్వరి అసక్తిగా వాటివైపు మార్చిమార్చి చూస్తూ, మొహమాటంగా 'ఎందుకు వదినా? నావి వున్నాయిగా' అంది.

'వున్నాయిలే. లేవనే ఉద్దేశ్యంతో నే నివ్వటం లేదుగా' అన్నాను. రాజేశ్వరి రెండింటిని పరిశీలించి, చివరికి నేను వూహించినట్టుగానే కాశ్మీర్ సిల్క్‌చీర తీసుకుంది.

అరగంటలో యిద్దరం తయారయ్యాం. నేను రాజేశ్వరికి బలవంతంగా నాలాగా వదులుగా జడవేసి ఒక ప్రక్క గులాబీ పెట్టా. నేను రోజూ పెట్టుకునే రింగులు తీసి, రాజేశ్వరి వద్దని గోలపెడుతున్నా వినకుండా చెవులకి పెట్టాను.

మెత్తటి కాశ్మీర్ సిల్క్‌చీరలో చెవులకి రింగులతో, వదులుగా వున్న జడతో, ఒక ప్రక్కనున్న గులాబీతో రాజేశ్వరి రూపమే మారిపోయింది. ఆరోగ్యంతో, యవ్వనంతో మిసమిసలాడుతూ. పుష్టిగా బిగువుగా వున్న రాజేశ్వరి చెక్కిన బొమ్మలా వుందనటానికి సందేహమేమీలేదు. చిన్నచిన్న మార్పులతో, కొత్త అందాలని సంతరించుకున్న రాజేశ్వరిని చూడగానే నాకు చాలా సంతోషం వేసింది. చెయిపట్టి లాక్కెళ్ళి అత్తయ్యముందు నిలబెట్టి 'చూసుకో. మీ అమ్మాయిని' అన్నా. రాజేశ్వరి సిగ్గుపడిపోయింది.

అత్తయ్య కళ్ళలో వాత్సల్యం, తృప్తి తొణికిసలాడటం గమనించిన నాకు ఏదో ఘనకార్యం చేసినంత ఆనందం వేసింది.

మా అమ్మ చెప్పినమాట ఎంత నిజం! కాస్త జాగరూకత వహిస్తే మనం అందం పొందలేకపోయినా ఆకర్షణ తెచ్చుకోవచ్చు అంటూ అమ్మ క్లబ్ మెంబర్స్‌తో పదేపదే ఎందుకు అంటూ వుండేదో యిప్పుడు నాకు అర్థమైంది.

రాజేశ్వరి విషయంలో యీ మాట అక్షరాలా నిజమవటం కళ్ళారా చూశాను నేను. మేం యిద్దరం ఇంచుమించు ఒకే వయసువాళ్ళం రాజేశ్వరి నాకంటే బాగా బొద్దుగా, కాస్తపొట్టిగా వుండటంవల్ల పిసరంత నాకంటే పెద్దదానిలా కన్పిస్తుందేమో

ఈరోజు ఇద్దరం కావాలని నా పట్టుదలమీద ఒకేరకంగా తయారయాం. మేం ఇల్లుదాటి బైటకి రాబోతూండగా, మా కెదురుగా కృష్ణవచ్చాడు. అతను తోటనుంచి వస్తున్నట్టున్నాడు చేతిలోని బుట్టనిండా తాజాగా నవనవలాడుతున్న కూరగాయ లున్నాయి. అతని కెదురుగా ముఖాముఖీవచ్చిన మా యిద్దర్నీ చూస్తూ క్షణంసేపు అలాగే నిలబడిపోయాడు. అతని కళ్ళలో సంభ్రమాశ్చర్యాలు స్పష్టంగా కన్పించాయి. అతని చూపులు నామీద రెప్పపాటుకంటె ఎక్కువసేపు నిలవనేలేదు చెల్లెల్ని ఆసాంతం చూసుకోవటంలో సర్వం మర్చిపోయినట్టుగా నిలబడ్డాడు. నాకు ఒళ్లు మండింది. మోచేత్తో రాజేశ్వరిని తాకుతూ, 'పద' అన్నాను.

నా మాటతో తెప్పరిల్లినట్టయిన కృష్ణ 'ఎక్కడికే రాజూ,' అన్నాడు.

'కర్ణంగారింటికి పేరంటానికి అన్నయ్యా' అంది రాజేశ్వరి.

వెనకనుంచివచ్చిన అత్తయ్య 'యింకెక్కడికీ వెళ్ళకుండా సరాసరి యింటికి వచ్చేయండే రాజూ! సుబ్బమ్మా వాళ్ళు వదినని వాళ్ళింటికి తీసుకురమ్మనమని పిలుస్తారేమో. పిచ్చిమొహంలా వెళ్ళకు. 'మీరేరండి మా యింటికి' అని చెప్పు.' అంటూ హెచ్చరించింది.

మేం ముందుకు వస్తుంటే వెనకనుంచి కృష్ణస్వరం మెల్లగా, విన్పించింది. 'అమ్మా! మంచిబట్టలు, కాస్తో కూస్తో నగలు ఆడపిల్లకి ఎంత అవసరమో ఇప్పుడు తెలుస్తోంది' ఆ మాటలు పలకటంలో, మృదుగంభీరంగా వున్న ఆ స్వరంలో ఏదో బాధ, నిస్సహాయత్వం అంతర్లీనమైనట్టు అన్పించిన నేను అనుకోకుండానే తల తిప్పి వెనక్కు చూసాను.

కృష్ణకళ్ళు సర్వం మరిచి రాజునే తనివిదీరా చూస్తున్నాయి. ఆ చూపుల్లో తొంగి చూస్తున్న ఆపేక్ష నేను గమనించకపోలేదు. ఎందుకో చెప్పలేను నా ఒంటినిండా కారం రాచుకున్నట్టుగా అయింది. రాజేశ్వరి బాగుంది. ఆ విషయం అందరికంటే

ముందుగా నేనే ఒప్పుకుంటా. దానిమీద నా కెలాటి యీర్ష్యా లేదు. కానీ నేను ఇప్పుడు కట్టుకున్న చీర చాలా అందమైంది.

ఆ చీరకట్టుకున్నప్పుడు నా అందం పదింతలు యినుమడిస్తుందని - సాధారణంగా ఎలాటి చీర అయినా నేను కట్టుకోవటంతో దానికి అందం వస్తుంది. కానీ యీ చీర నాకే ఓ విధమైన అందం తెచ్చిపెట్టిందని చాలామంది ఎన్నోసార్లు అనగా విన్నాను.

ఏనాడూ చీరల విషయం పట్టించుకోని నాన్నగారుకూడా ఆ చీర కట్టుకున్నప్పుడు 'యిది నీకు చాలా బాగుందమ్మా' అని కాంప్లిమెంట్ యిచ్చారు

అందరి దృష్టిని అలా ఆకట్టుకున్న అపరూపమైన నా యీ చీర కృష్ణదృష్టిని కాస్తకూడా కదిలించకపోవటంతో నాకు ఒళ్ళుమండింది.

అతను నా వైపుచూసిన చూపులో, ఏకాస్త, ఏ పిసరంతకూడా ప్రశంస లేకపోవటంతో నా అహం దెబ్బతింది.

నాకు తెలియకుండానే మనసు రోషంతో కరకరలాడింది.

'అసలయినా ఈ పల్లెటూరి వెర్రిబాగులవాడికి ఏం తెలుసులే... అతనికి మొహం' అని విసురుగా తలతిప్పుకుని నన్ను నేను మనసులో నిర్లక్ష్యంగా తీసిపారేస్తున్నట్లుగా యీసడించుకుని నన్ను నేనే వూరడించుకున్నాను.

* * *

మేం వెళ్ళేసరికే పేరంటం మొదలైపోయింది. అక్కడ కూర్చున్న ఆడవాళ్ళని చూస్తే, దాదాపు ఆ వూళ్ళోవున్న ఆడజనాభా అంతా అక్కడే వున్నట్టు తోచింది నాకు. అందరూ గోలగా, బిగ్గరగా మాట్లాడుకుంటున్నారు కూర్చోటానికి స్థలం లేనందువల్ల కొంతమంది నిలబడి వున్నారు నడవలా వున్న ఆ జాగా యిరుకుగా వుండటంవల్ల, ఆడవాళ్ళంతా యిరుక్కుని యిరుక్కుని కూర్చోవటంవల్ల, కదిలే ఖాళీ లేకపోవటంతో పిల్లలు కొంతమంది చిరాకుపడి ఏడుపులు లంకించుకున్నారు. పెద్దవాళ్ళు సముదాయించాలని చూస్తున్నారు కానీ సాధ్యం గావటంలేదు. వాళ్ళ ఏడుపులు వాళ్ళవిగానే వున్నాయి. వీళ్ళమాటల ధోరణి వీళ్ళదిగానే వుంది.

గర్భవతి అయిన కర్ణంగారి అమ్మాయి కొత్తచీర కట్టుకుని తలనిండా పూలు పెట్టుకుని, ఒంటినిండా మోయలేకుండా వుందా అనిపించేటన్ని రాళ్ళనగలు పెట్టుకుని ధగధగా కాంతులీనుతూ కుర్చీలో కూర్చునివుంది.

ముగ్గురు వయసుమళ్ళిన ముత్తయిదులు హారతిపళ్ళెం పట్టుకుని ఆవిడ కెదురుగా నిలబడ్డారు. ఆ ముగ్గురిలో సన్నగా, బక్కపలచగా పేదరాలులా, సాదాచీర

కట్టుకువిప్పున్న ఒకావిడ మంగళహారతి కాబోలు పాట ఎత్తుకుంది.

ఆవిడ పాట విన్పించగానే ఒకేఒక నిముషం సూది క్రిందపడినా విన్పించేటంత నిశబ్దం అయింది. అంతే. మరో రెండు నిముషాల్లో మళ్ళీ మాటలు, కబుర్లు, పలకరింపులు, పిల్లల ఏడుపులు, సముదాయింపులు ప్రారంభమైనాయి.

అంతవరకూ ఆవిడని పాట పాడమని కోరి, పాడితేగాని వీల్లేదని బలవంతం చేసిన వాళ్ళెవరూ ఆవిడపాటని వినటంలేదని నేను గమనించాను. అదే నాలాటిది అయితే, చురచురా చూసి, ముఖం మాడ్చుకుని – ముక్కుమీదకి కోపం తెచ్చుకుని, టక్కున పాట ఆపేసి వుండేది

కానీ ఆ పాటపాడే ఆవిడ మహా ఓపికమంతురాలులా వుంది. ఏదయినా పని మొదలుపెడితే దాని చివరంటా సాధించి, నరంలా సాగే స్వభావం కలదేమో. ఎవరూ వినకపోయినా, అందరూ వింటున్నంత శ్రద్ధగా కంఠం ఎత్తి, తనమానాన తను పాడుకుంటూనే వుంది

చోటులేక గుమ్మందగ్గిరే నిలబడిపోయిన మమ్మల్ని చూడగానే కర్ణంగారిభార్య కాళ్ళ కడియాలూ, గొణ్ణెపు గొలుసులూ కణకణ లాడించుకుంటూ వచ్చి– 'అదే మిటే రాజూ! పరాయిపిల్లలా అక్కడెక్కడో నిలబడిపోతావు. యింత మొహం మాటం గలదానివి రేపుపెళ్ళయితే ఎలాగే తల్లీ–యిలారండి.' అంటూ మమ్మల్ని

తనవెంట తీసుకువెళ్ళి కుర్చీ దగ్గరగా కూర్చునివున్న ఇద్దరు ఆడపిల్లల్ని భుజం తట్టి, 'మీరుకాస్త అటు సర్దుకోండే కోడలుపిల్లలూ' అంటూ వాళ్ళని లేపి మమ్మల్ని కూర్చోపెట్టింది.

పేరంటానికి వచ్చిన వాళ్ళలో చాలామందికళ్ళు నా మీదనే కేంద్రీకృతమై వున్నట్టు నేను కనిపెట్టకపోలేదు. కానీ అదేం గమనించని ముగ్ధరాలిలా రాజేశ్వరితో మాట్లాడటం ప్రారంభించాను

ఒకపిల్ల మా కాళ్ళకి పసుపు రాసింది

మరో అమ్మాయి నుదుట బొట్టుపెట్టి, కంఠానికి గంధం పూసింది.

ఒకవయసులో వున్నావిడ ఆదేదో ఘాటువాసనగల సెంటు కలిపిన పన్నీరు జోరుగా. మామీద చిలకరించింది

ఎవరో రాజేశ్వరిని పాటపాడమని కేకపెట్టారు.

ఇంకో యిద్దరు బలపరిచారు.

రాజేశ్వరి మొహమాటంగా, అయిష్టంగా, అభ్యంతరంగా తలవూపింది.

'పాడవే రాజూ. ఏమిటి మరీ బ్రతిమాలించుకుంటున్నావు!' కర్ణంగారి భార్య ఆజ్ఞాపించింది

'వచ్చా నీకు?' అన్నాను నేను రాజేశ్వరి వేపు చూస్తూ

'అంత బాగారాదు' నసిగింది రాజూ.

చివరికి అందరూ పట్టుపట్టితే, తప్పనిసరిగా రాజుగొంతు సవరించుకుంది. నాకు దానిమీద భలే జాలివేసింది పాపం! చిట్టి గంగిగోవులాటి మనిషికదా నలుగురు కలిసి ఏపనిచేయమన్నా, చేసేస్తుంది. కాదనే సాహసం దానికి లేనేలేదు. ఇప్పుడు వీళ్ళంతా పాడుమన్నారు కదా అని వచ్చినా, రాకపోయినా, గొంతువణికినా, ఏదో పాడానసిపించు కుంటుంది తప్పమానదు.

ఇలాటి గంగిగోవుల్లాటి వాళ్ళకి జీవితంలో ఎంతకష్టం! ఈ బలహీనతని ఆధారంగా చేసుకుని నలుగురూ నెత్తిన ఎక్కాలని చూస్తారు.

మరోసారి గొంతు సవరించుకున్న రాజేశ్వరి 'సావిరహేతవదీనా' అంటూ ఎత్తుకుంది.

నేను వులిక్కిపడ్డాను.

అందరూ మాటలు ఆపేసి వింటున్నారు.

నేను ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి మోకాలిమీద గడ్డం ఆనుకుని, క్రిందకి చూస్తూ పాడుతున్న రాజేశ్వరినె చూస్తున్నా!

ఎంతకమ్మటి కంఠం! తీగెలావుంది. మృదువుగా, మధురంగా వున్న ఆ స్వరముతో ఆ మాటలు పలకటంలో భావస్ఫూర్తి నిండుగా వుంది

క్షణంసేపు నేను సర్వం మరచి రాజేశ్వరి పాటలో లీనమయిపోయాను

పాట అయిపోయింది.

నేను చప్పట్లు కొట్టబోయాను.

రాజేశ్వరి చప్పున నా చేయి పట్టుకుని ఆపేసింది

ఇద్దరం ఒకళ్ళ ముఖంలోకి మరొకరం చూసుకున్నాం.

'ఇంత బాగా పాడుతావని నేను కల్లోగూడా అనుకోలేదు.' అన్నాను ఆశ్చర్యం దాచుకోలేని కంఠంతో.

రాజేశ్వరి నాచేయి నాకు వదిలేసింది.

పేరంటం అయిపోయింది.

అందరికీ చలిమిడివుండలు. లడ్డూలూ, శనగలు, తమలపాకులు పంచిపెట్టారు.

'నాకుపెట్టరా? మాకుపెట్టండీ. ఏమండీ మా చెల్లెలికండీ' అని అరుస్తూ లడ్డూలు పంచిపెడుతున్న కర్ణంగారి భార్యని పిల్లలంతా ఎగిరెగిరి పీకినంతపని

చేసారు. నాకు నవ్వువచ్చింది. విచిత్రంగా కన్పించిదికూడా, నావి, తనవి కలిపి రాజేశ్వరివెంట తెచ్చుకున్న గజం గుడ్డలాటి జేబురుమాలులో మూటకట్టుకుంది.

చాలామంది నాచుట్టూ, రాజేశ్వరిచుట్టూ గుమిగూడారు,

కొంతమంది రాజేశ్వరిని, 'మీ వదినటగా' అని అడిగారు.

'యీచీర ఆ అమ్మాయిదా ?' రాజేశ్వరిచీర పరీక్షచేస్తూ అడిగారు.

రాజేశ్వరి సగర్వంగా ఔను అన్నట్టు తలూపింది.

కొంతమంది నాచీరకూడా పరీక్షచేసి 'ధరఎంత ?' అన్నారు.

నాకు తెలియదన్నాను. నిజంగానే నాకు తెలియదు.

చాలా వుంటుం దనుకున్నారు ఎంతవుంటుందో అంచనా వేసారు.

మరికొంతమంది 'వుంటారా పదిరోజులు' అంటూ పలకరించారు.

యింకొందరు, 'మాయింటికి రండి' అంటూ ఆహ్వానించారు.

చాలా ప్రశ్నలకి నాతరపున రాజేశ్వరే జవాబు యిచ్చింది.

---



---

కర్ణంగారిభార్య నా జబ్బపట్టుకుని, నలుగురైదుగురు పెద్దవాళ్ళ దగ్గరకు తీసుకెళ్ళి 'మన హనుమంతు కూతురు' అంటూ చూపించింది

నామనసు పురివిప్పిన నెమలిలా అయింది. యిన్ని సంవత్సరాలకి, మొట్టమొదటి సారిగా, నాకెంతో ప్రియమైన మానాన్న కూతురిగా నేను నలుగురిలోనూ చెప్పుకో బడ్డాను. గుర్తింప బడ్డాను. నాకు చాలా ఆనందం వేసింది తీరని కోరికేమో అని భయపడ్డ నాకు ఆకోరిక తీరింది.

చాలా సేపయింది. పేరంటానికి వచ్చినవాళ్ళలో చాలామంది వెళ్ళిపోయారు.

రాజేశ్వరీ, నేనూ వచ్చేస్తోంటే, కర్ణంగారిభార్య రాజును వెనక్కు పిలిచి, యింకా కొన్ని లడ్డూలు, చలిమిడి వుండలు అరటిపళ్లు యిచ్చి, "కష్ణుడికి పెట్టవేరాజూ! వాడీ మధ్య ఆతోటహడావుడిలో పడి మరీ బొత్తిగా మాయింటికి రావటం మానేశాడు. అమ్మమ్మకి కోపం వచ్చిందని చెప్పు." అంది. రాజేశ్వరి అవికూడా మూట కట్టుకుని, అలాగేనన్నట్టు తలూపింది.

'వెళ్ళేలోపల యీ అమ్మాయి నువ్వూ ఒకసారి మాయింటికి భోజనానికి రండి. నేనుమళ్ళీ కబురుచేస్తాలే' అంది.

రాజేశ్వరి మళ్ళీ తలూపింది.

ఆవిడ వీధి వాకిలివరకూ వచ్చి మమ్మల్ని సాగనంపింది.

మేం యింటికి వస్తుండగా దోవలో యిద్దరు ముగ్గురు వాళ్ళయిళ్ళకి రమ్మని పిలాచ్చరు.

రాజేశ్వరి ఆగకుండానే. నడకని మరింత వేగంచేస్తూ, 'ఇప్పుడు కాదు. రేపు వస్తాం,' అని నమ్రతగా మర్యాదగా జవాబు యిచ్చింది

యింటి గుమ్మంలో అడుగు పెడుతూండగా - నేను కావాలనే కాస్త వ్యంగ్యంగా, హేళనగా, 'రాజూ ! మీ అన్నయ్యపని భలే బావుందే. చీరా, జాకెట్టు కట్టుకుని. పేరంటానికివచ్చే ప్రయాస లేకుండానే లడ్డూలు కొట్టేశాడు' అన్నాను.

రాజేశ్వరి అదిరిపడిన దానిలా నావైపు తిరిగింది.

అర్థం గాని దానిలా చూసింది.

నామాటలతో రాజేశ్వరి చివుక్కుమన్న మనసు కళ్ళలో స్పష్టంగా ప్రతిఫలించింది.

నేను కొంచెతనం తెచ్చిపెట్టుకుంటూ. 'నాకు తెలుసున్లే కర్ణంగారి భార్య మీ అన్నయ్యకి వాయినం యివ్వడం నేను చూసాలే' అన్నాను.

రాజేశ్వరి చిన్నబుచ్చుకున్న ముఖంతో అంది.

'ఛ ఛ అదేంకాదు. వాళ్ళకి అన్నయ్య కొడుకుతో సమానం. క్రిందటి సంవత్సరం వాళ్ళ యింట్లో అందరికీ అమ్మవారు అయితే అన్నయ్య ఎంత చేశాడో తెలుసా. ఏ బంధువులు, ఏ స్నేహితులూ చెయ్యనంతసాయం చేసాడు. ఆవిడకి ఆ కృతజ్ఞత చాలావుంది. అదేకాదు. వూరి విషయాల్లోకూడా కర్ణంగార్కి అన్నయ్య చాలా సాయంగా వుంటాడు. వాళ్ళింటో ఏం చేస్తున్నా ఆవిడ అన్నయ్యకి ప్రత్యేకంగా పంపిస్తుంది" యిద్దరం యింట్లోకి వచ్చేయడంవల్ల నాకు ఎలాటి కామెంట్ చేయ డానికి అవకాశం చిక్కలేదు

మేం యింట్లో అడుగు పెట్టేసరికి ముందుగదిలో అత్తయ్య గుమ్మం దగ్గరగా కూర్చుని అరటికాయలు తరుగుతోంది

కృష్ణ ఆవిడ కెదురుగావున్న మంచంమీద వెల్లకిలా పడుకుని, తలక్రింద చేతులు పెట్టుకుని, పై కప్పుకేసి చూస్తూ దీర్ఘంగా ఏదో ఆలోచిస్తున్నాడు. కూర తరుగుతున్న అత్తయ్యకూడా సీరియస్‌గా వుంది.

వాళ్ళ ధోరణిచూస్తే తల్లీకొడుకులు యిద్దరూ అప్పటివరకూ ఏదో చాలా సీరియస్ ఆయిన విషయం చర్చించుకుని, పరిష్కారమార్గం తోచనివాళ్ళలా గంభీరంగా, ముభావంగా వున్నారు.

మాఅడుగుల చప్పుడువిని అత్తయ్య తలెత్తిచూసింది

కృష్ణ తలతిప్పి చూసాడు.

ఈసారి అతనిచూపులు క్షణంలో సగంసేపు నామీద స్థిరంగా నిల్చాయి. మళ్ళీ అంతలోనే అది నిజమా లేక భ్రమా అన్పించేటంత వేగంగా అంతలోనే మళ్ళీ రాజేశ్వరిమీదికి తిరిగిపోయినాయి.

అత్తయ్య మాతో ఏం మాట్లాడలేదు

పేరంటంగురించి విశేషాలేమీ అడగలేదు

మమ్మల్ని చూడగానే ముక్కలుతరిగిన గిన్నె కత్తిపీట తీసుకుని లేచి లోపలకు వెళ్ళిపోయింది.

కృష్ణ లేచి కూర్చున్నాడు.

రాజేశ్వరి వెళ్ళి అతను కూర్చున్న మంచంమీదనే జేబురుమాలు మూటవిప్పి కర్ణంగారిభార్య అన్నమాటలుచెప్పి ఆవిడ యిమ్మన్నవి యిచ్చింది. కృష్ణ ఒక లడ్డూమాత్రం తీసుకుని మిగతావి వద్దని తిరస్కరించాడు.

నేను బట్టలు మార్చుకోటానికని గదిలోకివచ్చాను. (సశేషము)

Printed and published by A. Sudhakara Rao for Yuva Publications, Hyderabad-4 and printed at Yuva Press, Public Garden Road - Hyderabad - I. Phone 36336
Controlling Editor: Sri "CHAKRAPANI"

# అమృతాంజనము



## దగ్గు, జలుబులను చప్పున తగ్గించే చల్లని మందు



- అమృతాంజనము ఏవిధంగానూ హాని చెయ్యదు నొప్పి వున్నచోట కొద్దిగా రాస్తే చాలు
- అమృతాంజనము నొప్పిని త్వరగా తగ్గిస్తుంది ఇందులో అత్యంత శక్తివంతమైన పది ఔషధాలున్నాయి
- అమృతాంజనము రాసుకుంటే చల్లగా హాయిగా వుంటుంది ఇందులో కర్పూరం, మెంథాల్ మొదలైనవి చేరివున్నాయి
- అమృతాంజనము ఖర్చు ఆదాచేస్తుంది ఒక్క సీసా ఎంతోకాలం ఆటివస్తుంది




అమృతాంజన్ లిమిటెడ్.
మద్రాసు బొంబాయి కలకత్తా
న్యూఢిల్లీ హైదరాబాదు




Tel AMR : 12

